53

# నా జీవితము

మోహన్‌దాస్ కరంచంద్ గాం

సంస్కృతి ప్రచురణ—23

వెల రూపాయిన్నర

# నా జీవితము

Na jeevitamu.

రచన:


మోహన్‌దాస్ కరంచంద్ గాంధి

Mohandas Karamchand Gandhi


గుజరాతి భాషనుంచి
ఆంగ్ల అనువాదము—క్లుప్తీకరణము :

మహదేవ్ దేశాయ్

Mahadev Desai

ఆంధ్రీకరణము :

పోలవరపు శ్రీరాములు

Polavarapu Sriramulu.


సంస్కృతి ప్రచురణ

వెల రూ. 1–8–0

Mahatmaji wrote his autobiography in Gujarati. It was translated into English by Shri Mahadev Desai and was named 'An Autobiography or The Story of My Experiments with Truth.' The same has been Arranged and Edited for school use by Shri Mahadev Dasai and was published with the title 'My Early Life.' This book has already seen nine impressions.

We are very thankful to M/s. Oxford University Press, Madras for granting us permission to bring out this Telugu version.

PUBLISHERS.

మహాత్ముడు తన జీవితగాథను తన మాతృభాషయైన గుజరాతీలో రచించారు. దానినే కీ॥ శే॥ శ్రీమహాదేవ్ దేశాయిగారు ఆంగ్లంలోకి అనువదించారు. ఈ ఆంగ్లానువాదంనుంచి ఆంధ్రీకరింపబడిన గ్రంథాన్ని 'ఆత్మ కథ' అను పేర ఆంధ్రపత్రికాధిపతులు ప్రకటించి యున్నారు.

పాఠశాలలలోని విద్యార్థుల పఠనార్థం శ్రీ మహదేవ్ దేశాయిగారు ఆంగ్ల గ్రంథాన్ని క్లుప్తీకరించి వ్రాశారు. దానిని ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటి ప్రెస్‌వారు ప్రచురించారు. ఏతద్ రచన ఆంధ్రీకరణకు, ప్రచురణకు అనుమతి యిచ్చిన ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీవారికి, అనువదించి యిచ్చిన మిత్రులు శ్రీ పోలవరపు శ్రీరాములుగారికి కృతజ్ఞులం.

ప్రకాశకులు.

# 1. బాల్యం

మా నాన్న కాబా గాంధికి డబ్బు కూడబెట్టాలనే ఆశ ఎన్నడూ వుండేదికాదు. బహుకొద్ది ఆస్తిని మాత్రమే మాకు ఇచ్చిపోయినాడు.

అనుభవ జ్ఞానంతప్ప ఆయనకు విద్య ఏమీ లేదు. మహా చదివితే గుజరాతీ భాషలో ఐదవతరగతి వరకూ చదివాడేమొ. దేశచరిత్రగాని, భూగోళ శాస్త్రంగాని ఆయనకు తెలియవు. లోక వ్యవహారాలలో విశేషానుభవం గడించిన వాడవడంచేత, ఎంత జటిల సమస్యల నైనప్పటికీ సామర్థ్యంతో చక్కగా పరిష్కరించ గలిగే వాడు. వందలాది ప్రజలకు సంబంధించిన వ్యవహారా లైనప్పటికీ, సభాయించుకు రాగలిగేవాడు.

మతవిషయాలలో ఆయన పొందిన శిక్షణ బహుకొద్ది. దేవాలయాలకు తరచుగా వెళ్ళడంవల్లా, మత సంబంధమైన గోష్ఠిని వినడం వల్లా చాలామంది హిందువులకు మామూలుగా ఏపాటి మతపరిజ్ఞానం అబ్బుతుందో, ఆపాటిదే మా నాన్నకూ అబ్బింది. చదువుకున్న బ్రాహ్మణ మిత్రుని ప్రోద్బలం వల్ల జీవితాంత్య దశలో భగవద్గీత పఠించడం ప్రారంభించాడు. ప్రార్థన సమయంలో ప్రతిరోజూ కొన్ని గీతా శ్లోకాలను బిగ్గరగా పైకి చదువు తుండేవాడు.

తన తెగవారంటే మా నాన్నకు చాలా అభిమానంవుండేది. ఆయన సత్యసంధుడు ; ధైర్యశాలి ; ఉదార స్వభావుడు. ఐతే కోపిష్ఠి. ఇంటి వ్యవహారాలలో గాని, ఇతర వ్యవహారాలలో గాని, ఎంతో నిష్పక్షపాతంగా ప్రవర్తిస్తాడనీ, అతి విజాయితీ పరుడనీ పేరు సంపాదించాడు. రాజకోట సంస్థానానికి కొంతకాలం పాటు ప్రధాన మంత్రిగా పనిచేశాడు. ఆ సంస్థానం విషయంలో ఆయన ఎంత విశ్వాస పాత్రుడై ప్రవర్తించిందీ లోకవిది

తమే. తన అధిపతీ, రాజకోట సంస్థానాధీశుడూ అయిన థాకూర్ నవాబ్ విషయంలో అసిస్టెంట్ పొలిటికల్ ఏజెంట్ ఒకడు ఒకప్పుడు అవమానకరంగా మాట్లాడడం సంభవించింది. మా నాన్న ఆ ఉద్యోగిని మందలించాడు. అంతట ఆ ఉద్యోగికి ఆగ్రహంకలిగి, క్షమాపణ వేడవలసిందని మా నాన్నను కోరాడు. అందుకు ఆయన నిరాకరించాడు. దాని ఫలితంగా కొన్నిగంటలసేపు నిర్బంధంలో వుండి పోవలసి వచ్చింది. మా నాన్న పట్టుదలను గ్రహించిన మీదట, ఆ ఏజంటు ఆయనను నిర్బంధం నుంచి విడుదల చేయవలసిందని ఉత్తర్వు చేశాడు.

మా అమ్మ అతి పవిత్రురా లనేభావం నా మనస్సులో బాగా నాటుకుపోయింది. ఆమె చాలా నిష్ఠాగరిష్ఠ. ప్రతిరోజూ ప్రార్థన చేయందే, భోజనం చేసేది కాదు. విష్ణాలయానికి వెళ్ళడం ఆమె నిత్యవిధులలో ఒకటి. ఆమె ఒక్కసారైనా చాతుర్మాస వ్రతాన్ని ఆచరించకుండా వున్నట్లు నాకు జ్ఞాపకం లేదు. అతి కఠినమైన వ్రతాలను సంకల్పించి, బహునిష్ఠతో ఆచరించేది. జబ్బు చేసినప్పటికీ వ్రత నియమాలను విడిపించడమనే ఆచారం ఆమెకు లేదు. ఒకప్పుడు చాంద్రాయణ వ్రతాచరణ * సమయంలో ఆమె జబ్బుపడినట్లు జ్ఞాపకం. ఐనప్పటికీ వ్రతాన్ని నిర్విఘ్నంగా కొనసాగించింది. రెండు, మూడు రోజులు వరసగా ఉపవసించడం ఆమెకు ఒక లెక్కలోనిది కాదు. చాతుర్మాస వ్రతసమయంలో ఒంటిపూట భోజనమే. అంతటితో పూరుకొనక ఒక్కొక మాసంలో రోజు మార్చి రోజు మాత్రమే భోజనం చేసేది. సూర్యదర్శనం కాగానే, ఆ వర్తమానం మా అమ్మకు చెప్పడానికి పిల్లవాళ్ళమైన మేమందరం ఆకాశం వంకచూస్తూ నిలుచుని వుండేవాళ్ళము. వర్షాలు బహు జోరుగా కురిసే రోజులలో, సూర్యభగవానుని దర్శన భాగ్యం తరుచు లభ్యంకాదనే విషయం అందరికీ తెలిసినదే. సూర్య

* చంద్రకళల హెచ్చు తగ్గులనుబట్టి ఆహారాన్ని హెచ్చించడం తగ్గించడం ఈ వ్రత నియమం.

దర్శనం కాగానే, పరుగెత్తు కొని వెళ్ళి ఆ విషయాన్ని మా అమ్మకు చెప్పిన రోజులు నాకు బాగా జ్ఞాపకం వున్నవి. మేము చెప్పడమే తడ వుగా, ఆమె సూర్యభగవానుని దర్శనంకోసం గబగబా బయటికి వచ్చేది. కాని, ఏమి లాభం ? ఆమె వచ్చేలోపుగానే, సూర్యభగవానుడు ఇట్టె అదృశ్యుడయ్యేవాడు. అందువల్ల ఆమె భోజనానికి వీలుండేదికాదు. "పోనీలే, ఏమీ ఫరవాలేదు ; నేను ఈ రోజు భోజనం చేయకూడదని భగవదేచ్ఛ కాబోలు" అనేది సంతోషంగా. అలాఅని, తనపని తాను చూచుకునేది.

మా అమ్మకు బలిష్టమైన ఇంగిత జ్ఞానంవుండేది. సంస్థానాధీశుని కుటుంబానికి చెందిన స్త్రీలు మా అమ్మ తెలివితేటలను గురించి ఎంతోసద భిప్రాయ పడేవాళ్ళు. చిన్నవాడినైన నేను, బాల్యాన్ని సాకుగా తీసుకొని, మా అమ్మతోపాటు సంస్థానాధీశుని భవనానికి వెళ్ళుతుండే వాడిని. ఠాకూర్ సాహెబు తల్లి వితంతువు. మా అమ్మ ఆమెతో జరిపిన ప్రతిభా పూర్వకమైన చర్చలలో ఎన్నో నాకు ఇప్పటికీ జ్ఞాపకం వున్నవి.

కథియవాడ్ కు చెందిన పోర్బందరులో—దీనికే సుధామపురి అని మరొకపేరు—ఈ దంపతులకు నేను 1869, అక్టోబరు 2-వ తేదీన జన్మించాను. నా బాల్యాన్ని పోర్ బందరులోనే గడిపాను. నన్ను బడిలో వేయడం నాకు బాగా జ్ఞాపకం వున్నది. కొంత కష్టపడితేనే గాని ఎక్కాల గుణకారం నాకు రాలేదు. మిగతా కుర్రవాళ్ళతో కలసి మా ఉపాధ్యాయుణ్ణి దూషించడం మాత్రమే నేను నేర్చుకున్నట్లు గుర్తు. ఇంతకుమించి ఆనాటి సంగతులు నాకేవీ జ్ఞాపకం లేవు. ఆనాటి నాబుద్ధి మాంద్యతకూ, జ్ఞాపకశక్తి హైన్యతకూ దీన్నే ప్రబల సూచనగా ఎంచవచ్చు.

# 2. విద్యాభ్యాసం

రాజస్థానంలో ఉద్యోగం స్వీకరించడానికి మా నాన్న పోర్బందర్ నుంచి రాజకోటకు వెళ్ళేసరికి నాకు దాదాపు ఏడు సంవత్సరాల వయస్సు వుంటుంది. రాజకోటలో నన్ను ఒక ప్రైమరీ పాఠశాలలో చదవ వేశారు. ఆ పాఠశాలలో నాకు విద్యనేర్పిన ఉపాధ్యాయుల పేర్లూ, వారికి సంబంధించిన ఇతర విషయాలూ అన్నీ ఈ నాటికీ నాకు చక్కగా జ్ఞాపకం వున్నవి. పోర్బందర్‌లో లాగే, ఇక్కడ కూడా నా విద్యాభ్యాసం విషయమై చెప్పవలసిన విశేషమేమీ వున్నట్లు తోచదు. చదువు సంధ్యల విషయంలో నా పరిస్థితి మధ్యమంగానే వుండివుంటుంది. ఈ ప్రైమరీ పాఠశాలనుంచి మొదట ఒకపట్టణ పాఠశాలలోనూ, తర్వాత ఒక హైస్కూలు లోనూ, నన్ను చేర్చారు. అప్పటికే నాకు పన్నెండవ యేడువచ్చింది. ఆ కొద్ది వ్యవధిలో నా ఉపాధ్యాయులతో గాని, సహాధ్యాయులతో గాని, ఎన్నడూ ఒక్క అబద్ధమైనా ఆడినట్లు జ్ఞాపకం లేదు. నాకు బహుసిగ్గుగాను, బిడియంగాను వుండేది. ఎవరితోనూ కలసి మెలసి తిరిగేవాణ్ణి కాను. నా పుస్తకాలేమో పాఠాలేమో, అవే నా సహచరులు. సరిగా గంటకొట్టేవేళకు బడిలో వుండడం, బడిమూసీ మూయగానే ఇంటికి పరుగెత్తి పోవడం,—ఇదీ నా దినచర్య. ఎవరితో మాట్లాడుదా మనుకున్నా దుర్భరంగా తోచేది; అందువల్ల గబగబా పరుగెత్తి ఇంటికి వెళ్ళేవాణ్ణి; ఎవరైనా నన్ను వేళాకోళం చేసే మాటలంటారేమో ననే భయంకూడా వుండేది.

నేను హైస్కూలులో చదువుతున్న మొదటి సంవత్సరంలోనే పరీక్షసందర్భంలో ఒక సంఘటన జరిగింది. ఇది చెప్పదగిన సంఘటనే. స్కూలు తనిఖీచేయడానికి ఎడ్యుకేషనల్ ఇన్‌స్పెక్టర్ గైల్స్ అనే అతడు

వచ్చాడు. ఇంగ్లీషులో మాకు స్పెల్లింగ్, ఏ మాత్రంవచ్చో పరీక్షించడా నికి ఐదుమాటలు చెప్పి వ్రాయుమన్నాడు. వాటిలో "కెటిల్" (Kettle) అనేది ఒకటి. ఆ మాటను నేను తప్పువ్రాసాను. నాతప్పు గమనించి దాన్ని నేను సవరించుకునే టట్లు చూడడానికి మా ఉపాధ్యాయుడు తన బూట్ కొనతో ఏదో సైగచేసి కొంత తాపత్రయ పడ్డాడు. ఐతే నేను ఆ సైగను గ్రహించలేదు. ఆ మాటలకు సరియైన స్పెల్లింగ్‌ను పక్క విద్యార్థి పలక చూసి వ్రాయవలసిందన్నది మా ఉపాధ్యాయుని సైగలోని ఉద్దేశమైనట్లు గ్రహించేశక్తి నాకు లేకపోయింది. ఒకడు వ్రాసిన దానిని మరొకడు చూసి వ్రాయకుండా కనిపెట్టి వుండడానికే మా ఉపాధ్యాయుడు అక్కడ వున్నాడని నేను అనుకున్నాను. ఆయన సైగలోని ఉద్దేశం బోధపడక పోవడానికి ఇదే కారణం. ఒక్క నేనుతప్ప మిగతా కుర్రవాళ్ళందరూ ప్రతిమాటనూ తప్పు లేకుండా వ్రాశారు. నేను ఒక్కడినే దద్దమ్మ నైనాను. నా అవివేకాన్ని నాకు ఎరుక పరచాలని మా ఉపాధ్యాయుడు తర్వాత ప్రయత్నించాడు. కాని, ప్రయోజనం లేకపోయింది. మరొకరు వ్రాసింది చూసి కాపీ చేసేకళ నాకు నాటికీ, నేటికీకూడా అబ్బలేదు.

ఈ సంఘటన కారణంగా మా ఉపాధ్యాయుని విషయంలో నా గౌరవభావం ఏ మాత్రం తగ్గలేదు. పెద్దవారి తప్పిదాలు నాకు కనబడవు; అది నా స్వభావం. ఉత్తరోత్తరా ఈ ఉపాధ్యాయుని లోటుపాట్లు అనేకం నాకు తెలియవచ్చినవి. ఐనప్పటికీ, ఆయన ఎడల నాకున్న గౌరవభావంలో మాత్రం మార్పేమి రాలేదు. ఇందుకు కారణం ఇది—పెద్దవారి ఆజ్ఞలను శిరసా వహించడమే నేను అలవరుచు కున్నాను. గాని, వారి చర్యలను పరిశీలించి, విమర్శించడం నేర్చుకో లేదు.

ఇదే సమయంలో జరిగిన ఇంకా రెండు విశేషాలు కూడా నాకు జ్ఞాపకమున్నవి. పాఠ్య పుస్తకములు చదవాలన్నప్పటికీ, నాకు మనస్కరించేది కాదు. ఏరోజు పాఠాలు ఆ రోజు చూసుకునే వాణ్ణి. ఉపాధ్యా

యుడు నన్ను దండించడం గాని, పాఠాలు చదవక ఆయనను మోస గించడం గాని నాకు ఇష్టంలేదు. అందువల్ల పాఠాలవిషయంలో జాగ్రత్త గానే వుండేవాణ్ణి. ఐతే దృష్టిమాత్రం పాఠాలపై వుండేది కాదు. ఆ పాఠాలైనప్పటికీ ఒకసారి చదివితే, సరిగా రానిపక్షంలో, శ్రద్ధతో మరొక సారి చదివే అలవాటు లేదు. ఇలావుండగా, ఒకసారి మా నాన్న కొన్న పుస్తకం ఒకటి నా కంట బడింది. అది 'శ్రావణుని పితృభక్తి నాటకం.' అతిశ్రద్ధగా దాన్ని చదివాను. అదే సమయంలో మా వూరికి "చుక్కానీ" చూపించే వాళ్ళు వచ్చారు. అంధులైన తల్లి దండ్రులను శ్రావణుడు తీర్థ యాత్రకు మోసుకొని పోతున్న చిత్రం ఒకటి వారివద్ద చూశాను. ఆనా టకం, ఈ చిత్రం రెండూ నా మనస్సులో గాఢంగా హత్తుకు పోయినవి. "అనుసరించడానికి ఇదొక ఉదాహరణ సుమా," అని నాకు నేనే చెప్పుకు న్నాను. శ్రావణుడు మరణించినప్పుడు ఆ తల్లి దండ్రుల ఘోరవిషాద ఘట్టం ఇప్పటికీ నాకు ఎంతో స్పష్టంగా జ్ఞాపక మున్నది. ఆ హృదయ విదారక దృశ్యంలో వారు పాడిన పాట వరసను, మా నాన్న నాకు కొని పెట్టిన వాయిద్యం మీద, వాయించే వాడినికూడా.

మరొక నాటకం విషయంలో కూడా ఇలాటి సంఘటనే జరి గింది. సరిగా అదేసమయంలో ఒకనాటక సమాజంవారు ప్రదర్శించిన నాటకం చూడడానికి మా నాన్న అనుమతి నిచ్చాడు. అది "హరిశ్చంద్ర నాటకం." ఆ నాటకం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. నా హృదయాన్ని చూర గొన్నది. ఆ నాటకం ఎన్నిసార్లు చూసినా విసుగుపుట్టేది కాదనుకుం టాను. కాని, దాన్ని చూడడానికి తరుచు అనుమతి యేది? ఆ నాటకం లోని ఘట్టాలు నన్ను ఆవహించినవి. లెక్క లేనన్ని సార్లు నాలో నేనే హరిశ్చంద్ర పాత్ర నభినయించి వుంటాను.

"ప్రపంచంలో అందరూ హరిశ్చంద్రునిలాగా సత్య సంధులై యెందుకు ప్రవర్తించ కూడదు?" అని నన్ను నేనే రాత్రింబవళ్ళు ప్రశ్నిం

చుకునేవాణ్ణి. హరిశ్చంద్రుడు పడిన కష్టాలన్నీ పడైనా సరే, సత్య పథాన్నే అనుసరించాలనే లక్ష్యాన్ని, ఆశయాన్ని, ఆ నాటకం నాలో ఆవిర్భ వింప జేసింది. హరిశ్చంద్రోపాఖ్యానం ముమ్మాటికీ జరిగిన కథేనని నేను నమ్మాను. ఆ కథ తలుచుకున్నకొద్దీ నాకు ఏడుపు వచ్చేది. హరిశ్చం ద్రుడు చారిత్రక పురుషుడై వుండడని నా ఇంగిత జ్ఞానాన్ని బట్టి నేను ఈ నాడు అనుకుంటున్నాను. హరిశ్చంద్రుడు, శ్రావణుడు ఉభయులు కూడా నా దృష్టిలో నిత్య సజీవమూర్తులు. ఆ రెండు నాటకాలనూ ఈ నాడు చది వినప్పటికీ, వాటిలోని గాధలు నా హృదయాన్ని తప్పక కంపిస్తవనే నమ్మకం.

హైస్కూలులో నన్ను ఒకదద్దమ్మ కింద జమకట్టేవారు కారు. ఉపాధ్యాయుల ఆదరణకు సర్వదా పాత్రుడనయే వుండేవాణ్ణి. చదువు సంధ్యలు, నడవడిక, శీలం ఏవిధంగా వున్నదీ తెలియజేసే సర్టిఫికెట్లను ప్రతిసంవత్సరం తండ్రులకు పాఠశాలాధికారులు పంపించే ఆచారం వుం డేది. అననుకూలమైన సర్టిఫికేటు నా కెన్నడూ రాలేదు. రెండవ తరగతి ప్యాసైనతర్వాత కొన్ని బహుమతులు సైతం గెలుచు కున్నాను. ఐదవ తరగతిలోవుండగా నాల్గురూపాయల విద్యార్థి వేతనమూ, ఆరవ తరగతిలో వుండగా పదిరూపాయల విద్యార్థివేతనమూ వచ్చినవి. ఇది నిజానికి గొప్ప సంగతే. ఇందుకు నా తెలివి తేటలకంటే నా అదృష్టాన్నే ఎక్కువగా నేను అభినందించుకోవలసి వుంటుంది. ఎందుచేతనంటే, ఈ విద్యార్థి వేతనాలు విద్యార్థు లందరూ పొందడానికి వీలైనవి కావు. ఇవి కథియవాడ్‌లోని సోరత్ మండలంనుంచి వచ్చే విద్యార్థులలో ఉత్తములకు మాత్రమే అని కేటాయింపు జేసినవి. నలభై మొదలు యాభైమంది వరకు మొత్తం విద్యార్థులు గల తరగతిలో ఆ నాడు సోరత్ మండలంనుంచి చదవవచ్చిన వారు బహు కొద్దిమంది మాత్రమే.

నా తెలివి తేటలను నేను ఎన్నడునూ గొప్పగా ఎంచేవాడిని కాదనే

నా జ్ఞాపకం. బహుమతులను, విద్యార్థి వేతనాలను గెలుచుకున్నప్పుడల్లా నాలో నాకే ఆశ్చర్యం వేసేది. శీలాన్ని మాత్రం బహుజాగ్రత్తతో కాపాడుకునే వాణ్ణి అణుమాత్రం తప్పిదం చేసినా నా కళ్ళవెంట, బొటబొట, నీళ్ళు కారేవి. ఉపాధ్యాయుడు నన్నెప్పుడైనా గద్దించినా, గద్దించాలని ఆదేశించినట్లు తోచినా అది నాకు దుస్సహమై తోచేది. ఒకప్పుడు మా ఉపాధ్యాయుడు నన్ను బెత్తంతో కొట్టినట్లు జ్ఞాపకం. ఆయన ఆ విధంగా శిక్షించినందుకు నేను అట్టే విచారించలేదు; ఆ శిక్షకు అర్హుడనైనాను కదా అని బాధపడ్డాను. నా స్థితికి నేనే జాలిపడి ఏడిచాను. ఇది నేను మొదటి తరగతిలోనో, రెండవతరగతిలోనో వుండగా జరిగినవిషయం. ఏడవతరగతిలో వుండగా కూడా ఇలాటిదే మరొక సంఘటన జరిగింది. దొరాబ్జి ఎదుల్జీ జిమీ అనే ఆతడు మాకు హెడ్‌మాస్టర్‌గా వుండేవాడు. బహు ఖరాఖండి అయినప్పటికీ, ఆయన విద్యార్థులందరికీ చాలా ఇష్టుడు. మంచి బోధకుడు. ఏపని చేసినప్పటికీ, బాగా పకడ్‌బందీగా, పద్ధతిలో చేయాలని ఆయన వాదన. పై తరగతులలో వున్న వారికి క్రికెట్ ఆటను, కసరతునూ విధిగా అభ్యసించాలనే నియమంపెట్టాడు. ఈ రెండూ అంటే నాకు అయిష్టం. వీటిని నిర్బంధ శిక్షణచేయకముందు ఏ వ్యాయామంలో గాని, క్రికెట్, ఫూట్‌బాల్ మొదలైన ఆటలలోగాని నేను ఎన్నడూ పాల్గొనలేదు. వీటికి దూరంగా వుండడానికి నా బిడియమే ఒక కారణం. ఆటలలో అప్పుడు ఆ విధంగా పాల్గొనక పోవడం తప్పేనని ఇప్పుడు గ్రహించగల్గుతున్నాను. విద్యాభ్యాసంతో కసరతుకు ఏ విధమైన సంబంధమూ లేదనే దురభిప్రాయ మొకటి ఆ నాడు నాకువుండేది. విద్యా విధానంలో మానసిక శిక్షణకు ఎంతప్రధానమైన స్థానమున్నదో, దైహిక శిక్షణకూ అంతే ప్రధానమైన స్థానమున్నదని ఇప్పుడు తెలుసుకున్నాను.

ఏది ఎల్లాగైనప్పటికీ ఆ నాడు వ్యాయామ శిక్షణలో పాల్గొనకపోయినందుకు నేను నష్టపడ్డ దేమీ లేదేమోనని కూడా చెబుతున్నాను

వాహ్యాళి వెళ్ళి బయట చాలాదూరం నడవడంవల్ల చేకూరే ప్రయోజనాలను గురించి పుస్తకాలలో చదివి తెలుసుకున్నాను. ఆ పద్ధతి నాకు నచ్చింది. అనుదినమూ వాహ్యాళి వెళ్ళి రావడం అలవాటు చేసుకున్నాను. ఇప్పటికీ ఆ అలవాటు పోలేదు. ఇందువల్లనే నాకు మంచి శరీరపటుత్వం ఏర్పడింది. వ్యాయామ శిక్షణ విషయమై శ్రద్ధ తీసుకోనందువల్ల అట్టే నష్టమేమీ లేకపోయి నప్పటికీ, మరొక విషయంలో అలక్ష్య భావం చూపినందుకు ఇప్పటికీ ప్రతిఫలం అనుభవిస్తున్నాను. మంచిదస్తూరీ వ్రాయడం విద్యావిధానంలో ముఖ్యమైన విషయం కాదనే భావం ఎక్కడనుంచి వచ్చి నా మనస్సులో దూరిందో నాకు తెలియదు. ఇంగ్లండు వెళ్ళేవరకూ నన్నీ దురభిప్రాయం వదలలేదు. అసహ్యమైన దస్తూరీ వ్రాయడం విద్యావిధానంలోని లోటేనని తర్వాత తెలుసు కున్నాను. చక్కని దస్తూరీ వ్రాయగలిగి వుండడం విద్యా విధానంలో ముఖ్యమైన భాగమేనని ప్రతి యువకుడు, యువతీ గ్రహించడం మంచిది.

నా చిన్ననాటి విషయాలు ఇంకా రెండు కూడా చెప్పదగినవి. నాల్గవతరగతి నుంచే అనేక విషయాలను ఇంగ్లీషు భాషలో బోధిస్తుండే వారు. అందువల్ల ఉపాధ్యాయుల బోధనఅంతా పెద్ద అగాధమై తోచింది. క్షేత్రగణితమును (జామెట్రీ) ఆ తరగతిలోనే కొత్తగా ప్రారంభించారు. దాన్ని ఇంగ్లీషులో బోధించడం వల్లనే అది నాకు మరీకష్టమనిపించింది. ఉపాధ్యాయుడు సమర్థుడే. ఐతే ఆయన చెప్పేది నాకు బోధపడేదికాదు. మొత్తంమీద తీవ్ర కృషిచేసి, యూక్లిడ్‌లో పదమూడవ థీరం వరకూ పఠించిన పిమ్మట, క్షేత్రగణితంలో వున్న సౌలభ్యం నాకు హఠాత్తుగా విశదమైంది. క్షేత్రగణితాధ్యానం కష్టసాధ్యమైనది కాదనీ, కేవలం హేతువాద సామర్థ్యం పైనే ఆధారపడి వున్నదనీ తెలుసుకో గలిగాను. అప్పటినుంచీ అది నాకు సులభంగానే గాక, హృద్యంగా కూడా కనిపించింది.

సంస్కృత భాషాభ్యాసం మాత్రం మరీ కఠినమైతోచింది. క్షేత్ర

గణితంలో కంఠతః అప్పగించ వలసిందేమీ లేదు. సంస్కృతంవిషయం అలాలేదు. ప్రతివిషయాన్ని కంఠతః నేర్చుకో వలసిందే. సంస్కృతాభ్యాసంకూడా నాల్గవ తరగతినుంచే ప్రారంభం. ఆరవ తరగతిలో చేరినతర్వాత సంస్కృతం విషయంలో అధైర్య పడసాగాను. సంస్కృత పండితుడు చండశాసనుడు. విద్యార్థులను కఠినంగా నిర్బంధించైనా సంస్కృతం బోధించాలని చూసేవాడు. ఆ పాఠశాలలో సంస్కృత పండితుడికీ, పర్షియన్ పండితుడికీ ఒక విధమైన పోటీవుండేది. పర్షియన్ ఉపాధ్యాయునిది దయా స్వభావం. పర్షియన్ భాష చాలా సుళువైనదనీ ఆ ఉపాధ్యాయుడు ఎంతో మంచివాడనీ, విద్యార్థుల కష్టసుఖాలు తెలుసుకో గలిగిన వాడనీ, పిల్లవాళ్ళందరమూ—మాలో మేము—అనుకుంటూ వుండే వాళ్ళము. ఆభాషా సౌలభ్యం నన్ను ఆకర్షించింది. ఒకరోజు వెళ్ళి ఆ తరగతిలో కూర్చున్నాను. సంస్కృత పండితుడికి అది చాలా బాధకరమైతోచింది. నన్ను తనవద్దకు పిలిపించుకొని ఇలా సలహా ఇచ్చాడు—"వైష్ణవ మతస్థుడి కుమారుడివనే విషయాన్ని నీవు ఎలా మరచి పోగలవు? నీ మతానికి చెందిన భాషనే నీవునేర్చుకోవా? నీ కేదైనా కష్టమని తోస్తే నన్ను ఎందుకు అడుగకూడదు? నా శక్తి కొద్ది మీ కందరికీ సంస్కృతం నూరి పోయాలని నేను అనుకుంటున్నాను. ముందు ముందు పోయినకొద్దీ సంస్కృత భాషలో బహుహృద్యమైన విషయాలను మీరు తెలుసు కుంటారు. మొదటే అధైర్యపడకూడదు. వచ్చి మళ్ళీ యథాప్రకారం సంస్కృతం తరగతిలో కూర్చో."

ఇంత దయగా ఆయనచెప్పిన మాటలు నా మనస్సును కరిగించి వేసినవి. ఆప్యాయంగా ఆయన ఇచ్చిన సలహాను అలక్ష్యం చేయలేకపోయాను. కృష్ణశంకర్ పాండ్యాకు (సంస్కృతోపాధ్యాయుడు) నేటికీ నేను కృతజ్ఞుడనే. స్వల్పంగానే అయినప్పటికీ ఆనాడు ఆ విధంగా సంస్కృత భాషను నేను నేర్చుకోక పోయినట్లయితే, మన పవిత్ర మత గ్రంథా

లలో శ్రద్ధ తీసుకోవడమే నాకు సాధ్యమయేది కాదు. సంస్కృతం ఇంత కంటే యెక్కువగా నేర్చుకొన లేదుకదా ! అవి నిజానికి చాలా విచారపడు తున్నాను. ప్రతి హిందూబాలుడు, హిందూబాలిక సంస్కృతం బాగానేర్చు కోవడం అవసరమనే నాకు తర్వాత తోచింది.

భారతీయ పాఠశాలల్లోని ఉన్నత విద్యావిధానంలో హిందీ, సంస్కృతం, పర్షియన్, అరబిక్, ఇంగ్లీషు భాషలన్నిటికీ స్థానంవుండి తీరాలనే నా అభిప్రాయం. అన్ని విషయాలను మాతృభాషలోనే బోధిం చాలి. ఇంతపెద్ద జాబితా చూసి ఎవరూ భయపడ నక్కరలేదు. మన విద్యా విధానం సత్యమైన, సక్రమమైన పద్ధతిపై సాగుచున్నట్లయితే, వివిధ విష యాలను విద్యార్థులు విదేశీ భాషలోనే నేర్చుకోవాలనే అగత్యం లేకపోయిన ట్లయితే, ఎన్ని భాషలనైనా చిక్కులేకుండా నేర్చుకోవచ్చుననే నానమ్మకం. ఒకభాషను శాస్త్రయుక్తంగా, క్షుణ్ణంగా నేర్చు కునే పక్షంలో మిగతా భాష లను నేర్చుకోవడం సులభమైన పనే నవి నామతం.

హిందీ, గుజరాతీ, సంస్కృత భాషలను వాస్తవానికి ఒకభాషగానే లెక్కకట్టవచ్చు. పర్షియన్, అరబిక్ భాషలను కూడా ఒకే భాషగా పరి గణించ వచ్చు. పర్షియన్ భాష ఆర్యభాషా కుటుంబానికీ, అరబిక్ భాష సిమెటిక్ భాషా కుటుంబానికీ చెందిన వైనప్పటికీ పర్షియన్ అరబిక్ భాషలు రెండింటికీ సన్నిహిత సంబంధం వున్నది. ఈ రెండుభాషలూ ఇస్లాం మతాభివృద్ధిని అనుసరించే సంపూర్ణ వికాసాన్ని పొందినవి. ఉర్దూ భాషను నేను ప్రత్యేక భాషగా పరిగణించను. ఎందుచేతనంటె ఉర్దూభాషలో హిందీభాష వ్యాకరణాన్నే అనుసరించారు. ఉర్దూభాషలోని పదజాల మంతా చాలావరకు పర్షియన్, అరబిక్ భాషలనుంచి తీసుకున్నదే. గుజ రాతీ, హిందీ, బెంగాలీ, మరాఠీ భాషలను బాగా నేర్చుకో దలచిన ప్రతి వ్యక్తి సంస్కృతం ఏ విధంగా తప్పక నేర్చుకోవాలో, అలాగే ఉర్దూ

భాషను బాగా నేర్చుకోదలచిన వ్యక్తికూడా పర్షియన్, అరబిక్ భాషలను నేర్చుకొనక తప్పదు.

---

# 3. వివాహం — మాంస భక్షణ

నాకు పదమూడవ ఏటనే వివాహమైందని విధిలేక ఇక్కడ చెప్ప వలసి వచ్చినందుకు బాధపడుతున్నాను. ఇప్పుడు అదేవయస్సుగల కుర్ర వాళ్ళు కొందరు అదుపాజ్ఞలలో వున్నారు. వారిని చూసి నా వివాహాన్ని తలుచుకున్న కొద్దీ నాస్థితి నాకే జాలి గొలుపుతుంది. నేను పడిన దౌర్భాగ్య స్థితిలో వారు పడనందుకు వారిని అభినందించాలని అనిపిస్తుంది. ఇంత విపరీతమైన చిన్నవయస్సులోనే వివాహం చేయడాన్ని నైతికంగా సమర్థిం చడానికి ఏ విధమైన వాదనా కనబడదు. నా పెళ్ళి నాటికి ఇంకా హైస్కూ లులో చదువుతునే వున్నాను. నేటి మన హిందూసమాజంలో మాత్రమే విద్యాభ్యాసం—వివాహకాండ ఈ విధంగా వంతు వేసుకొని నడు స్తున్నవి.

ఇక్కడ నేను చెప్పవలసి వున్న మరొక బాధకరమైన విషయమే మిటంటే దుస్సాంగత్యంలో పడిపోవడం. దీన్ని నా జీవితంలో ఒక విషాద గాథగా ఎంచుతాను.

నా సహచరుడు మొదట మా అన్నగారి మిత్రుడు. వారు ఉభయులూ సహాధ్యాయులు. నా సహచరుని లోటు పాట్లు తెలుసుకున్నాను. ఐతే, అతనిని విశ్వాసపాత్రుడైన మిత్రుడని ఎంచాను. చెడు సహవాసం చేస్తున్నా నని మా అమ్మ, నా జ్యేష్ఠసోదరుడు, నాభార్య హెచ్చరిక చేశారు. భర్త

ననే అహంకార భావంతో భార్య హెచ్చరికను లెక్కచేయలేదు. మా అమ్మ మాటనూ, నా జ్యేష్ఠసోదరుని మాటనూ ధిక్కరించే ధైర్యం నాకు లేదు. నా సహచరుడి దుర్గుణాలే గాక, సుగుణాలు కూడా నాకు తెలుసు ననీ, అతనిని సంస్కరించాలన్నదే నా ఉద్దేశమనీ వారితో వాదించాను.

నా వాదన వారిని సంతృప్తి పరచిందనుకోను. ఐతే, నా సదుద్దేశాన్ని మాత్రం వారు ఆమోదించి, నా చిత్తమొచ్చినట్లు నన్ను పోనిచ్చారు.

నేను పొరపాటుచేశానని పిమ్మట తెలుసుకున్నాను. ఎవరినైతే సంస్కరిద్దామనుకుంటామో ఆ వ్యక్తితో సంస్కర్త కాదలచినవ్యక్తి సన్నిహిత సంపర్కం పెట్టుకో కూడదు. వాస్తవమైన స్నేహం ఆత్మైక్యతే. కాని, ఈ ప్రపంచంలో ఇట్టిస్నేహం బహు అరుదుగా కనిపిస్తుంది. ఉభయుల స్వభావాలు ఒకటైతేగాని, ఎన్నదగిన, స్థిరమైన మైత్రి కుదరదు. స్నేహితులలో ఒకరి స్వభావం మరొకరి స్వభావంమీద పరస్పరంగా పని చేస్తుంది. ఇందువల్ల స్నేహమార్గరీత్యా సంస్కరణకు బహుస్వల్ప అవకాశం మాత్రమేవున్నది. ఒకరితో ఒకరు ప్రత్యేక సన్నిహితత్వం పెట్టుకో కూడదనే నా అభిప్రాయం. ఎందుకంటే మానవునికి సుగుణంకంటే దుర్గుణమే ఎక్కువ త్వరగా అలవడుతుంది. భగవంతునితో స్నేహాన్ని అర్థించే ప్రతివ్యక్తీ ఏకాంత వాసమేచేయాలి; ప్రత్యేకించి ఒకవ్యక్తినిగాక సర్వ ప్రపంచాన్నీ స్నేహితుడనే పాటించవలసి వుంటుంది. నేను తప్పుచేసివుండవచ్చు. సన్నిహిత స్నేహభావ స్థాపన నిమిత్తం నేను చేసిన కృషి విఫలమైంది.

ఈ మిత్రుడితో నాకు తొలిపరిచయం ఏర్పడినప్పుడు రాజకోట సంస్థానంలో అదొక రకమైన "సంస్కరణాభిలాష" విజృంభిస్తున్నది. మా ఉపాధ్యాయులలో చాలమంది రహస్యంగా మాంసం తింటున్నారనీ, మద్యపానం చేస్తున్నారనీ ఈ మిత్రుడు నాతో అన్నాడు. రాజకోట సంస్థా

నంలో ప్రసిద్ధులైన పురుషులే చాలామంది ఈ పని చేస్తున్నట్లు పేర్లుకూడా చెప్పాడు. కొంతమంది హైస్కూలు విద్యార్థులుకూడా మద్యపానంలో, మాంసాహారంలో పాల్గొంటున్నారని కూడా తెలియ జేశాడు.

ఇది వినగానే నాకు ఆశ్చర్యంవేసింది ; మనస్సు బాధపడ్డది. దీని కంతకూ కారణ మేమైవుంటుందని ఆ మిత్రుణ్ణి అడిగాను. అతడు ఈ విధంగా చెప్పాడు—"మనం మాంసం తినంకాబట్టే మనజాతి ఇంతదుర్బలంగావున్నది. ఇంగ్లీషు వారు మనపై రాజ్యమేల కలుగుటకు వాళ్ళు మాంసాహారులు కావడమే కారణం. నేను ఎంత ఉక్కుముక్కలాగా వున్నానో, ఎంత బాగా పరుగెత్తగలనో నీకుతెలుసుకదా ? దీనికి కారణం నేను మాంసాహారిని కావడమే. మాంసాహారులకు వ్రణాలుగాని, కణుతులుగాని వేయవు. అధవా ఒకవేళ వేసినప్పటికీ, ఇట్టేనయమైపోతవి. మన ఉపాధ్యాయులు, మిగతా పెద్ద పెద్దవాళ్లు మాంసం తింటున్నారంటే, అవివేకులై ఆ విధంగా చేయడంలేదు. మాంసా హారంలోవున్న సుగుణాలను గ్రహించే వారు ఆ విధంగా చేస్తున్నారు. నీవుకూడా ఇదేపద్ధతిని అవలంబించాలి. దీనిసుగుణం తెలుసుకోవాలంటే తిని చూడడాన్ని మించిన పద్ధతేలేదు. ఒక్కసారి తినిచూడు ; ఎంతబలం వచ్చేదీ నీకే తెలుస్తుంది."

మాంస భక్షణను సమర్ధిస్తూ మిత్రుడు ఈ వాదన లన్నిటినీ ఒకే ఒకరోజున చెప్పలేదు. నా చేత ఒప్పించడానికి అప్పుడప్పుడు జరిగిన దీర్ఘ చర్చలలో చెప్పిన వాదనల సారాంశమే ఇది. మా అన్నగారు అప్పటికే మాంసాహారం ప్రారంభించాడు. అందుచేత, అతడు నా మిత్రుని వాదనను బలపరచ సాగాడు. మా అన్నగారితోనూ, నా మిత్రుడితోనూ పోల్చి చూస్తే, నేను వట్టి అర్బకుడివలె కనిపించిన మాటనిజమే. వారు ఉభయులు నా కంటే బలంగా, దృఢంగా వుండేవారు. నా కంటే ధైర్యవంతులుకూడా. నా మిత్రుడి ఘనకార్యాలు విని నేను ముగ్ధుడి నైనాను. ఎంతదూరమైనా అతడు అపరిమిత వేగంగా పరుగెత్త గలిగేవాడు. "హైజంప్" లోనూ,

"లాంగ్ జంప్"లోనూ ఆరితేరిన వాడు. బెత్తంతో ఎంతకొట్టినప్పటికీ, అత డికి చీమ కుట్టినట్లయినా వుండేదికాదు. తన సాహస కృత్యాలను నాముందు తరుచు ప్రదర్శించేవాడు. తనలో లేని ధైర్యలక్షణాలు ఇతరులలో కని పిస్తే, ఎవరైనప్పటికీ దిగ్భ్రమ చెందేమాట నిజమేకదా! నా మిత్రుని సాహస చర్యలు నాకు ఆశ్చర్యాన్ని కలిగించినవి. ఈ కారణా లన్నిటివల్లా నేనూ అతడిమాదిరిగా కావాలనే గాఢవాంఛ నాలో ప్రబలింది. ఐతే, నేను దూకలేను; పరుగెత్తలేను. నేనుకూడా అతడంత దృఢకాయుణ్ణి ఎందుకు కాకూడదు?

ఇంతేకాదు. మరొక విధంగాకూడా నేను పిరికి వాడినే. దొంగ లంటేనూ, దయ్యాలంటేనూ, పాములంటేనూ నాకు అపరిమిత భయం. రాత్రిపూట ఇల్లు కదలి ఎక్కడికీ వెళ్ళేవాణ్ణికాను. చీకటిభయం విపరీతం. చీకటిలో నిద్రపోవడం నాకు అసాధ్యమైంది. ఒకవైపు నుంచి దయ్యాలు, మరొకవైపు నుంచి దొంగలు, మూడవ దిశనుంచి పాములు నా పైకి వస్తున్నట్లు అనుకునేవాణ్ణి. అందువల్ల గదిలో దీపం లేనిదే, నిద్రపో గలిగేవాణ్ణికాను. నా పక్కనే పడుకొని నిద్రిస్తున్న భార్యకు నా భయాలను గురించి చెప్పుకోవడం ఎలా? పైగా, నాకూ యౌవనం వచ్చివుండే! నాకంటె నా భార్యే ధైర్యస్థురాలని నాకు తెలుసు. ఇదంతా తలుచుకుంటే నాకే అవమానం వేసేది. పాములు, దయ్యాలు అంటే ఆమెకు భయమే లేదు. చీకటిలో ఒంటరిగా ఎక్కడికైనా వెళ్ళ గలిగేది. నా ఈలోటు పాట్లన్నీ, నా మిత్రుడికి బాగాతెలుసు. బతికివున్న పాములను చేతితోపట్టుకో గలనని నాతో చెబుతుండేవాడు. దొంగలను సవాల్ చేయగల ననేవాడు. దయ్యాలంటే అసలు తనకు నమ్మకమే లేదనేవాడు. ఇదంతా మాంసం తిన్నందు వల్లనే నని నన్ను భ్రమపెట్టేవాడు.

నర్మద్ అనే గుజరాతీ కవివ్రాసిన ఒక చిన్నగేయాన్ని విద్యార్థుల మైన మేము తరుచు చదువుతూ వుండేవాళ్ళము. దాని భావార్థం ఇది —

"చూడు, ఆజాను బాహువైన ఆంగ్లేయుడు
అల్పాంగుడైన భారతీయుణ్ణి పాలిస్తున్నాడు.
మాంసాహారుడైన కారణం చేతనే,
అతడైదు మూరల ఎత్తున్నాడు."

ఈ బోధనఅంతా నాపై బాగానే పనిచేసింది. నేను లొంగిపోయాను. మాంస భక్షణ మంచిదే ననే భావం నాలో పెంపొంద సాగింది. మాంస భక్షణవల్ల బలం, సాహసం సమకూరుతవనీ, దేశమంతా మాంసభక్షణ ప్రారంభించి నట్లయితే, ఇంగ్లీషువారిని జయించవచ్చుననీ కూడా తోచింది.

ఈ సాధనను ప్రారంభించడానికి ఒకరోజున సుముహూర్తం పెట్టుకున్నాము. మా తల్లిదండ్రులు విగ్గుతేరిన వైష్ణవ మతస్థులైన కారణంచేతా, వారియెడల నాకు అత్యంత శ్రద్ధా భక్తులు వున్న కారణంచేతా, మాంసభక్షణ రహస్యంగా చేయవలసిన అగత్యం ఏర్పడింది. నేను మాంసం తింటున్నట్లు వారికి తెలిసిందా, వారు నిలువునా నీరై పోయే మాట నిజం. పైగా, అబద్ధమాడ కూడదనే నియమం ఒకటి వున్నది. కాబట్టి, బహుజాగ్రత్త పడవలసి వచ్చింది. రహస్యంగా మాంసం తినడం తల్లిదండ్రులను మోసగించడమే అవుతుందనే విషయం నాకు అప్పట్లో తెలియ దనడానికి వీల్లేదు. ఏదోవిధంగా ఈ "సంస్కరణ"ను ఆచరణలో పెట్టవలసిందేనని సంకల్పించుకున్నాను. మాంసం తినబోతున్నది జిహ్వా చావల్యాన్ని తృప్తిపరచడానికి కాదు. మాంసం అసలు రుచిగా వుంటుందో లేదో కూడా నాకు తెలియదు. బలంగా, ధైర్యంగా వుండాలన్నదే నాకోరిక. నేనే కాదు. నా దేశీయులందరూ కూడా బలంగా, ధైర్యంగా వుండాలన్నదే నా వాంఛ. బలంగా, ధైర్యంగా వుండే ఇంగ్లీషు వారిని మనం ఓడించ గలమనీ, భారతదేశాన్ని స్వతంత్రం చేయగలమనీ కూడా నా ఉద్దేశం. "స్వరాజ్యం" అనేమాటను నేను అప్పటికి ఇంకా వినలేదు. ఐతే

స్వేచ్ఛ అంటే ఏమిటో మాత్రం తెలుసుకున్నాను. మాంసభక్షణం అనే సంస్కరణను అమలులో పెట్టబోతున్నాననే ఆవేశం నన్ను అంధప్రాయుణ్ణి చేసింది. మాంసం రహస్యంగా తినడానికి ముందుగానే ఏర్పాట్లన్నీ చేసుకున్నాను. చేసినపని తల్లిదండ్రులకు చెప్పక పోయినంతమాత్రాన అది సత్యావిదూరత కాదని నా మనస్సుకు నేను, తప్పు దారిలో, సమాధానం చెప్పుకున్నాను.

అనుకున్న రోజువచ్చింది. నా అవస్థను పూర్తిగా వర్ణించడమే కష్ట మని పిస్తున్నది. జీవితంలో అతిప్రధానమైన సంస్కరణను అవలంబించి, మాంసభక్షణ ప్రారంభించ బోతున్నాననే ఉత్సాహాతిశయం ఒక వైపు. పట్టుదలవహించి ఏ పని చేయబోతున్నానో ఆ పనినే ఇతరులకు తెలియకుండా దొంగలాగు దాస్తున్నాననే లజ్జ మరొకవైపు ఏర్పడినవి. ఈ రెండింటిలో దేని ప్రభావం నాపై ఎక్కువగా పనిచేసిందీ చెప్పలేను. నది ప్రక్కనేవున్న రహస్య స్థలాన్ని వెతుకుకుంటూ వెళ్ళాము. నా జీవితంలో మొట్టమొదటి సారిగా మాంసం చూసింది అక్కడనే. మాంసంతోపాటు రొట్టెకూడా వున్నది. రెండిటిలో ఏదీ నాకు రుచించలేదు. అది మేక మాంసం. బిర్రబిగిసిన తోలుముక్క మాదిరిగా వున్నది. సుతరామూ తినలేక పోయినాను. రోతపుట్టింది. తినడం మధ్యలో మానివేశాను.

ఆ రాత్రి నిద్రే పట్టలేదు. గుండెమీద ఏదో పెద్దబరువు పెట్టినట్లు తోచింది. ఒక్కకునుకు తీసీ తీయగానే, మెలకువ వచ్చేది ; మెలకువ వచ్చినప్పుడల్లా, ప్రాణంతో ఈ మేక నా కడుపులో అరుస్తున్నదా? అనిపించేది. చేసిన పాపానికి పశ్చాత్తాపపడి వెంటనే లేచి కూర్చునే వాణ్ణి. అంతలోనే మాంసభక్షణ మానవుని విధ్యుక్త ధర్మమని స్ఫురణకు తెచ్చుకుని నాకు నేనే ధైర్యం చెప్పుకునే వాణ్ణి.

# 4. దుస్సాంగత్య ఫలితం

నా మిత్రుడు ఒకపట్ల లొంగిపోయేవాడు కాడు. మాంసంలోనే అనేక పిండివంటలుచేసి, పైకి బాగా కనపడేటట్లు వాటిని చక్కగా ముస్తాబు చేయడం మెదలు పెట్టాడు. వాటిని భక్షించడానికి నదిఒడ్డున వున్న ఏకాంత స్థలానికి వెళ్ళడం విరమించుకున్నాము. పెద్ద డైనింగు హాలు, బల్లలు, కుర్చీలు వున్న భవనానికే వెళ్ళడం ప్రారంభించాము. అక్కడవున్న వంటలవాడితో మాట్లాడి, నా మిత్రుడు ఈ కొత్త ఏర్పాట్లు చేశాడు. ఈ ఎర నన్ను బాగా ఆకర్షించింది. రొట్టెమీద మొదట కలిగిన అసహ్యం పోయింది. మేకలమీద దయ అదృశ్యమైంది. కేవలం మాంసం గాక పోయినప్పటికీ, మాంసం పిండివంటలు మాత్రం రుచించడం మొదలుపెట్టినవి. ఈ విధంగా ఒకసంవత్సరం గడిచింది. మొత్తంమీద అర డజను కంటే ఎక్కువసార్లు మాంసం విందులు ఆరగించి వుండను. ఆ భవనంలో మేము వెళ్ళి తినడానికి ప్రతిరోజూ వీల్లేకపోవడమే ఇందుకు ఒకకారణం. ఖరీదైన మాంసపు పిండివంటలు తరుచు తయారుచేయించుకునే తాహతు లేకపోవడం మరొకకారణం. ఈ కొత్త అలవాటు భరించడానికి నా వద్ద డబ్బులేదు. అందువల్ల నా మిత్రుడే ప్రతిసారీ డబ్బుతీసుకురావలసివచ్చేది. అతడు ఆ డబ్బు ఎక్కడినుంచి తెచ్చేవాడో నాకుతెలియదు. నన్ను మాంసాహారిగా సంస్కరించాలని దీక్షబట్టాడు కాబట్టి, ఏదోవిధంగా డబ్బు తెస్తూనే వుండేవాడు. కాని అతడు మాత్రం అంతులేకుండా ఎక్కడనుంచి డబ్బుతేగలడు? అందువల్ల మా విందారగింపు బహు అరుదుగా, అప్పుడప్పుడు గాని, జరుపుకోడానికి వీల్లేకపోయింది.

ఈవిధంగా అవకాశందొరికి, మేము రహస్యంగా విందుజేసుకున్నప్పుడల్లా, ఇంటిదగ్గర భోజనం మానివేయవలసి వచ్చేది. భోజనానికి

లెమ్మని మా అమ్మ పిలిచేది. వద్దంటే, ఎందుకు తినవని ప్రశ్నించేది. "ఇవ్వాళ నాకు ఆకలివేయడంలేదు; కడుపులో బాగాలేదు" అని నేను సమాధానం చెప్పేవాణ్ణి. ఇల్లాంటి సాకులు చెప్పవలసి వచ్చినప్పుడల్లా, నా మనస్సు బాధపడకుండా వుండేదికాను. ప్రత్యక్షంగా మా అమ్మతోనే అబద్ధమాడుతున్నాననే సంగతి నాకు తెలుసు. నేను మాంసం తింటున్నాననే విషయం అమ్మకు, నాన్నకు తెలిసినట్లయితే, వాళ్ళు నివ్వెరపోయి బహు బాధపడతారు. ఈ విషయం తలుచుకున్నకొద్దీ నా హృదయం కుమిలి పోవడం మొదలుపెట్టింది.

అందువల్ల నాకు నేనే ఈవిధంగా హితబోధ చేసుకున్నాను— "మాంసం తినడం, దేశంలో ఆహార విధానాన్ని సంస్కరించడం అవసరమే అయినప్పటికీ, తల్లి దండ్రులను మోసం చేయడం మాంసం తినడం కంటే ఛండాలమైన పని. తల్లీ, దండ్రీ జీవించి వున్నంతవరకు, మాంసం తినాలనే ప్రమేయమే పెట్టుకోకూడదు. వారిద్దరూ దాటిపోయినతర్వాత, నా స్వాతంత్ర్యం నాకు లభ్యమైన తర్వాత, మాంసం బహిరంగంగానే తినవచ్చు. అందువల్ల ఆ సమయం వచ్చేవరకూ మాంసం జోలికే పోకూడదు.''

నా ఈ నిర్ణయాన్ని మిత్రుడికి తెలియజేశాను. అది మొదలు మాంసాహారాన్ని వర్జించాను. తమ కుమార్లలో ఇద్దరు మాంసభక్షకులైనారనే విషయం మా తలిదండ్రులకు తెలియనే తెలియదు.

తలిదండ్రులతో అబద్ధం ఆడకూడదని త్రికరణశుద్ధిగా వాంఛించిన కారణంచేతనే, మాంస భక్షణను సంక్షేపించుకున్నాను. ఐతే, నా స్నేహితుడితో సహచర్యాన్నిమాత్రం వదలలేదు. అతడి దురభ్యాసాలను వదలగొట్టి, అతనిని సంస్కరిద్దామని నాలో కలిగిన ఉత్సాహమే నన్ను విపద్దశకు తెచ్చింది. నేను అప్పటిలో ఆ విషయాన్ని ఏమాత్రం గ్రహించలేకపోయినాను.

నా భార్యకుసైతం నేను అపచారం చేయడానికి ఇదే సహచర్యం దారితీసి వుండేదే. కాని, నా పట్టుదలే, నా ఆత్మనిగ్రహమే నన్ను కాపాడింది. పాప పిశాచపు దంష్ట్రిలలో చిక్కిన నన్ను అపార దయాసముద్రుడైన ఆ భగవంతుడు కనికరించి కాపాడాడు. ఎట్టి దుస్సహవాసం చేస్తున్నానో, నాకు ఇందువల్ల కూడా బోధపడలేదు. ఆ కారణాన ముందు ముందు ఇంకా అనేక విషమ పరిస్థితులను ఎదుర్కొనవలసి వచ్చింది.

నేను ఎన్నడూ అనుకోనట్టి అపభ్రంశపు గుణములు నా మిత్రుడిలో స్పష్టంగా కనిపించ సాగినవి.

ఇదే సమయంలో జరిగిన మరొక విషయాన్నికూడా ఇక్కడ చెప్పక తప్పదు. నా భార్యతో నాకు భేదాభిప్రాయం ఏర్పడింది. ఇందుకు నిస్సందేహంగా ఒక కారణం ఈ మిత్రుడితో నేనుచేసిన సహవాసమే. నా భార్యపై నాకు అనురాగం లేకపోలేదు. ఐతే బహు అనుమానపడే వాడిని. నా భార్యపై నాలో అనుమాన జ్వాలను ప్రజ్వలింప జేసింది ఈ మిత్రుడే. ఐతే, అతని సదుద్దేశాన్ని నే నెన్నడూ శంకించలేదు. అతని మాటలు నమ్మి నా భార్యను పెట్టిన బాధలకూ, జరిపిన దౌర్జన్యానికీ నన్ను నేను ఎన్నడూ క్షమించుకోలేక పోయినాను. అనుమాన పీడితులైన భర్తలుపెట్టే నానా హింసలను ఒక్క హిందూసతి మాత్రమే సహిస్తుంది. ఈ కారణంచేతనే స్త్రీని సహనమూర్తిగా భావిస్తాను. ఒక నౌకరును అతిడి యజమాని అన్యాయంగా అనుమానించడమే సంభవించినట్లయితే, ఆ నౌకరు ఆ ఉద్యోగం వదలుకొని వెళ్ళిపోవచ్చు; కుమారునికే ఆ అవస్థ పట్టినట్లయితే, తండ్రితో వుండడం మానివేయవచ్చు: స్నేహితుడు తన స్నేహానికి స్వస్తి చెప్పుకోవచ్చు: భార్యే భర్త నడవడికను శంకించినట్లయితే, హృదయ వేదనతో లోలోపల కుమిలిపోతుంది. భర్తే భార్య శీలాన్ని అనుమానించినట్లయితే, ఆమెగతి దుర్గతే. ఆమె ఎక్కడికి పోగలదు ? హిందూసతి సాధారణ పరిస్థితులలో భర్తకు విడాకులు ఇవ్వ

డానికి అవకాశంలేదు. న్యాయశాస్త్రం ఆమెకు తరణోపాయాన్ని చూపిం చడం లేదు. నిర్హేతుకమైన అనుమానాలతో నా భార్యను అప్పుడు అంత క్రూరంగా హింసించినందుకు, నేను క్షంతవ్యుడనుకాను. ఆ విషయాన్ని నేను ఎన్నటికీ మరచిపోజాలను.

అహింసా ధర్మాన్ని నేను పరిపూర్తిగా గ్రహించిన మీదటగాని, అనుమాన పిశాచం నాలో నిర్మూలం కాలేదు. బ్రహ్మచర్య ప్రభావం నాకు అప్పుడు గోచరించింది. భార్య, భర్తకు దాసికాదనీ, అతని సహధర్మచా రిణి అనీ, సహకారిణి అనీ, అతడి సుఖ—దుఃఖ సమభాగిని అనీ, తనకు నచ్చిన మార్గాన్ని తాను అనుసరించడానికి భర్తకు ఎంత స్వాతంత్ర్యం వున్నదో, భార్యకూ అంతే స్వాతంత్ర్యం వున్నదనీ నేను అవగాహన చేసుకున్నాను. అనుమానాలతో, శంకలతో బాధపడిన ఆ కాళరాత్రులను తలుచుకున్నప్పుడల్లా, నా అవివేకానికీ, కామప్రేరిత క్రౌర్యానికీ నన్ను నేనే అసహ్యించుకుంటాను. అంత అంధప్రాయంగా మిత్రుని విశ్వసించి నందుకు నాలో నేనే దుఃఖిస్తాను.

# 5. చేసిన పాపం

మాంసభక్షణ రోజులలోనూ, అంతకు పూర్వపు దినాలలోనూ నాలో ఏర్పడిన మరికొన్ని లోటుపాట్లను గురించికూడా చెప్పవలసి వున్నది. ఇవి నా పెళ్ళికిపూర్వం, పెళ్ళి అనంతరం జరిగిన సంఘ టనలు.

నా బంధువుకు, నాకు ఒకసారి ధూమపానం చేయాలనే మనస్సు పుట్టింది. ఇందులో ఏదో మేలున్నదనిగాని, బీడీ వాసనపై వున్న వ్యామో

హంవల్లగాని మా కీ బుద్ధి పుట్టలేదు. నోటిలోనుంచి గుప్‌గుప్‌న పొగ వదులుతుంటే, అదేదో గమ్మత్తుగా, హాయిగా వుంటుందని మేము ఊహిం చాము. మా మేనమామ ఒకాయనకు ధూమపానాభ్యాసం వుండేది. అతడు పొగ తాగుతూండగా చూశాము. అతనిని అనుకరించాలనే ఉద్దేశం కలి గింది. కాని, మావద్ద డబ్బులేదు. అందువల్ల అతడు కాల్చి పారవేసిన బీడీ ముక్కలను తస్కరించడం ప్రారంభించాము.

అన్నప్పుడల్లా కాల్చి పారవేసిన బీడీ ముక్కలు మాకు దొరికేవి కావు. పైగా వాటిని కాల్చినప్పటికీ, అట్టే పొగకూడా వచ్చేదికాదు. ఆ పరి స్థితిలో బీడీలు కొనడానికి మా నౌకరు జేబులోవున్న కాని డబ్బులను దొంగిలించడం ప్రారంభించాము. డబ్బుపెట్టి బీడీలుకొంటే, వాటిని ఎక్కడ దాచడమన్నది పెద్ద సమస్య అయింది. పెద్దవాళ్ళ ఎదుట బీడీలు కాల్చడానికి వీలులేదయ్యె! దొంగిలించిన డబ్బులతో కొన్ని వారాలపాటు, మొత్తంమీద ఏదోవిధంగా గడిపాము. ఇలావుండగా, గోగుపుల్లలు మొదలైనవాటిని కొన్నిటిని కాలిస్తే, సిగరెట్లు కాల్చినట్లుగా పొగ వస్తుం దనే సంగతి తెలుసుకున్నాము. వాటిని సంపాదించి, కాల్చి గుప్‌గుప్‌న పొగ విడుస్తుండేవాళ్ళము.

వీటితో సంతృప్తిపడి వూరుకోలేక పోయినాము. స్వతంత్రంలేదే అనే బాధ ఎక్కువైంది. పెద్దవాళ్ళ అనుమతివుంటేనేగాని ఏపని చెయ్య డానికీ వీల్లేదే అన్నభావం దుర్భరమై తోచింది. చిట్ట చివరకు విస్పృహ చెంది ఆత్మహత్య చేసుకోడానికి సంకల్పించాము.

ఆత్మహత్య చేసుకోవడం ఎలా? విషం ఎక్కడ దొరుకుతుంది? గన్నేరు పువ్వు తింటే సులభంగా చచ్చిపోతారని విన్నాము. సమీపంలోనే వున్న అడవికివెళ్ళి ఈ గింజలకోసం వెతికాము. అవి దొరికినవి. ఆత్మ హత్యకు సాయంసమయం మంచిదని తేల్చుకున్నాము. కేదారస్వామి ఆలయానికి వెళ్ళి ప్రమిదలో నెయ్యిపోశాము. భగవంతుడి దర్శనం చేసు

కున్నాము. రహస్య స్థలం ఎక్కడవున్నదా అని వెతికాము. కాని, ధైర్యం చాలలేదు. విషం తిన్న వెంటనే చచ్చిపోకపోతే, ఏమిటి చేయడం? అసలు ప్రాణం తీసుకున్నందువల్ల ప్రయోజనమేమిటి? స్వతంత్రం లేక పోయినప్పటికీ ఏదోవిధంగా సరిపెట్టుకొని వూరుకోకూడదా? ఈవిధంగా అనేక ఆలోచనలు పోయినవి. ఐనప్పటికీ రెండు మూడు గింజలలోని పప్పు తిన్నాము. ఇంకా కొన్ని తిందామంటే గుండె చాలలేదు. మృత్యువు నెదుర్కోలేని పిరికివాళ్ళమైనాము. మనఃస్థిమితాన్ని సాధించడానికి, ఆత్మ హత్య సంకల్పాన్ని త్యజించడానికి రామాలయానికి వెళ్ళడం మంచిదని నిర్ణయించుకున్నాము.

ఆత్మహత్య చేసుకోవడం అనుకున్నంత సులభంకాదని బోధ పడింది. అప్పటినుంచీ ఆత్మహత్య చేసుకుంటానని ఎవరైనా బెదరించి నప్పటికీ, నేను అట్టే ఆందోళన పడేవాడిని కాదు.

ఆత్మహత్య ప్రయత్నాన్ని విరమించడంతోపాటు బీడీ ముక్కలు కాల్చే అలవాటు, నౌకరు జేబులోనుంచి కాని డబ్బులు తస్కరించే అభ్యాసంకూడా తప్పిపోయినవి.

పొగ తాగాలనే కోరికే ఎన్నడూ మళ్ళీ కలుగలేదు. పైపెచ్చు, పొగ తాగడం అసహ్యమైన, ప్రమాద భరితమైన అనాగరిక అభ్యాసమని కూడా ఒక అభిప్రాయ మేర్పడింది. ధూమపానవాంఛ ప్రపంచంలో ఇంత విపరీతంగా, ఇంత విచ్చలవిడిగా ఎందుకు ప్రబలిందీ నాకు అర్థంకాలేదు. పొగతాగేవాళ్ళువున్న రైలుపెట్టె ప్రయాణం చేయడం నాకు దుర్భరంగా కనిపిస్తుంది. ఉక్కిరి బిక్కిరై పోతాను.

ఇదంతా జరిగిన కొన్ని సంవత్సరాలకే మరొక సంఘటన ఏర్ప డింది. ఈ సంఘటనతో పోల్చిచూస్తే, బీడిముక్కలు కాల్చడం, కాని డబ్బులు తస్కరించడం ఈ రెండు పనులుకూడా క్షంతవ్యాలు గానే కని పిస్తవి. కానీ డబ్బులు దొంగిలించినప్పుడు, నా వయస్సు పన్నెండు

లేక పదమూడు సంవత్సరాలో, అంతకు కొంచం లొజ్జుగానో వుం టుంది. నా పదిహేనో ఏట మరొక దొంగతనం చేశాను. మాంసా హారి అయిన మా అన్నగారి చేతి మురుగునుంచి బంగారం ముక్కను దొంగలించాను. మా అన్నగారు ఇరవైఐదు రూపాయల వరకు ఒక చోట అప్పుచేశాడు. అతడి చేతికి గట్టి బంగారపు మురుగులు వుండేవి. ఆ మురుగులలో ఒక చిన్నముక్క కత్తిరించడం ఏమంత కష్టమైన పని కాదు.

చివరకు అంత పనీచేసి, ఆ అప్పు తీర్చివేశాను. నేను చేసిన తప్పును నేనే భరించలేక పోయినాను. ఇక ఎన్నడూ ఏదీ దొంగిలించ కూడదని గట్టిగా సంకల్పించుకున్నాను. చేసిన తప్పిదాన్ని నాన్నకు చెప్పివేద్దామని కూడా నిర్ణయించుకున్నాను. ఐతే ఆయనతో ఈ విష యమై మాట్లాడడానికి తగినంత ధైర్యం నాకు లేకపోయింది. నన్ను మా నాన్న కొడతాడేమోననే భయంవల్ల కాదు ధైర్యం చాలకపోయింది; మాలో ఎవరినీ మా నాన్న ఎన్నడూ కొట్టినట్లు నాకు జ్ఞాపకంలేదు. బంగా రం ముక్క దొంగిలించాననే మాట ఆయన చెవునబడితే, ఎంతబాధ పడ తాడోకదా! అని నాకు భయం వేసింది. ఏదో విధంగా ధైర్యంచేసి నిజం చెప్పక తప్పదని తేల్చుకున్నాను. చేసిన తప్పు స్పష్టంగా ఒప్పుకుంటేనే గాని హృదయభారం తీరేటట్లు కనబడలేదు.

చేసిన తప్పును కాగితంమీద వ్రాసి మా నాన్నకు చూపిద్దామనీ, తద్వారా క్షమాపణ వేడుకుందామనీ చిట్టచివరకు నిర్ణయించుకున్నాను. తప్పు ఒప్పుకోవడమే గాకుండా, అందుకు తగిన శిక్ష విధించవలసిందని కూడా కాగితంమీద వ్రాసి మా నాన్నకు ఇచ్చాను. నేను చేసిన తప్పి దానికి తన్ను తాను శిక్షించుకోవద్దనికూడా ఆయనను అందులోనే వేడు కున్నాను. ఇల్లాంటి తప్పిదాన్ని ఇక ఎన్నటికీ చేయనని మాట కూడా ఇచ్చాను.

ఆ కాగితంముక్కను మా నాన్నకు అందిస్తూ గడగడ వణికి పోయినాను. ఆయన అప్పుడు జబ్బుతో పడుకొనివున్నాడు. సాఫీగా వున్న ఒక బల్ల ఆయనకు పక్క. కాగితం ఇచ్చి, ఆయన నిర్ణయం కోసం ఎదురుచూస్తూ నిలుచున్నాను.

దాన్ని పూర్తిగా చదువుకున్నాడు. ముత్యాలవలె కన్నీటి బిందువులు ఆయన చెక్కిళ్ళవెంట కారడం మొదలుపెట్టినవి. కాగితం తడిసి పోయింది. ఒకక్షణం పాటు ఏదో ఆలోచిస్తూ కళ్లుమూసుకున్నాడు. తర్వాత ఆ కాగితంముక్కను చించివేశాడు. దాన్ని చదవడానికి లేచి కూచున్నవాడు, తిరిగి బల్లమీద పడుకున్నాడు. ఆయనతోపాటు నేనూ ఏడ్వడం మొదలుపెట్టాను. మా నాన్న పడిన హృదయవేదన స్పష్టంగా గోచరమైంది. నేనే గనుక చిత్రకారుణ్ణి అయినట్లయితే ఆ దృశ్యమంతటినీ చిత్రించేవాడినే. ఇప్పటికీ ఆ దృశ్యమంతా కళ్ళకు కట్టినట్లుగా గోచరిస్తుంది.

ఆయన చెక్కిళ్ళవెంట కారిన ప్రేమాశ్రుకణాలు నా హృదయాన్ని పునీతం చేసినవి. నా పాప పంకిలాన్ని కడిగివేసినవి. అట్టి ప్రేమకు పాత్రుడై అనుభవిస్తేనే గాని, దాన్ని ఎవరూ అర్థంచేసుకోలేరు.

ఆనాటి సంఘటనను ఇప్పుడు తలుచుకుంటే, అహింసా విధానంలో అదొక గుణపాఠంగా కనిపిస్తుంది. అదంతా అప్పుడు కేవలం పితృ ప్రేమగా మాత్రమే గోచరించింది. అట్టి అహింసా విధానం విశ్వపరివేష్టిత మైనప్పుడు, దాని స్పర్శ తగిలితే చాలు ప్రతివస్తువూ పవిత్రంగా పరిణమిస్తుంది. అహింసకు వున్న శక్తి అపారం.

ఇంతటి అమోఘమైన సహనం, క్షమ మా నాన్న స్వభావంలో లేవు. కోపగించు కుంటాడనీ, కఠినమైన మాటలు అంటాడనీ, తన నెత్తినే బాదుకుంటాడనీ అనుకున్నాను. అద్భుతమైన ప్రశాంత స్వభావాన్ని కనబరిచాడు. చేసిన తప్పు స్పష్టంగా ఒప్పుకోవడమే ఇందుకు

కారణ మనుకుంటాను. చేసిన పాపం స్పష్టంగా ఒప్పుకోవడం, ఇక ఎన్నడూ చేయనని మాట ఇవ్వడం—ఇది పశ్చాత్తాప ప్రకటనకు నిర్మలమైన పద్ధతి. ఐతే ఎవరికైతే మన పశ్చాత్తాపాన్ని వినడానికి అధికారం వున్నదో, వారికే చెప్పుకోవాలి. నా తప్పును నేనే ఒప్పు కున్నందువల్ల నా విషయంలో మా నాన్నకు పరిపూర్ణమైన విశ్వాసం ఏర్పడివుంటుందనీ, అపారమైన ఆదరణభావం కలిగివుంటుందనీ అను కుంటాను.

నా పదహారవ ఏట మా నాన్న పరమపదించాడు.

---

# 6. ధృవలక్ష్యం

హిందూమతానికి చెందిన వివిధ శాఖలలోనూ, సోదర మతాల విష యంలోనూ, రాజకోటలో వుండగానే నాకు తొలిశిక్షణ అబ్బింది. మా అమ్మా, మా నాన్నా "హవేళీ"కి వెళ్ళేవారు. రామాలయానికీ, శివాలయానికీ కూడా పోయేవారు. చిన్నపిల్లలమైన మమ్ములను కూడా తీసుకుపోతుండే వారు; అప్పుడప్పుడు మమ్ములను మాత్రమే పంపిస్తుండేవారు. జైన సన్యాసులు సైతం తరుచు మా నాన్నవద్దకు వస్తుండేవారు. తమ నియ మానికి విరుద్ధమే అయినప్పటికీ, జైనమతస్థులం కాని మేము ఇచ్చే ఆతి థ్యాన్ని స్వీకరించేవారు. ఇహ—పర విషయములను గురించి మా నాన్నతో గోష్ఠి జరుపుతుండేవారు.

ముసల్మానులు, పార్సీవారు సైతం మా నాన్నకు స్నేహితులు ఉండేవారు. వారందరూ తమతమ మతవిశ్వాసాలను గురించి మానా న్నతో సంప్రతిస్తుండేవారు. ఎంతో వినయంగానూ, శ్రద్ధగానూ మా నాన్న

వారిమాటలు ఎప్పుడూ వింటుండేవాడు. మా నాన్నకు ఉపచారం చేస్తుండే వాడివి కాబట్టి, వారి ఇష్టాగోష్ఠి చాలాసార్లు వినే అవకాశం నాకు లభ్యమ వుతుండేది. ఇల్లాంటివే అనేక సంఘటనల కారణంగా వివిధ మతాలపైనా నాకు సహిష్ణుత కలిగింది.

ఇతర మతాలపై సహన భావంవున్నది కాబట్టి, భగవంతుడంటే పరమ విశ్వాసం ఏర్పడిందని ఎంచకూడదు. ఏది ఎల్లాగైనప్పటికీ ఒకవిష యంమాత్రం నాలో గాఢంగా నాటుకుపోయింది. నైతిక వర్తనే ప్రతి దానికీ ప్రాతిపదిక అనీ, నైతిక వర్తనకు సత్యమే ప్రధానమనీ తెలుసుకు న్నాను.

గుజరాతీ భాషలోని గీతిక ఒకటి నా హృదయాన్నీ, మనస్సునూ కూడా ఎంతో ఆకర్షించి, చూరగొన్నది. అపకారికి ఉపకారం చెయ్యాల న్నదే ఆ పద్యం తాత్పర్యం. అదే నా ధృవలక్ష్యమైంది.

ఈలక్ష్యాన్వేషణం గాఢవాంఛగా పరిణమించిన కారణంచేత, అనేక ప్రయోగాలనుచేసి చూడడం ప్రారంభించాను. గుజరాతీ భాషలో నేను నేర్చుకున్న ఆ గీతిక చరణాలు అద్భుతమైనవి. దాని భావార్థం ఇది -

"గుక్కెడు నీటికి పట్టెడన్నమిడు
సహృదయతతో పలికిన పలుకుకు సాష్టాంగమే పరిసమానము
రాగి డబ్బుకూ బంగరు మొహరీల్
ప్రాణ భిక్షకు నీ ప్రాణమె ఒడ్డుమి
పెద్దలమాటలు ఇవి పాటించుము సుమి.
ప్రతిచిన్న మేలుకూ ఫలితం పదిరెట్లు
ఉత్తమ పురుషుల కందరు ఒకటే
మనస్ఫూర్తిగా కీడుకు మేల్ చేయుటె లక్ష్యం."

# 7. ప్రమాణ త్రయం

మెట్రిక్యులేషన్ పరీక్ష 1887 లో ప్యాసైనాను. ఆరోజులలో ఆ పరీక్షలు రెండుకేంద్రాలలో మాత్రమే జరుపుతుండే వారు. అవి అహమ్మదాబాదు, బొంబై నగరాలు. కథియవాడ్ విద్యార్థులు, తమదారిద్ర్యావస్థ వల్ల చౌకగా వెళ్ళబారి పోతుంది కాబట్టి సమీపకేంద్రానికే వెళ్ళు తుండేవారు. మా కుటుంబమూ బీదదే కాబట్టి మావాళ్లు నన్ను అక్కడికే వెళ్ళవలసిందని ఫర్మాయించారు. తోడు ఎవరూ లేకుండా ఒంటరిగా నేను ప్రయాణం చేయడం అదే మొదటిసారి.

మెట్రిక్యులేషన్ పూర్తికాగానే, కాలేజీలో చేరవలసిందని మావాళ్లు కోరారు. భావనగర్‌లోనూ, బొంబాయిలోనూ కళాశాలలు వున్నవి. భావనగర్‌లో విద్యనభ్యసించడం చౌకగా తోచినందువల్ల అక్కడికేవెళ్ళి శ్యామల్‌దాసు కాలేజీలో చేరాలని నిర్ణయించు కున్నాను. వెళ్ళిచేరాను. ఆ చదువంతా పెద్ద అగాథంగా కనిపించింది. ఏదిచూడబోయినా కష్టంగానే తోచేది. ప్రొఫెసర్ల ఉపన్యాసాలు నాకు అర్థమే అయేవికావు. అవి నన్ను ఏపాటి ఆకర్షించినవో వేరే చెప్పడమెందుకు? ఇందులో వారిని తప్పు పట్టవలసిందేమీలేదు. ఆ కాలేజీలో పనిచేస్తున్న ప్రొఫెసర్లందరూ అతిసమర్థులని ప్రతీతి. నాకు అక్కడ సర్వం కొత్త అనిపించింది. మొదటి 'టరం' ఆఖరుకే ఇల్లుచేరుకున్నాను.

మావ్జీ దవే అనే అతడు మా కుటుంబానికి చిరకాల మిత్రుడు. మాకుసలహాదారు. అన్నివిషయాలు తెలిసినవాడు; తెలివైనవాడు. బ్రాహ్మణుడు. నన్ను ఇంగ్లండు పంపించి మూడేళ్ళపాటు బారిస్టర్ పరీక్షకు చదివించవలసిందని వితంతువైన మా తల్లికి అతడు సలహా ఇచ్చాడు.

"ఇక్కడేవుంది చదవడంకంటే ఇంగ్లండు పోయి చదువుకోవాలని నీకు లేదా?" అని నన్ను అడిగాడు. అంతకంటేనాకు కావలసిందేమిటి? కాలేజీలో నా చదువు సంధ్యల విషయమై నాకే అధైర్యం తోచింది. మాప్జీ దవే ఈ సలహా ఇవ్వగానే ఎగిరి గంతువేసి, నన్ను ఎంతత్వరగా ఇంగ్లండు పంపిస్తే అంత సంతోషిస్తానని సమాధానం చెప్పాను.

ఏ విషయాన్ని గురించి అయినప్పటికీ, మా అన్నగారిది ముందు వెనుకలు జాగ్రతగా ఆలోచించి చేసే స్వభావం. నన్ను ఇంగ్లండు పంపడానికి ఆయన డబ్బు ఎక్కడినుంచి తేగలడు? అందులో నాలాంటి యువకుడిని నమ్మి, ఒంటరిగా విదేశాలకు పంపడం భావ్యమేనా?

మా అన్నగారికంటే మా అమ్మ మరీ ఖంగారు పడసాగింది. నన్ను విడిచి వుండడం ఆమెకు ఏమాత్రం మనస్కరించలేదు. బహుశ్రద్ధగా ఆమె అనేక విషయాలు నన్ను అడిగి తెలుసుకోవడం మొదలుపెట్టింది. ఇంగ్లండు పోయే కుర్రవాళ్ళు బహు విచ్చలవిడిగా విహరించి, చెడిపోతారని ఆమెకు ఎవరో చెప్పారు. మాంసం తింటారని మరెవరో అన్నారు. మద్యపానం లేనిదే అక్కడ బతకలేరని ఇంకొకరు హెచ్చరిక చేశారు. ఇవన్నీ విని, "ఇంత గొడవలో ఎలా వెళ్ళుతావు?" అని ఆమె నన్ను ప్రశ్నించింది. "నా మాటమీద నీకునమ్మకంలేదా? నీతో నేను అబద్ధమాడను. మాంసాన్ని గాని, మద్యాన్నిగాని నే ముట్టుకోనని ప్రమాణం చేస్తున్నాను. అల్లాంటి ప్రమాదాలే వున్నట్లయితే, మన జోషీగారు నన్ను అక్కడికి వెళ్ళమని సలహా ఇస్తారా అమ్మా?" అని నే నన్నాను. "ఇక్కడ మనదేశ పరిస్థితులలో నీమాట నమ్ముతాను. దూరాభారాన వున్న నీ విషయం ఎలా నమ్మగలను? ఇదంతా నాకు అయోమయంగావున్నది. ఏమి చేయడానికీ తోచడంలేదు. బేచర్జీస్వామిని సలహాఅడిగి చూస్తాను; ఏమంటాడో," అని మా అమ్మ బదులుచెప్పింది.

బేచర్జీస్వామికూడా బకప్పుడు వైశ్యకులస్థుడే. తర్వాత జైన

సన్యాసి అయినాడు. జోషీగారి మాదిరిగానే ఆయనకూడా మా కుటుంబానికి సలహాలిచ్చి, సహాయపడుతుండేవాడు. మొత్తంమీద నా ఇంగ్లండు ప్రయాణానికి ఆయన సహాయంకూడా లభ్యమైంది.

"మీ అబ్బాయిచేత ప్రమాణపూర్తిగా మూడు వాగ్దానాలు చేయిస్తాను. అప్పుడు అతడిని ఇంగ్లండు వెళ్ళనివ్వవచ్చు" అని బేచర్జీస్వామి మా తల్లికి నచ్చ చెప్పాడు. మద్య మాంసాలను గాని, స్త్రీనిగాని ముట్టుకోనని నా చేత ఆయన ప్రమాణంచేయించాడు. అప్పుడు మా అమ్మ నా ప్రయాణానికి అనుమతి ఇచ్చింది.

నాకు వీడ్కోలుఇచ్చి మా హైస్కూలు నన్ను గౌరవించింది. రాజకోట యువకుడు ఇంగ్లండువెళ్ళడం ఆ రోజులలో అసాధారణమైన విషయం. హైస్కూలులో నా కృతజ్ఞతను వ్రాసి చదవడానికి ప్రయత్నించాను. ఐతే, ఎంతప్రయత్నించినా నోటివెంట ఒక్కమాట కూడా పెగలలేదు.

---

# 8. ఇంగ్లండులో తొలి అనుభవాలు

బొంబాయినుంచి 1888, సెప్టెంబరు 4-వ తేదిన నౌకలో ప్రయాణమైనాను. మామూలుగా సముద్రయానంవల్ల అందరికీ చేసే సుస్తీ నాకు చేయలేదు. కాని, రోజులు గడచినకొద్దీ ఖంగారు పుట్టడం ప్రారంభించింది. ఓడ మేనేజరుతో మాట్లాడడానికి కూడా సిగ్గువేసేది. ఆంగ్ల భాషలో మాట్లాడడం నాకు అభ్యాసమేలేదు. ఒక్క మజుందార్ తప్ప నాతోపాటు ఓడలో ప్రయాణం చేస్తున్నవారందరూ ఆంగ్లేయులుగానే కనిపించారు. వారితో సంభాషించడం నాకు చేతకాలేదు. నా దగ్గరకువచ్చి

ఆంగ్లేయులు మాట్లాడేవారు. గాని, వారి మాటలు అర్థంచేసుకునేసరికి గగన మనిపించేది. అధవా, అర్థమైనా వారికి జవాబుచెప్పలేక పోయేవాడిని. ఉచ్చరించడానికి పూర్వం ప్రతి వాక్యాన్నీ బుర్రలో ఊహించి, నిర్మించుకో వలసి వచ్చేది. భోజన సమయంలో కత్తులు, ఫోర్కులు ఉపయోగించడం నాకు తెలియదు. ఏభోజన పదార్థంలో మాంసం ఉపయోగింపబడియున్నదో లేదో అడిగితెలుసుకోడానికి నాకు ధైర్యం చాలేదికాదు. అందువల్ల, మేజా వద్దకువెళ్ళి భోజనంచేసే వాడినికాదు. నేనువున్న గదిలోకే భోజనం తెప్పిం చుకునేవాడిని. నావెంట తెచ్చుకున్న మిఠాయిలను, పళ్ళను మాత్రమే తినే వాడిని. మజుందారు గారికి ఈ చిక్కేమీలేదు, అందరితో కలసిపోయే వాడు. నౌకలో వున్నవారితో యధేచ్ఛగా సంప్రతించేవాడు. నేనుమాత్రం నా గదిలోనే రోజంతా ఒదిగి వుండే వాడిని. బహుకొద్దిమంది మాత్రమే వున్నారని తెలిసినప్పుడే, ఓడ పై భాగానికి వెళ్ళ సాహసించేవాడిని. ప్రయాణీకు లందరితో కలసి మెలసి వుండవలసిందనీ, స్వేచ్ఛగా వారితో మాట్లాడ వలసిందనీ ముజుందారు నాకు హితబోధ చేస్తుండేవాడు. ప్లీడర్లు కాదలచినవారు ఎప్పుడూ మాట్లాడుతుండాలని హెచ్చరిస్తూ, న్యాయవాద వృత్తిలో తన అనుభవాలను గురించికూడా చెబుతుండేవాడు. ప్రతి అవ కాశాన్ని వినియోగించుకొని, ఆంగ్లభాషలో మాట్లాడవలసిందనీ, పర భాష మాట్లాడేటప్పుడు తప్పనిసరిగా కొన్ని తప్పులు దొర్లుతవి కాబట్టి అందుకు జంకవద్దనీ నాకు సలహా ఇచ్చాడు. ఐనప్పటికీ నా పిరికితనాన్ని నేను జయించలేక పోయినాను.

ఓడలో ప్రయాణంచేస్తున్న ఒక ఆంగ్లేయుడు నామీద జాలిపడి, నన్ను సంభాషణలోకి దింపాడు. నాకంటే వయస్సులో ఆతడు పెద్దవాడు, నే నెవరినో? ఎక్కడికి పోతున్నానో? నా భోజనమేమిటో ? ఎందుకు సిగ్గు పడుతున్నానో? కధఅంతా చెప్పవలసిందని నన్ను అడిగాడు. మేజాబల్ల వద్దకు వచ్చి అందరితోపాటు భోజనం చేయవలసిందని ఆతడుకూడా

సలహా ఇచ్చాడు. మాంసాహార నిషేధం విషయంలో పట్టుదలగా వున్నందుకు ఆయన నన్ను చూసి నవ్వాడు. ఓడ ఎర్రసముద్రం చేరింది. స్నేహభావంతో ఆయన నాతో ఇలా అన్నాడు—"ఇప్పటివరకు ఏదో విధంగా నీపంతం నెగ్గించుకోగలిగావు. బిస్కే అఖాతం చేరగానే నీ పట్టుదల సాగదు: విరమించుకోవలసి వస్తుంది. ఇంగ్లండులో విపరీత మైన చలి. అందువల్ల మాంసాహారం లేనిదే అక్కడ జీవించడం అసంభవమేమో!"

"మాంసం తినకుండాకూడా అక్కడ ప్రజలు బతుకుతారని విన్నానే," అన్నాను.

"అబ్బే! ఆ మాట అబద్ధం. నాకు తెలిసినంతవరకు మాంసాహారి కాని వ్యక్తి అక్కడ ఎవరూలేరు. నేను మత్తుపానీయాలు పుచ్చుకుంటున్నప్పటికీ, మిమ్మల్నీ అవి పుచ్చుకోవలసిందని కోరడం లేదుకదా? విషయం బోధపడ్డదా? మీరు మాంసం తినక తప్పదనే నా అభిప్రాయం. తినందే వుండలేరు," అన్నాడు.

"సలహాకు కృతజ్ఞుడను. మాంసం తిననని మా అమ్మకు నేను త్రికరణ శుద్ధిగా మాట ఇచ్చాను. అందువల్ల మాంసభక్షణ విషయమై ఆలోచించడానికే వీల్లేదు. మాంసం తినకుండా బతకడం అసంభవ మయే పక్షంలో అక్కడవుండి మాంసం తినడంకంటే, తిరిగి స్వదేశానికి వెళ్ళడమే మంచిది" అని బదులు చెప్పాను.

బిస్కే అఖాతంలో ప్రవేశించాము. ఐనప్పటికీ మాంసంపైకిగాని మత్తుపానీయం పైకిగాని నా మనస్సు పోలేదు.

శనివారం నాడని జ్ఞాపకం. మేము సౌతాంప్టన్ రేవు చేరాము. ఓడలో వుండగా నల్లని సూట్ ధరించాను. మిత్రులు బహూకరించిన తెల్లఫ్లానెల్ సూటును రేవులో దిగగానే ధరించడానికిగాను దాచివుంచాను. రేవులో తెల్లని ఉన్ని దుస్తులతో దిగడం మంచిదనుకున్నాను.

అలాగే చేశాను. అవి సెప్టెంబరునెల ఆఖరురోజులు. అక్కడఉన్న వారం దరిలోనూ ఒక్క నేనే తెల్లటి దుస్తులు ధరించాను. నా పెట్టె-బేడా, మిగత సామానులన్నీ, తాళంచెవులతో సహా, ఒక ఏజంటుకు అప్పగించాను. మిగతా వారందరూ అలాగేచేశారు. కాబట్టి, నేనూ అలాగే చేయాలి కాబో లనుకున్నాను. డాక్టర్ పి. జె. మెహతాకు, శ్రీ దల్పత్‌రామ్ శుక్లాకు, రంజిత్‌సింగ్ రా కుమారునికీ, "భారత పితామహుడు" దాదాబాయి నౌరోజీ గార్లకు నావద్ద నాల్గు పరిచయ లేఖలు వున్నవి. లండన్‌లో విక్టోరియాహో టలులో బసచేయవలసిందని ఓడలో వుండగానే ఒకరు నాకుసలహా ఇచ్చారు. ఆ సలహా ప్రకారం ముజుందారు, నేను ఇద్దరమూ ఆ హోటలుకే వెళ్ళాము. నేను ఒక్కడినిమాత్రమే తెల్లసూట్ ధరించివున్నందున నాకు ఒక విధమైన చిరాకు ప్రారంభమైంది. ఆ చిరాకు మరీ దుర్భరంగా పరిణ మించింది. ఆ రోజు ఆదివారం కాబట్టి, ఏజెంటు పరంచేసిన సామానులు మరుసటిరోజు సోమవారంనాడు గాని నాకు అందవని హోటలు చేరిన తర్వాత తెలిసింది. ఆ మాట విన్నతర్వాత నా చిరాకు మరీ ఎక్కువైంది. సౌతాంప్టన్ చేరగానే డాక్టర్ మెహతాకు తంతి ఇచ్చాను. ఆ రోజు సాయం త్రం 8 గంటలకల్లా ఆయన నన్ను చూడడానికి వచ్చాడు. అతి ఆప్యా యంగా ఆదరించాడు. నేను తెల్లటిఉన్న దుస్తులు ధరించి వుండడంచూసి, మందహాసం చేశాడు. ఉభయులం మాట్లాడుతూన్న సందర్భంలో, ఆయన పెట్టుకొనివున్న ఉన్ని టోపీని (టాప్‌హాట్‌ను) పట్టుకొని చూశాను. ఎంత మెత్తగా వుందోచూద్దామని, ఉన్నికి ఎదురుగా చేయిపెట్టి రుద్దాను. ఆ ఉన్ని అంతా బాగా చెదరిపోయింది. నేను చేసిన పనికి డాక్టర్ మెహతా మొత్తం మీద కోపంగానే నా వంకచూశాడు. ఐతే, ఏమిలాభం? జరగవలసిన పనేమో జరిగిపోయింది. ఇకముందు అలాంటి పనులు చేయకుండా అదొక హెచ్చరికగా నేను భావించాను. యూరొపియన్ సంఘ మర్యాదల విష యంలో అది నాకు తొలిపాఠం, డాక్టర్ మెహతా నాకు ఈ విధంగా మర్యా

దలు నేర్పాడు—"ఇతరులవస్తువు లేవీ ముట్టుకోవద్దు. ప్రథమ పరిచయం లోనే అనేక ప్రశ్నలు వేయడం భారతదేశంలో మనకు అలవాటు. ఇక్కడ అలాప్రశ్నలు వేయవద్దు బిగ్గరగా మాట్లాడవద్దు. భారతదేశంలో మాదిరిగా ఇక్కడ ఎవరినీ 'సర్' అని సంబోధించవద్దు. నౌకర్లు, తక్కువ ఉద్యోగులు మాత్రమే ఇక్కడ తమ యజమానులను "సర్" అని పిలుస్తారు." ఇదేవిధంగా ఇంకా ఎన్నోసలహాలు ఇచ్చాడు. హోటలులో వుండడంవల్ల ఖర్చు విపరీతంగా అవుతుందనీ, ఎవరి ఇంటిలోనైనావుండ డం మంచిదనీకూడా చెప్పాడు. ఆ విషయాన్ని సోమవారంనాడు ఆలోచిద్దామని వాయిదా వేశాము.

హోటలులో బసచేయడం ముజుందారుకు, నాకు కూడా దుర్భరంగానే తోచింది. విపరీతమైనఖర్చు. మేము వచ్చిన ఓడలోనే, మాల్టానుంచి ఒక సింధురాష్ట్రీయుడు కూడా లండనుకు ప్రయాణంచేశాడు. అతడికీ, మజుందారుకూ స్నేహమైంది. లండన్ అతనికి కొత్తకాదు. కాబట్టి, ఎక్కడో మాకు గదులుచూసి పెడతానన్నాడు. అందుకు మేము సరేనన్నాము. సోమవారంనాడు మా పెట్టె, బేడావచ్చినవి. ఇవ్వవలసిన బిల్లు మొత్తాలన్నీ ఇచ్చివేశాము. సింధీమిత్రుడు అద్దెకు చూపిపెట్టిన గదలకు వెళ్ళాము. నా హోటలు బిల్లు మూడుపౌనులైనట్లు జ్ఞాపకము. ఆ బిల్లు చూసే సరికి నా గుండె అదిరి పోయింది. అంత పెద్ద మొత్తం చెల్లించినప్పటికీ, నేను ఆ హోటలులో పస్తువున్నట్లే లెక్క. ఆ హోటలులో చేసిన పదార్థం ఒకటైనా నాకు రుచించలేదు. ఏదైనా ఒకపదార్థం రుచించకపోతే, మరొక పదార్థం తీసుకు రమ్మనేవాడిని. ఐతే, తిన్నా, తినకపోయినా ఆ రెండు పదార్థాలకు ముడుపు చెల్లించక తప్పేదికాదు. ఇంతకూ అసలు విషయమేమిటంటే ఆ హోటలులో వున్న మూడునాళ్లూ బొంబాయినుంచి వస్తూ తెచ్చుకున్న ఆహార పదార్థాలపైనే ఆధారపడి వుండవలసివచ్చింది.

కొత్తగదులలో ప్రవేశించినప్పటికీ, అక్కడకూడా మనస్థిమితం

వుండేదికాదు. ఎప్పుడూ ఇంటిమీనా, స్వదేశంమీదా ధ్యానవుండేది. రాత్రి పూట మరీ బాధగా వుండేది. కళ్ళవెంట నీళ్లుకూడా కారేవి. ఏవేవో ఇంటి సంగతులన్నీ జ్ఞాపకంవచ్చి, నిద్రే పట్టేదికాదు. ఎవరితో నైనా నా బాధ చెప్పుకొని ఊరట చెందుతామన్నా వీలుపడేది కాదు. అథవా చెప్పుకున్నప్ప టికీ, ప్రయోజనమేమిటి? నా మనస్సు కుదటపడే ఉపాయం నా కేమి కానరాలేదు. అక్కడి మనుష్యులు, వారి పద్ధతులు, వారి విహాసాలు అంతా నాకు కొత్త. ఇంగ్లీషువారి మాటా మర్యాదలు నాకు బొత్తుగా తెలియవు. ఏమిచేయబోయినా బహుజాగ్రత్తగా వుండవలసివచ్చేది. పైగా, మాంసభ క్షణ కూడదనే పట్టింపు ఒకటివున్నదయ్యె. తినడానికి వీలైన పాక శాకాలు కూడా బహు అరుచిగానూ, నిస్సారంగానూ కనబడేవి. మొత్తంమీద నా పరిస్థితి ముందు నుయ్యి, వెనుక గొయ్యిగా పరిణమించింది. ఇంగ్లం డులోవుండడం దుస్సహ మనిపించింది. భారత దేశానికి తిరిగివెళ్లదామని అనుకోనైనా అనుకోకూడదు. 'దేశం వదలివచ్చి వేశావు కాబట్టి, మూడేళ్ళ విద్యాభ్యాసమూ పూర్తిచేయవలసిందే'నని అంతర్వాణి చెప్పింది.

---

# 9. ప్రతిపోషణ

నేను అక్కడే వున్నావనుకొని డాక్టర్ మెహతా సోమవారంనాడు విక్టోరియా హోటలుకు వెళ్ళాడు. మేము అక్కడనుంచి బసమార్చినట్లు ఆయన తెలుసుకున్నాడు. కొత్త చిరునామా కనుక్కొని, మా గదులకు వచ్చి కలుసుకున్నాడు. నేను వుంటున్న గదినీ, దాని పరిసరాలను చూసి అసమ్మతి తెలిపాడు. "ఈ స్థలం లాభంలేదు; మనం ఇంతదూరం ఇంగ్లం డుకు గ్రంథాలు పఠించి, జ్ఞానార్జన చేద్దామనే ఉద్దేశంతో రాము. ఇంగ్లీషు

వారి జీవితానుభవములను, ఆచార వ్యవహారాలను తెలుసుకుందామనే ఉద్దేశంతోనే ఇక్కడికి వస్తాము. ఇందుకుగాను ఒక ఇంగ్లీషు కుటుంబంలోనే వుండడం మంచిది. నేను నిన్ను ఒకరి ఇంటికి తీసుకెళ్లుతాను. అక్కడ వారితో కొంతకాలం వుందువుకాని'' అన్నాడు డాక్టర్ మెహతా.

ఆయన సూచనను కృతజ్ఞతతో సమ్మతించాను. అంతట నన్ను తన మిత్రుని ఇంట వదలివేశాడు. ఆ మిత్రుడు చాలా దయగలవాడు. నా విషయమై చాలా శ్రద్ధవహించేవాడు. నన్ను సొంత సోదరుడుగా భావించేవాడు. ఇంగ్లీషువారి ఆచారాలను, పద్ధతులను ఆయన నాకు మెల్లమెల్లగా నేర్ప సాగాడు. ఇంగ్లీషుభాష మాట్లాడడం కూడా అలవాటు చేశాడు. అక్కడ కూడా నా ఆహారం విషయమై పెద్ద సమస్యగానే పరిణమించింది. ఉప్పుగాని, సువాసన ద్రవ్యాలుగాని, వేయకుండా ఉడకపెట్టిన చప్పిడికూరలు నాకు సయించేవి కావు. నాకు ఏ కూరలు వండిపెట్టాలో, ఏ అనుపానాలుచేసి పెట్టాలో, మాగృహయజమానురాలికి బోధపడలేదు. ఓటుగింజల జావతో పొట్టనింపి ఉదయపు భోజనంపూర్తిచేసే వాళ్ళము. కాని, మధ్యాహ్నం, రాత్రి భోజనాల విషయంలోమాత్రం నేను పస్తువుండవలసి వచ్చేది. మాంసం తినవలసిందని మిత్రుడు ఎడతెరిపిలేకుండా వాదిస్తుండే వాడు. మాంసం తిననని మా తల్లికి మాట ఇచ్చిన సంగతి ఆయనకు జ్ఞాపకంచేసి ఎదురువాదన చేసేవాడిని.

ఏ రోజు కా రోజు మిత్రుడు మాంసం తినవలసిందేనని పట్టుపట్టి వాదించేవాడు. ప్రతిసారీ 'వీల్లేదు' అన్నదే నా సమాధానం. అతడి వాదన ఎక్కువైన కొద్దీ, నాలోకూడా పంతం, పట్టుదల ఎక్కువవడం మొదలుపెట్టినవి. "భగవంతుడా నన్ను కాపాడవలసింది" అని ప్రతిరోజూప్రార్థన చేసేవాడిని. భగవంతుడు అంటే ఎవరో? ఏమిటో? నాకుతెలిసివుండి చేసిన ప్రార్థన కాదది. విశ్వాస మనే బలంతో చేసిన ప్రార్థనే అది.

బెంథాం వ్రాసిన 'థియరీ ఆఫ్ యుటిలిటీ' అనే అర్థిక శాస్త్రగ్రంథం

నుంచి ఒకరోజు మిత్రుడు చదివి వినిపించడం ప్రారంభించాడు. నాకు అదంతా అగోచరమై తోచింది. దానిలో భాష నాకు బోధపడలేదు. ఆ గ్రంథంలో ఉన్న ఏవేవో సిద్ధాంతాలను మిత్రుడు వివరించి చెప్పడం మొదలుపెట్టాడు. "క్షమించండి. ఈ జటిల సిద్ధాంతాలు నా అవగాహన శక్తికి మించినవి. ఈ దేశంలో మాంసం తినవలసిన అగత్యం వుండ వచ్చు ననే అంగీకరిస్తానను కోండి. కాని, నా వ్రతానికి భంగం కలిగించుకోడానికి మాత్రం ఇష్టపడను. దీన్ని గురించినేను సహేతుకంగా వాదించలేను. మీతో ఎదురువాదన చేసి గెలువలేననే నా నమ్మకం, నన్ను ఒక అవివే కిగా, మూర్ఖుడుగా ఎంచి వదలివేయండి. మీరు నా క్షేమాభిలాషి అనినాకు తెలుసు. నామీద మీకువున్న వాత్సల్యానికి కృతజ్ఞుడిని. నా క్షేమాన్ని అభి లషించే మీరు ఆ విషయమై పదేపదే చెబుతున్నారని కూడా నాకు తెలుసు. కాని, నేను నిస్సహాయుడిని. వ్రతం వ్రతమే. దానికి భంగం కలిగించడానికి వీల్లేదు" అని నేను బదులుచెప్పాను. ఇదివిని ఆశ్చర్యంతో మిత్రుడు నా కేసిచూశాడు. చదువుతున్న పుస్తకం మూసివేసి "ఐతేసరే. ఇక మీతో పల్లెత్తు వాదించను" అన్నాడు. అతడి సమాధానం విని సంతోషించాను. ఆ తర్వాత అతడు నాతో ఎన్నడూ ఆ ప్రసక్తే తీసుకురాలేదు. కాని, నావి షయమై అతడు బెంగ పెట్టుకోవడం మాత్రం మానలేదు. ఆయన ధూమ పానం చేసేవాడు. మత్తు పానీయాలు పుచ్చుకునేవాడు. వాటిని అలవాటు చేసుకో వలసిందని నన్ను అతడు ఎన్నడూ అడుగలేదు. ఆ మాటకువస్తే అలవాటుచేసుకో వద్దనే సలహా ఇచ్చాడు. మాంసం తినకపోతే చాలా బల హీనమై పోతానేమోననీ, ఆ కారణంగా ఇంగ్లండులో నా ఉనికి సుఖంగా వుండదేమోననీ మాత్రమే ఆయన బెంగ.

ఈ విధంగా ఆ ఇంటిలో మొదటి మాసం రోజులు గడిపాను.

# 10. అనుకరణ

ఇలా ఉండగా, మరొక విధంగా నన్ను తనవాదనవైపు తిప్పుకోవాలని నా మిత్రుడు చూశాడు. మాంసం తినకపోయినట్లయితే, శరీర దౌర్బల్యం ఏర్పడడమే గాక, ఇంగ్లండులో వుండికూడా తద్వారా చేకూరే ప్రయోజనాన్ని ఏ మాత్రం పొందకుండానే నేను భారతదేశానికి తిరిగి పోవలసి వస్తుందేమోనని ఆయన అభిప్రాయపడ్డాడు. ఆయన ఆ విధంగా అభిప్రాయ పడడానికి నా మీదవున్న ప్రేమే కారణం.

నా విషయమై అంత బెంగపడుతున్న ఆయనకు మనశ్శాంతి చేకూర్చాలని సంకల్పించుకున్నాను. శాకాహార విధానాన్ని అవలంబిస్తూనే గౌరవ ప్రతిపత్తులు గల ఆంగ్లేయ సమాజంలో తిరిగేటందుకు అవసరమైన మర్యాదలన్నిటినీ అలవరుచుకుంటానని ఆయనకు నచ్చచెప్ప దలచాను. ఇందుకోసం, ఆంగ్లేయుడివలె తయారుకావడానికి (అసంభవమైన పనే అయినప్పటికీ) పూనుకున్నాను.

బొంబాయిలో కుట్టించుకొనివచ్చిన దుస్తులు ఆంగ్లేయ సమాజంలో ధరించ తగినవి కావేమోనని అభిప్రాయపడ్డాను. వేషరీతులన్నీ తెలిసిన ఒక దర్జీవాడివద్ద కొత్తవి కుట్టించాను. పట్టుటోపీ కూడా కొన్నాను. ఇంతటితో తృప్తిపడక, వృథాగా పదిపౌనులు ఖర్చుపెట్టి "ఈవినింగ్ సూట్" ఒకటి కుట్టించాను. మా అన్నగారి ఉదార స్వభావాన్ని అవకాశంగా తీసుకొని, గడియారానికి జములు పేట బంగారవు గొలుసు ఒకటి కొన్నాను. "రెడీ మేడ్ టై'' ధరించడం సరియైన పద్ధతి కాదని తెలిసింది. నా అంతట నేనే "టై" వేసుకునే పద్ధతి నేర్చుకున్నాను. భారతదేశంలోవుండగా మా ఇంటి మంగలివచ్చి క్షౌరం చేస్తున్నప్పుడు మాత్రమే నేను అద్దం

చూసుకునే వాడిని. కాని ఇంగ్లండులో ప్రతిరోజూ ఒక నిలువుటద్దంముందు నిలుచుని "టై" వేసుకుంటూనూ, నీటుగా తలదువ్వుకుంటూనూ, పదినిమిషాలు వృధాచేయవలసి వచ్చేది. నాది మెత్తటిజుట్టుకాదు. దాన్ని అణచి వుంచడానికి "బ్రష్" పెట్టి ఏ రోజు కా రోజు పది నిమిషాలసేపు హోరాహోరి యుద్ధం చేస్తుండేవాడిని. 'హేట్' పెట్టుకునేటప్పుడు, తీసి వేసేటప్పుడు ప్రతిసారీ అప్రయత్నంగా జుట్టు సరిదిద్దడానికి చెయ్యి తలపైకి వెళ్ళుతుండేది. నవనాగరికుల సంఘంలో వున్నప్పుడు జుట్టు సవరించుకోడానికి ఆ చెయ్యివడే అవస్థ చెప్ప నవసరమేలేదు. ఇవన్నీ చాలవేమో నన్నట్లు ఆంగ్లేయుడిమాదిరిగా కనబడడానికి మిగత విషయాలన్నిటిలో కూడా శ్రద్ధవహించడం ప్రారంభించాను. డాన్సింగ్, ఫ్రెంచిభాష, వక్తృత్వం—వీటిలోనూ శిక్షణపొందడం మంచిదని తెలుసుకున్నాను ఫ్రెంచి భాష మాట్లాడేది ఒక్క ఫ్రాన్సులోనేకాదు. యూరప్ ఖండంలో జనసామాన్యం యెక్కువగా మాట్లాడేభాష అదే. యూరప్ పర్యటనం చేయాలనే వాంఛవున్నది కాబట్టి, ఫ్రెంచి భాష నేర్చుకోవడ అవసరమనిపించింది. 'డాన్సింగ్' పాఠాలు నేర్చుకుందామని, క్లాసులో చేరి ఒక 'టరము' ఫీజుకింద మూడుపౌనులు కట్టాను. మూడు వారాలలో బహుశా ఆరు పాఠాలు నేర్చుకుని వుంటాను. ఎంతశ్రమపడి నప్పటికీ 'డాన్సింగ్'కు అవసరమైన పాదవిన్యాసం నాకు అలవడలేదు. పియానోపై వాయించే పాటవరసను అందుకో లేకపోయేవాడిని. అందువల్ల ఆ పాటకూ, నా నృత్యానికీ ఎక్కడా లంగరందేదికాదు. ఆ పరిస్థితులలో ఏమిటి చేయడం? వెనుకటికి, ఒక సన్యాసి తనమఠంలో ఎలుకల బాధపడలేక పిల్లిని పెంచాడట! ఆ పిల్లికి పాలకోసం ఒక ఆవును కొన్నాడట. ఆ ఆవును పోషించడానికి ఒకమనిషిని పెట్టాడట—నా పరిస్థితీ అదేవిధంగా పరిణమించింది. ఆ సన్యాసివాడి పటాటోపం మాదిరిగానే, నా కాంక్షలుకూడా పెరిగిపోవడం మొదలుపెట్టినవి. పాశ్చాత్య సంగీత శాస్త్రంలో అభిరుచి సంపాదిం

చదానికి ఫిడేలు నేర్చుకోవాలని బుద్ధిపుట్టింది. మూడు పౌనులుపెట్టి ఒక ఫిడేలు కొన్నాను. 'ఫీజు' కింద మరికొంత ముదుపు చెల్లించాను. వక్తృత్వంలో పాఠాలు చెప్పడానికి ఒక ఉపాధ్యాయుడిని పెట్టుకొని, ఒక గినీ(రూ. 15–12–0) తొలి రుసుంగా ఇచ్చాను. బెల్స్ వ్రాసిన "స్టాండర్డ్ ఎలొక్యూషనిస్ట్" అనే పాఠ్యపుస్తకాన్ని కొనవలసిందని ఆయన సలహా ఇచ్చాడు. కొన్నాను. పిట్ యొక్క ఉపన్యాసంతో పాఠం ప్రారంభించాను.

ఈ గ్రంథం చదువుతూండగా, హఠాత్తుగా ఒక ఆలోచన తట్టింది. నిద్రమేల్కొన్నట్లయింది: నా యావజ్జీవితాన్నీ ఇంగ్లండులోనే గడప బోవడంలేదు గదా అన్నదే ఈ ఆలోచన. అల్లాంటి పరిస్థితులలో ఈ వక్తృత్వ పాఠాలన్నీ నేర్చుకుని ప్రయోజనమేమిటి? 'డాన్సింగ్' నేర్చుకున్నంత మాత్రాన అది నాకు ఏ విధంగా పెద్దమనిషి తరహాను నేర్పగలదు? ఇకపోతే, ఫిడేలు సంగతి. "వైలిన్" (ఫిడేలు)న్ను భారతదేశానికి తిరిగి వెళ్ళిన తర్వాతైనా నేర్చుకోవచ్చు. ఇంగ్లండులో నేను కేవలం విద్యార్థిని. అందువల్ల చదువు సంధ్యల విషయమై చూచుకోవడం మంచిది. బారిస్టర్ వృత్తికి అర్హత సాధించాలి. నా నడవడిక వల్లా, శీలంవల్లా పెద్దమనిషి తరహా అలవడితే మంచిదే. అలవడకపోతే, ఆ ఆశయాన్నే విరమిస్తాను.

ఈ విధంగా అనేక ఆలోచనలు తోచినవి. వక్తృత్వోపాధ్యాయుడికి ఒకలేఖవ్రాస్తూ, అందులో నా ఈ భావాలన్నిటినీ పొందుపరిచాను. ఇకమీద వక్తృత్వ పాఠాలకు రావలదనీ, క్షమించవలసిందనీ తెలియజేసాను. ఆయనవద్ద ఏ రెండు, మూడుపాఠాలు చదివానో. డాన్సింగ్ ఉపాధ్యాయుడికి కూడా అదేవిధంగా ఒకఉత్తరం వ్రాశాను. 'వైలిన్' ఉపాధ్యాయిని వద్దకు నేనే స్వయంగా వెళ్ళి ఎంతధరవస్తే అంతధరకే 'వైలిన్' అమ్మిపెట్ట వలసిందని కోరాను. ఆమె నా ఎడల సుముఖభావాన్ని కనబరి

చింది. నేను తప్పుడు లక్ష్యాన్ని కాంక్షిస్తున్నట్లు గ్రహించానని ఆమెకు తెలియజేశాను. నా కొత్త సంకల్పాన్ని ఆమె ప్రోత్సహించింది. పద్ధతిని పూర్తిగా మార్చివేసుకోవలసిందని సలహా ఇచ్చింది.

ఈ వ్యామోహమంతా మూడు నెలల భాగోత మనుకుంటాను. దుస్తుల వెర్రి మాత్రం కొన్ని సంవత్సరాలపాటు వుండిపోయింది. అప్పటి నుంచీ నేను ఇంగ్లండులో కేవలంవిద్యార్థిని మాత్రమే. నా చదువేమో, నే నేమో.

---

# 11. రోజుకు 15 పెన్నీలు

నృత్యం, సంగీతాది విద్యలలో నేను వేలుబెట్టబోవడంవల్ల, నా జీవితంలో భోగదశ ప్రారంభమైందని ఎవరూ అనుకోవద్దు. నేను వాటిని నేర్చుకోవడంలో వేరే ఉద్దేశం వున్నదనే విషయం పాఠకుడు గ్రహించేవుంటాడు. ఆ వుద్దేశం కారణంగానే, వాటినుంచి నేను తప్పుకోవడం కూడా సులభ సాధ్యమైంది. నా జీవిత పద్ధతిని బహు జాగ్రత్తగా గమనించినమీదట ఖర్చు తగ్గించుకోవడం అవసర మనిపించింది. ఖర్చులు సగానికి సగం తగ్గించుకుందామని నిర్ణయించాను. జమా—ఖర్చు పుస్తకం తిరగవేసి చూస్తే, అక్కడికీ, ఇక్కడికీ వెళ్ళడానికే అయిన ఖర్చులు విశేషంగా కనిపించినవి. ఒకరి ఇంటిలో వుండడంవల్ల, వారికి వారం, వారం బిల్లు చెల్లించవలసి వస్తుందేది. స్వంతఖర్చులపై గదులలో వుండడమే మంచిదని నిర్ణయించుకున్నాను. ఖర్చులన్నీ భరిస్తూ ఒకరిఇంటిలో వుండడం కంటే, ఏ ప్రాంతంలో పనివుంటే ఆ ప్రాంతానికే బస మారుస్తూ వుండడమే మంచిదనీ, అందువల్ల ఒకవిధమైన, కొత్త అనుభవంకూడా చేకూ

రుతుందనీ అనుకున్నాను. ఎటుచూసినప్పటికీ, కాలినడకన అరగంటలో వెళ్ళడానికి వీలుగా ఒకచోట గదులు చూచుకున్నాను. కాలి నడకనపోతే, డబ్బు మిగులుతుంది. అంతకుపూర్వం ఎప్పుడు ఎక్కడికి వెళ్ళదలచినా, ఏదో ఒక వాహన సౌకర్యం కావలసివచ్చేది. కాలినడకన పోవలెనంటే మరికొంత ముందుగానే బయలుదేరడం అవసరమైంది. ఈ కొత్తఏర్పాటువల్ల, నడకకు నడకా, పొదుపుకు పొదుపూ-రెండూ సమకూడినవి. డబ్బు మిగుల్చుకొనడమే గాక, రోజుకు ఎనిమిది, పదిమైళ్ళు నడుస్తుండే వాడిని. ఎంతెంతో దూరం ఈ విధంగా నడిచిన కారణాన ఇంగ్లండులో వున్నన్ని రోజులూ నాకు ఎన్నడూ జబ్బుచేసి ఎరగదు. మొత్తంమీద అందువల్లనే, కాయపుష్టి కూడా ఏర్పడింది.

రెండు గదులు అద్దెకు తీసుకున్నాను. వీటిలో ఒకటి చదువుకోడానికీ, మరొకటి విశ్రమించడానికీ. ఇంగ్లండులోవుండగా నా జీవితంలో ఇది రెండవ దశ. మూడవ దశ కూడా ఒకటివున్నది.

ఈ మార్పు లన్నిటివల్లా, నా ఖర్చులు సగం తగ్గిపోయినవి. వున్న కొంచం వ్యవధినీ ఏ విధంగా సద్వినియోగం చేయడమన్న ప్రశ్న ఏర్పడింది. బారిస్టర్ పరీక్షకు చదువవలసింది అట్టే లేదనే విషయం నాకు తెలుసు. అందువల్ల పరీక్షకు వ్యవధి చాలదనే బెంగ ఏమీలేదు. ఇంగ్లీషు భాష బాగా రాలేదని మాత్రం నిరంతరం ఆందోళన పడేవాడిని. ఆ కారణంచేత బారిస్టర్ పరీక్ష ప్యాసవడంతో పాటు సారస్వతంలో కూడా డిగ్రీ పుచ్చుకోవాలనే అభిలాష కలిగింది. ఆక్స్ఫర్డ్, కేంబ్రిడ్జి యూనివర్సిటీల కోర్సుల విషయమై విచారించి తెలుసుకున్నాను. కొంతమంది మిత్రులను సలహా అడిగాను. ఈ రెంటిలో దేనికి వెళ్ళదలచినా, విపరీతమైన ఖర్చులు భరించవలసి వస్తుందనీ, ఇంగ్లండులో అనుకున్న దానికంటే మరి కొంత కాలం వుండవలసి వస్తుందని తెలిసింది. లండన్ మెట్రిక్యులేషన్ ప్యాసవడం మంచిదని ఒకమిత్రుడు సలహా ఇచ్చాడు. ఆ పరీక్షకు కూర్చో

దలచినట్లయితే, కష్టపడి చదవాలి; జ్ఞానాభివృద్ధికూడా బాగా లభ్యమయే అవకాశం వున్నది. పైగా చెప్పదగినంతగా అదనపు ఖర్చేమి వుండదు. ఆ మిత్రుడి సలహా నాకు నచ్చింది. ఆ పరీక్ష 'సెలబస్' చూద్దును కదా, గుండె గుభేలుమన్నది. లాటిన్ భాషా, మరొక ఆధునిక భాష విధిగా చదివితీరాలి. లాటిన్‌భాష నేర్చుకోవడం ఏలా? నా మిత్రుడు దావివిషయమై బహుంగట్టిగా వాదిస్తూ ఇలాఅన్నాడు—"న్యాయవాద వృత్తిలో వుండదలచిన వారికి లాటిన్‌భాష చాలా ఉపయోగపడుతుంది. న్యాయశాస్త్ర గ్రంథాలు అర్థంకావడానికి లాటిన్‌భాష బాగా సహాయ పడుతుంది. 'రోమన్ లా'లో ఒక పరీక్ష పత్రాన్ని పూర్తిగా లాటిన్ భాషలోనే ఇస్తారు. పైగా, లాటిన్‌భాష తెలిసివున్నట్లయితే, ఆంగ్లభాషమీద మంచి స్వాధీనం ఏర్పడుతుంది." ఈ వాదన నాకు నచ్చింది. ఎంత కష్టమైనప్పటికీ, లాటిన్‌భాష నేర్చుకోవలసిందేనని నిర్ణయించుకున్నాను. ఫ్రెంచిభాష నేర్చుకోవడం అప్పటికే ప్రారంభించాను. కాబట్టి, దాన్ని ఆధునిక భాషగా పెట్టుకోదలిచాను. ప్రైవేట్ మెట్రిక్యులేషన్ తరగతిలో చేరాను. ప్రతి ఆరునెలలకూ ఒకసారి పరీక్షలు జరుగుతవి. ఆ పరీక్షకు అప్పటికి ఐదునెలలు మాత్రమే వ్యవధివున్నది. ఐదునెలలలో కోర్సు అంతా పూర్తిచేయడం అసంభవ మేమోనని తోచింది. ఆంగ్లవేషధారణ మీద మోజుచాలించిన నా మనస్సు త్రికరణశుద్ధిగా చదువుమీదికి మళ్ళింది. ప్రతి నిమిషాన్ని లెక్కచూసి టైంటేబుల్ వేసుకున్నాను. లాటిన్, ఫ్రెంచిభాషలను, మిగతా విషయాలను అంత స్వల్ప వ్యవధిలో నేర్చుకోడానికి నా తెలివి తేటలుగాని, జ్ఞాపక శక్తిగాని చాలలేదు. దీని ఫలితం ఏమిటంటే, లాటిన్‌భాషలో తప్పడమే. పరీక్ష పోయినందుకు విచార పడినమాట నిజమేగాని, అధైర్యం మాత్రం పడలేదు. మొత్తంమీద లాటిన్‌భాషలో ఒకవిధమైన అభిరుచి ఏర్పడింది. మరొకసారి పరీక్షకు కూర్చున్నట్లయితే, ఫ్రెంచిభాష కూడా బాగా వస్తుంది కదా అనుకున్నాను. 'సైన్స్‌గ్రూపు'లో

'కొత్తసబ్జెక్టు' తీసుకుందామని నిర్ణయించుకున్నాను. ఎక్స్‌పెరిమెంట్లు చేయడానికి అవకాశం లేని కారణంచేత రసాయనిక శాస్త్రం నన్నాకర్షించలేదు. భారతదేశంలో చదువుకుంటున్నప్పుడు, దాన్ని తప్పని సరిగా పఠించవలసి వచ్చింది. అందువల్ల లండన్ మెట్రిక్యులేషన్ పరీక్షకు మొదట దాన్ని తీసుకున్నాను. కాని, రెండవసారి పరీక్షకు మాత్రం రసాయనిక శాస్త్రానికి బదులు భౌతిక శాస్త్రంలో "హీట్, లైట్" భాగాలు తీసుకున్నాను. "హీట్, లైట్" సులభమని అందరూ అన్నారు. నిజానికి సులభమే అనిపించింది.

మరొకసారి పరీక్షకు కూర్చోవలసి వచ్చినందువల్ల ఖర్చులు ఇంకా తగ్గించు కుందామని ప్రయత్నించాను. నా పోకడలు, ఖర్చులు మాకుటుంబాదాయానికి తగినట్లుగా లేవని గ్రహించాను. నేను అడిగినప్పుడల్లా ఎంతో శ్రమపడి ఉదారస్వభావంతో నాకుడబ్బు పంపుతున్న నా సోదరుడి ఇబ్బందిని ఒక్క సారి తలపోశాను. నెల ఒకటికి ఎనిమిది మొదలు, పదిహేను పౌనుల వరకూ ఖర్చుపెడుతున్నాను. విద్యార్థులలో చాలామందికి స్కాలర్‌షిప్పుల సౌకర్యం వున్నట్లు తెలుసుకున్నాను. నా కంటే మరీ నిరాడంబరంగా వున్నవారు కూడా లేకపోలేదు. ఇల్లాంటి విద్యార్థులను చాలామందిని చూశాను. ఒకవిద్యార్థి ఒక కూపంలో గదితీసుకొని వారానికి రెండు షిల్లింగుల అద్దెఇస్తూ, చౌకపారు హోటలుకు వెళ్లి రెండు పెన్నీలకు రొట్టెతిని, కోకోతాగి కాలం వెళ్ళబుచ్చు తుండేవాడు. అతడి పద్ధతిని లక్ష్యంగా పెట్టుకోవాలని నేను ఎన్నడూ అనుకోలేదు. రెండు గదులకు బదులు ఒకగది చాలుననీ, ఆ గదిలోనే వంటచేసుకోవడం మంచిదనీ అనుకున్నాను. ఆ విధంగా చేస్తే, నెలకు నాల్గు–ఐదు పౌనులు మిగిలే సూచన కనబడింది. నిరాడంబర జీవితాన్ని గురించి కొన్ని పుస్తకాలు సైతం చదవడం తటస్థించింది. రెండు గదులకు బదులు ఒకగదే అద్దెకు తీసుకున్నాను. కొంత పెట్టుబడి పెట్టి 'స్టవ్' ఒకటి కొన్నాను. ఉదయపు భోజ

నాన్ని నేనే వండుకోవడం మొదలు పెట్టాను. 'కోకో'కు నీళ్ళు కాచడమూ, ఓట్ గింజల జావచేసుకోవడమూ మాత్రమే కాబట్టి, వంట ఇరవై నిమిషాల కంటే ఎక్కువ పట్టేదికాదు. మధ్యాహ్నం 'లంచి' మాత్రం ఎక్కడ వీలైతే అక్కడ తీసుకునేవాడిని. రాత్రికి రొట్టె, కోకో తిరిగి గదిలోనే. ఆవిధంగా రోజుకు ఒకషిల్లింగు, మూడుపెన్నీలతో కాలక్షేపం చేసేవాడిని. ఇలావుండగా, అతిశ్రద్ధగా చదువుకోడానికి వీలైంది. ఇంత నిరాడంబరంగా జీవయాత్ర చేసినందువల్ల, చదువుకోడానికి ఓపినంత వ్యవధి దొరికింది. పరీక్ష ప్యాసైనాను.

ఖర్చు తగ్గించి వేశాను కాబట్టి, జీవితంనాకు దుర్భరమై తోచివుంటుందని పాఠకులు ఊహించవద్దు. మీదు మిక్కిలి, ఈ మార్పుకారణంగా నా అంతర, బాహ్య జీవిత విధానాలకు ఒక విధంగా సామరస్యం కుదిరింది. నా జీవితం ఇప్పుడు ఇదివరకు కంటే సత్య సమ్మతంగానూ, సంపూర్ణ సౌఖ్య ప్రదంగానూ పరిణమించింది.

---

# 12. వ్యామోహం

జీవిత పద్ధతిలో పెట్టుకున్న నియమాల ఫలితంగా ఆహార విషయంలోకూడా మార్పులు ఏర్పడినవి. శాకాహార శాస్త్రాన్ని పఠించాను. శాకాహార సంఘం ప్రచురించే వార పత్రికకు చందా కట్టి తెప్పించుకోవడం మొదలుపెట్టాను. అంతే కాదు. ఆ సంఘంలో సభ్యుడుగా కూడా చేరాను. అచిరకాలంలోనే ఆ సంఘకార్యవర్గ సభ్యుడి నైనాను. మిఠాయిలు, ఊరగాయలు, కాఫీ, టీలు మానివేశాను. రొట్టె, కోకో, ఉడక

బెట్టిన కూరలమీదే ఎక్కువగా ఆధారపడే వాడిని. ఆహారం విషయంలో చేసిన పరిశోధనల వల్ల, రుచికి మూలం నాలుక కాదనీ మనస్సేననీ గ్రహించ గలిగాను.

వివిధ మతవిషయాలను గురించి కూడా కొంత వరకు తెలుసు కున్నాను. దివ్యజ్ఞాన సమాజానికి చెందిన ఇద్దరు మిత్రులతో పరిచయం లభ్యమైంది. వారికి నే నెంతైనా కృతజ్ఞుడను. సర్ ఎడ్విన్ ఆర్నాల్డ్ భాషాంత రీకరించిన "భగవద్గీత"—(దీనికే "సాంగ్ సెలెస్టియల్" అని నామకరణం చేశాడు.) తమకు చదివి చెప్పవలసిందని వారు కోరారు. ఆ గ్రంథం మూలాన్నిగాని, తర్జుమానుగాని నే నెన్నడూ చదువలేదని వారికి చెప్పవలసి వచ్చినందుకు సిగ్గుపడ్డాను. 'భగవద్గీత' మనకు అతి పవిత్ర గ్రంథమని ప్రఖ్యాతి. ఇంగ్లీషు తర్జుమాను తమతో కలసి చదువుతాననీ, దాన్ని అర్థంచేసుకోవడానికి శక్తికొద్దీ సహాయపడతాననీ వారికి చెప్పాను. అంతటవారితో పాటు 'గీతా' పఠన ప్రారంభించాను. ద్వితీయా ధ్యాయం లోని ఈ కింది శ్లోకాలు నా మనస్సులో గాఢంగా నాటుకుపోయినవి. ఇవి అనుక్షణం నా చెవులలో మార్మోగు తుంటవి—

శ్లో॥ ధ్యాయతో విషయాన్పుంసః । స్సంగ స్తేషూపజాయతే ।
సంగాత్సంజాయతేకామః । కామాత్క్రోధోభిజాయతే ॥
క్రోధాద్భవతి సమ్మోహః । సమ్మోహాత్ స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో । బుద్ధినాశ్యాత్ప్రణశ్యతి ॥

'భగవద్గీత' అమూల్య గ్రంథమని తోచింది. నిరుత్సాహం, విస్పృహ ఏర్పడిన సమయాలలో ఆ గ్రంథ పఠనం నాకు అమోఘంగా తోడ్పడ్డది.

మాంచెస్టర్ నగరంలోని ఒక క్రైస్తవ మిత్రుని సూచన ననుసరించి ఆదేసమయంలో 'బైబుల్' కూడా చదివాను. 'ఓల్డ్ టెస్టమెంటు' లోని కొన్నిభాగాలను బహుకష్టం మీదగాని చదువలేక పోయినాను. విసు

గుపుట్టి అసహ్యం వేసింది. 'న్యూటెస్టమెంటు'లో ముఖ్యంగా 'సర్మన్ ఆన్ ది మౌంట్' నన్ను ముగ్ధుణ్ణి చేసింది. దాన్ని నేను 'గీత'తో పోల్చి చూశాను. "ఎవరైనా కీడుచేస్తే ప్రతిఘటించవద్దు; కుడి చెంపమీద కొడితే ఎడమచెంప కూడా చూపించు," అనే బైబులు సూక్తి నాకు అపరిమితా నందాన్ని కలిగించింది. బైబులులో ఆ మాటలు చదివినప్పుడు గుజరాతీ కవి శ్యామల భట్టు వ్రాసిన "గుక్కెడు నీటికి పట్టెడన్న మిడు"....అను పద్య చరణం జ్ఞాపకం వచ్చేది.

హిందూమతానికీ, తదితర మతాలకూ సంబంధించిన విషయాలతో స్వల్ప పరిచయం వున్నది. కాని, జీవిత పరీక్షలను ఎదుర్కొనడానికి ఆపాటి జ్ఞానం చాలదని గ్రహించ వలసింది.

నేను ఇంగ్లండులోవున్న ఆఖరు సంవత్సరంలో పోర్ట్స్మత్ లో జరిగిన శాకాహారుల సమావేశానికి ఒకమిత్రుడితో పాటు నన్నూ ఆహ్వానించారు. మా కందరికీ ఒకఇంటిలో విడిది ఏర్పాటు చేశారు. ఆ ఇంటి అపఖ్యాతి ఆహ్వాన సంఘం వారికి తెలియదు. భోజనా నంతరం పేకాట ఆడుకోడానికి కూర్చునేవాళ్ళము. ఆ గృహ యజమానురాలు కూడా మాతో కలసి ఆడుతుండేది. ఆటకు కూర్చున్నవాళ్ళు అమాయకంగా ఏవేవో ఛలోక్తులు విసురు తుండేవాళ్ళు. ఆ సందర్భంలో నాతోవచ్చిన మిత్రుడు, ఆ యజమానురాలు ఒకరిపై ఒకరు అసభ్యమైన ఛలోక్తులు సైతం విసురు కోవడం ప్రారంభించారు. వారి ఛలోక్తులు నన్నుకూడా ఆకర్షించినవి. నేనూ మొదలుపెట్టాను. పేకముక్కలను, ఆటను వదిలివేసి ఛలోక్తులతో ఆగక హద్దు దాటి పోబోతున్నానని గ్రహించగానే, భగవంతుడే నా మిత్రుడిచేత ఈ క్రిందిమాటలలో నాకు హెచ్చరిక చేయించాడు—"ఎక్కడినుంచి వచ్చింది, నీ కింత సాహసం! ఇకచాలించు—వెళ్ళిపో త్వరగా."

అంతటితో నాకు తల వంపు లైంది. ఆ హెచ్చరిక పాటించి నాలో నేనే మిత్రుడికి ఎంతో కృతజ్ఞత చెప్పుకున్నాను. త్రికరణ శుద్ధిగా మా

అమ్మ ఎదుట చేసిన ప్రమాణాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని, వెంటనే అక్కడ నుంచి పారిపోయినాను.

మత ప్రాధాన్యాన్ని గురించిగాని, భగవంతుడిని గురించిగాని, నాకు అప్పుడు తెలియదు. మానవ మాత్రులమైన మనలో భగవంతుడు ఏ విధంగా మెలగు తుండేదీ కూడా తెలియదు. ఆ నాటి విషమస్థితినుంచి దేవుడే నన్ను కాపాడాడని చూచాయగా మాత్రమే అర్థంచేసుకున్నాను. అనేక పరీక్షాసమయాలలో నా వికృత చర్యలనుంచి భగవంతుడు కాపాడి నందుకు సంతోష పడుతున్నాను. ఆశలన్నీ అడుగంటిన సమయాలలో, సహాయం చేస్తారను కున్నవారు చేయనివేళలో, సర్వసౌఖ్యాలు పలాయనం చిత్తగించిన పరిస్థితులలో ఎక్కడనుంచో, ఏదోవిధంగా సహాయం చేకూ రేది. ప్రమాణాలు, ప్రార్థనలు, అర్చనలు వెర్రి నమ్మకాలని తోసివేయడా నికి వీల్లేదు. భోజనం చేయడం, తాగడం, కూర్చోడం, నడవడం ఈ పనులన్ని ఎంత వాస్తవమైనవో ప్రణామం, ప్రార్థన, అర్చనలు అంతకంటె మిన్నగా వాస్తవమైనవి. కేవలం యివే వాస్తవమైనవనీ, మిగతాపనులన్నీ మిథ్య అనీ చెప్పినప్పటికీ అతిశయోక్తి అనిపించు కోలేదు.

---

## 13. బారిస్టర్

ఇన్ని గొడవలలో వున్నప్పటికీ, నా చదువు సంగతి మాత్రం మరచి పోలేదు. తొమ్మిది నెలలపాటు శ్రమపడి చదివి, 1891 జూన్ 10-వ తేదీన బారిస్టర్ పరీక్షలో ఉత్తీర్ణుడనైనాను. జూన్ 12-వ తేదీన స్వదే శానికి ఓడలో బయలుదేరాను. 'ఇండియన్ లా' తెలియదే అనే బెంగ ప్రారంభమైంది. వృత్తిలో తగినంత పని దొరుకుతుందనే నమ్మకం ఏ

మాత్రం లేదు. ఏడెన్‌లో బయలుదేరి నప్పటినుంచి ఓడ ప్రయాణం సవ్యంగా సాగలేదు. ఇంచుమించు ప్రతి ప్రయాణీకునికీ సుస్తీచేసింది. ఒక్క నేనుమాత్రమే రాయిలా ఏబాధ లేకుండా వున్నాను. ఓడ పై భాగానికివెళ్ళి, అల్ల కల్లోలంగా వున్న సముద్రతరంగాల తాకిడిని చూసి ఆనందిస్తుండేవాడిని. ఉదయం భోజనానికి నేనుగాక ఇంకా ఒకరిద్దరు ప్రయాణికులు మాత్రమే హాజరయే వాళ్ళు. ప్లేట్లలో ఓటుగింజల జావపోసి, ఓడ కుదుపులకు ఆ జావ ఒలికి పోకుండా, ప్లేట్లను జాగ్రత్తగా తొడలమీద పెట్టుకొని తాగుతుండేవాళ్ళము.

బాహ్య వాతావరణంలో సంభవించే తుపాను మానవుడిలో అంత ర్గతమైవుండే మానసికపు తుపానుకు చిహ్నమేనని నా భావన. వా తావ రణ సంబంధమైన తుపాను నన్ను ఏ విధంగా చలింపజేయలేక పో యిందో, అంత రంగికమైన తుపానుకూడా అదే విధంగా ఏమీ చేయలేక పోయిందని చెప్పగలుగుతున్నాను.

రేవులో దిగగానే నన్ను కలుసుకోడానికి మా అన్నగారు వచ్చారు. మా తల్లి పరమ పదించిందనే దుఃఖవార్తను ఓడ దిగగానే విన్నాను. ఆ వార్తను అంతకాలంగా మా అన్నగారు నాకు తెలియజేయకుండా వుం చారు. విదేశంలో వుండగా నాకు ఆ వార్తను తెలియజేయడ మెందు కని వ్రాయలేదు. ఆలస్యంగా తెలిసినప్పటికీ ఆ విషాదవార్త నన్ను విశ్చేష్టునిగా జేసింది. మా తండ్రి మరణించినప్పుడు మరీ దుఃఖించాను. నేను పెట్టుకున్న ఆశలన్నీ పటాపంచలై పోయినవి. ఐతే, మనస్సులో వున్న దుఃఖాన్ని బయటికి పొంగనివ్వలేదని జ్ఞాపకం. కన్నీళ్ళుపైతం కార్చకుండా ఆపుకో గలిగాను. జీవయాత్ర ప్రారంభించడానికి దుఃఖం ఏవిధంగానూ అంతరాయం కాలేదు.

కొంతకాలంపాటు రాజకోటలోనే వున్నాను. హైకోర్టులో అనుభ వం గడించడానికి బొంబాయి వెళ్ళవలసిందనీ, ' ఇండియన్ లా ' చదువ

వలసిందనీ, బొంబాయిలోనే కృషిచేసి ప్రాక్టీసు సాధించవలసిందనీ మిత్రులు సలహా ఇచ్చారు. వారి సలహాప్రకారం బొంబాయి వెళ్ళాను.

ఖర్చులు ఎప్పటికప్పుడు ఎక్కువైపోతుండడంచేతా, తగినంత ఆదాయం లేకపోవడం చేతా బొంబాయిలో నాల్గు, ఐదు నెలలకు మించి వుండలేక పోయినాను.

ఆశాభంగంతో బొంబాయినుంచి తిరిగి రాజకోటకు వెళ్ళాను. అక్కడే నా కార్యాలయాన్ని ఏర్పాటు చేసుకున్నాను. మొత్తంమీద, రాజకోటలో ధనార్జన ఒకమాదిరిగా బాగానే వున్నదని చెప్పవచ్చు. దరఖాస్తులు, మహజర్లు వ్రాసిపెట్టడంవల్లనే సగటున నెలకు మూడువందల రూపాయల ఆదాయం వస్తుందేది. ఈ విధంగా ఇంతడబ్బు వచ్చేదీ అంటే, నా సామర్థ్యంకంటె మాకున్న పలుకుబడే కారణమని చెప్పవలసి వుంటుంది. మా అన్నగారి భాగస్వామికి మంచి వ్యాపారం వున్న కారణంచేత ఆయన పలుకుబడి పనిచేసింది. తనకు ముఖ్యమని తోచిన దరఖాస్తులు మొదలైనవాటిని ఆయన పెద్ద బ్యారిస్టర్లచేత వ్రాయించడానికి పంపించేవాడు. బీద క్లయింట్లకు వ్రాసిపెట్టవలసిన దరఖాస్తులన్నీ నా పాలిట పడేవి.

---

# 14. దక్షిణాఫ్రికా ప్రయాణం

కథియవాడ్ సంస్థానంలోని కుతంత్ర వాతావరణ పరిస్థితులు నాకు అచిరకాలంలోనే అసహ్యం కలిగించినవి. పోర్బందర్ నివాసి అయిన ఒక ముస్లిం దక్షిణాఫ్రికా వెళ్ళి కొంతపని చేసిపెట్టవలసిందని నన్ను కోరాడు. వెంటనే ఒప్పుకున్నాను. దాదా అబ్దుల్లా కంపెనీ, తాయిబ్ హాజీ ఖాన్ మామద్ కంపెనీ అనేవి రెండూ అక్కడ పోటా

పోటీలతో వ్యాపారం చేస్తున్న సంస్థలు. దాదా అబ్దుల్లా కంపెనీ వారు తమతో పోటీచేస్తున్న సంస్థమీద 40 వేల పౌనులకు దావాచేశారు. దక్షిణాఫ్రికాకు రాను-పోనూ మొదటితరగతి ప్రయాణం ఖర్చులు, తదితర ఖర్చులే గాక, దక్షిణాఫ్రికాలోవుండి తమకు పని చేసిపెట్టినట్లయితే, సంవత్సరానికి 105 పౌనులు ఇస్తానని దాదా అబ్దుల్లా కంపెనీ భాగస్వామి చెప్పాడు. అందువల్ల 1893 ఏప్రల్ నెలలో భారతదేశంనుంచి దక్షిణాఫ్రికాకు ప్రయాణమైనాను.

నేటాల్ రాష్ట్రానికి డర్బాన్ రేవు పట్టణం. ఓడ దిగగానే స్వాగతం ఇవ్వడానికి అబ్దుల్లా సేఠ్ రేవుకువచ్చాడు. రేవు చేరగానే, తమ తమ మిత్రులను కలుసుకోడానికి చాలామంది ఓడలోకి వచ్చారు. భారతీయులపై యూరపియనులకు ఏమాత్రం గౌరవ మర్యాదలు లేనట్లు గమనించి తెలుసుకున్నాను. అబ్దుల్లా సేఠ్‌ను బాగా తెలిసిన యూరపియనులే తా మేదో గొప్పవారమనే దురభిప్రాయంతో ప్రవర్తిస్తున్నట్లు స్పష్టంగా గోచరించింది. వారు ఆ విధంగా ప్రవర్తించడం చూసి. నా మనస్సు చివుక్కుమన్నది. అబ్దుల్లా సేఠ్ ఆ పరిస్థితులకు అలవాటుపడిపోయినారు. అక్కడ చేరినవారు నన్ను వింతగా చూడసాగారు. నేను ధరించిన దుస్తులవల్లనే మిగత భారతీయులకూ, నాకూ వ్యత్యాసం వ్యక్తమవుతున్నది. పొడుగాటి కోటూ, బెంగాలీ ఫక్కీలో తలపాగా ధరించివున్నాను.

దాదా అబ్దుల్లా కంపెనీ కార్యాలయానికి నన్ను తీసుకువెళ్ళారు. నాకోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేసినగది చూపించారు. అది అబ్దుల్లా సేఠ్ గదికి పక్కనే వున్నది. మొదట అతడి గొడవ నాకూ అర్థంకాలేదు; నా గొడవ అతడికీ అర్థంకాలేదు. నా ద్వారా అతడి సోదరుడు పంపిన కాగితాలను చదువుకొని అబ్దుల్లాసేఠ్ మరీ తికమక పడ్డాడు. విపరీతంగా ధనవ్యయం చేయించడానికే తన సోదరుడు నన్ను అక్కడికి

పంపించినట్లు అబ్దుల్లా షేట్ భావించడం మొదలుపెట్టాడు. నా దుస్తులను, పోకడలను బట్టి యూరొపియనుల మాదిరిగా ఖర్చుదారుననే భావం అతడికి కలిగింది. నన్ను అప్పటి కప్పుడు వెంటనే వియోగించడానికి ప్రత్యేకమైన పనేమీలేదు. వారి దావా ట్రాన్స్‌వాల్‌లో నడుస్తున్నది. తక్షణమే నన్ను అక్కడికి పంపించడంలో అర్థమేమీలేదు. నా శక్తి సామర్థ్యాలను గాని, నా నిజాయితీని గాని అతడు ఏవిధంగా? ఎంతవరకు? విశ్వసించగలడు? నన్ను ఒకకంట కనిపెట్టివుండాలంటే అతడు ప్రిటోరియాలోనే వుండిపోవడానికి వీల్లేదయ్యె! ప్రతివాదులు వున్నది ప్రిటోరియాలోనే. అక్కడికి వెళ్ళినట్లయితే, వారు నన్ను తమవైపు తిప్పుకోడానికి ప్రయత్నిస్తారేమో? నని కూడా అతడికి తోచివుంటుంది. నా కేదైనా ఇతరపని చూపించాలంటే, ఈ దావాపని గాక మరేమున్నది? మిగతా పని అంతా నాకంటె చక్కగా గుమాస్తాలే చేస్తారయ్యె. ఏదైనా తప్పు చేస్తే, గుమాస్తాలనైతే దండించవచ్చు. నేనుకూడా ఏదైనా తప్పుచేస్తే, గుమాస్తాలను దండించినట్లే, నన్నూ దండించవచ్చునా? దావావిషయంలో పనిఏమీ ఇవ్వకపోయినట్లయితే, నన్ను వృధాగా వుంచవలసి వస్తుంది.

అబ్దుల్లా షేట్ మొత్తంమీద అక్షరజ్ఞానం లేనివాడనే చెప్పవచ్చు. ఐతే, గొప్ప అనుభవజ్ఞానం వున్నది. అతడిది నిశితమైన బుద్ధిబలం. ఆసంగతి అతడికి తెలుసు. కేవలం అభ్యాసంవల్ల ఇతరులతో సంప్రతించడానికి వీలుగా అతడికి కొంత ఆంగ్లభాషవచ్చు. బ్యాంకు మేనేజర్లతో, యూరపియన్ వ్యాపారస్థులతో సంభాషించి వ్యాపార వ్యవహారాలు చూసుకోడానికీ, తన సలహాదారుకు తన విషయం చెప్పుకోడానికి తగినంతగా మాత్రమే ఆంగ్లభాష తెలుసు. అక్కడ భారతీయులందరికీ అతడిపై గౌరవ ప్రతిపత్తి హెచ్చు. భారతీయ వ్యాపార సంస్థలన్నిటిలో అతడిదే పెద్దది. కనీసం దాన్నిమించిన సంస్థ ఏదీ లేదనే చెప్పవచ్చు.

అక్కడికి వెళ్ళిన రెండవరోజునో, మూడవరోజునో దర్బాన్ కోర్టు చూపించడానికి నన్ను అబ్దుల్లా సేఠ్ తీసుకువెళ్ళాడు. కోర్టులో అనేకమందికి నన్ను పరిచయంచేశాడు. తన న్యాయవాదిపక్కనే నన్ను కూడా కూర్చోబెట్టాడు. కోర్టు మేజిస్ట్రేటు నావంక ఏకదీక్షతో చూడ డం మొదలు పెట్టాడు. అవిధంగా చూసి చూసి, నా తలపాగా తీసి వేయవలసిందని కోరాడు. అందుకు నేను నిరాకరించి, కోర్టునుంచి వెళ్ళిపోయాను.

ఆహా! ఇక్కడకూడా మనకు పోరువున్న దనుకున్నాను.

తలపాగాలు తీసివేయవలసిందని కొంత మంది భారతీయులను ఎందుకు కోరేదీ అబ్దుల్లా సేఠ్ నాకు వివరంగా చెప్పాడు. ముసల్మా నుల దుస్తులు ధరించినవారు తమ తలపాగాలు వుంచుకోవచ్చుననీ, మిగతా భారతీయులు న్యాయస్థానంలో ప్రవేశించగానే తలపాగాలు తీసి వేయాలనే నియమం వున్నదనీ అబ్దుల్లా సేఠ్ తెలియజేశాడు.

తలపాగా తీయడం అవమానాన్ని భరించడమే. భారతీయులు ధరించే తలపాగాను మానివేసి, ఆంగ్లేయుడి మాదిరిగా టోపీ పెట్టుకుం దామా అనే ఆలోచన పోయింది. అవిధంగా చేసినట్లయితే, అవమా నానికి పాల్పడవలసిన అగత్యం వుండదనీ, అసహ్యమైన వివాదం ఒకటి తప్పిపోతుందనీ తోచింది.

ఐతే, ఇందుకు అబ్దుల్లా సేఠ్ ఆమోదించలేదు. "నీవు ఈ విధంగా చేసినట్లయితే, చెడు కలుగుతుంది. తల పాగా ధరించవలసిందే ననే వారి వాదనను చెడగొట్టినవాడి వవుతావు. పైగా తలపాగా నీకు ఎంతో అమరికగా వుంటుంది. దొరటోపీ పెట్టుకున్నట్లయితే, నిన్ను బట్లర్ అనుకుంటారు" అని సేఠ్ హితబోధ చేశాడు.

సేఠ్ సలహా ఆచరణ యోగ్యంగానూ, దేశభక్తి యుతంగానూ

కనుపించింది. ఐనప్పటికీ, అందులో కొంత సంకుచిత దృష్టి కూడా లేకపోలేదు.

ఏది ఎలాగైనప్పటికీ, మొత్తంమీద ఆ సలహా నాకు నచ్చింది. కోర్టులో జరిగిన సంఘటననుగురించి పత్రికలకు వ్రాశాను. తలపాగా ధారణను సమర్థించుకున్నాను. కోర్టులో తలపాగా ధరించవచ్చునా, ధరించకూడదా అనే విషయంపై పత్రికలలో పెద్దచర్చే జరిగింది. చివరకు నేను "పిలవని పేరంటం" గా వచ్చినట్లు లెక్కకట్టారు. దక్షిణాఫ్రికా చేరిన కొన్ని రోజులలోనే ఈ ఉదంతం నాకు తలవని తలంపుగా మంచి ప్రచారం చేసిపెట్టింది. కొంతమంది నన్ను బలపరిచారు. మరికొంతమంది తీవ్రంగా ఖండించారు.

అబ్దుల్లా సేట్ నాకు త్వరలోనే పనిచూపించాడు. ఆయన కేసు కారణంగా నేను ప్రిటోరియా వెళ్ళి అక్కడవుండవలసిన అగత్యం ఏర్పడింది. దక్షిణాఫ్రికా చేరిన ఏడవరోజునో, ఎనిమిదవరోజునో డర్బాన్ నుంచి ప్రయాణమై వెళ్ళవలసి వచ్చింది. రైలులో ఫస్టుక్లాసు సీటు ఒకటి నాకోసం బుక్ చేశారు. బెడ్డింగ్ కూడా సప్లయి చేయించుకోదలచినట్లయితే ప్రతి ప్రయాణీకుడు అదనంగా ఐదుషిల్లింగులు చెల్లించే ఆచారం అక్కడవున్నది. ఒక బెడ్డింగు కూడా బుక్ చేసుకోవలసిందని అబ్దుల్లా సేట్ పట్టుబట్టాడు. కాని, మూర్ఖత్వంవల్లా, గర్వంవల్లా, ఐదు షిల్లింగులు అదా చేద్దామనే ఉద్దేశంవల్లా, నాకు 'బెడ్డింగ్' అక్కరలేదని చెప్పాను.

"ఇది భారతదేశంకాదు. మన దేశానికీ దీనికీ వ్యత్యాసం వున్నది. ఆ విషయం గమనించాలి. ఖర్చు పెట్టడానికి ఏదో భగవంతుడు మనకు ఇంత ఇచ్చాడు. అవసరమైన ఖర్చుల విషయంలో పిసినిగొట్టుగా వుండ నక్కరలేదు" అన్నాడు సేట్.

నా విషయమై ఏవిధంగానూ ఆతుర్దా పడవద్దని కృతజ్ఞతా పూర్వకంగా తెలియజేశాను.

నేటాల్ రాజధాని అయిన మారిట్జ్‌బర్గ్‌కు రైలు చేరేసరికి రాత్రి 9-గంటలైంది. ప్రయాణీకులకు బెడ్డింగులు ఇచ్చేది ఈ రైలుస్టేషనులోనే. ఒకరైల్వేనౌకరు నావద్దకువచ్చి 'బెడ్డింగు' కావాలా ? అని ప్రశ్నించాడు. "అవసరం లేదు ; నావద్ద ఒకటి వున్నది," అన్నాను. అతడు వెళ్ళిపోయాడు. అంతట ఒక ప్రయాణీకుడు వచ్చి నన్ను పైకీ, కిందికీ తేరిపార చూశాడు. నేను 'నల్లవాడిని' అని తెలుసుకున్నాడు. నా రంగు అతగాడిని చాలా ఆందోళన పరిచింది. వెళ్ళిపోయి, ఒకరిద్దరు అధికార్లను వెంటబెట్టుకొని తిరిగివచ్చాడు. వారు నన్ను తేరిపార చూశారే గాని, ఏమీ అనలేదు. అంతలో మరొక అధికారి వచ్చాడు. "నీవు మరొక పెట్టెలో కూర్చోవాలి, రా రమ్మ" అన్నాడు.

"నాది ఫస్టుక్లాస్ టిక్కెట్టు" అన్నాను.

"అదేమీ లాభంలేదు. మరొక పెట్టెలోకి పోక తప్పదు" అన్నాడు.

"డర్బాన్‌లో బయలుదేరినప్పుడు ఈ పెట్టెలో కూర్చోనిచ్చారు. ఇకమీదకూడా నేను ఇందులో ప్రయాణం చేయవలసిందే," అని పట్టుబట్టాను.

"అలా వీల్లేదు. ఈ పెట్టె ఖాళీచేయవలసిందే; లేకపోతే, పోలీసును పిలుస్తా" అన్నాడు.

"నిరభ్యంతరంగా పిలుచుకో. నా అంతట నేనుమాత్రం ఇక్కడి నుంచి కదలను," అన్నాను.

కానిస్టేబుల్ వచ్చాడు. చెయ్యిపట్టి బయటికి లాగాడు. నా సామాను కూడా బయటికి తీశాడు. మరొక పెట్టెలోకి వెళ్ళడానికి నిరాకరించాను. అంతలో రైలుకదలి వెళ్ళిపోయింది. వెయిటింగు రూములోకివెళ్ళి

కూర్చున్నాను. నా చేతిసంచి మాత్రమే నావద్దవున్నది. మిగతా సామా న్లన్నిటినీ ఎక్కడ పడవేశారో అక్కడే వదలివేశాను. వాటిని రైల్వే అధికారులే జాగ్రత్తచేశారు.

అది శీతాకాలం. దక్షిణాఫ్రికాలోని ఎగువభాగాలలో శీతాకాలంలో విపరీతమైన చలి వేస్తుంది. నా 'ఓవర్‌కోట్' సామాన్లలోనే వుండి పోయింది. అది కావాలంటే తిరిగి ఎక్కడ అవమాన పరుస్తారో నని అడగడానికి ధైర్యం చాలలేదు. అందుచేత చలికి గడ గడ వణికిపోతూ, అలాగే కూర్చున్నాను. 'వెయిటింగ్ రూమ్'లో దీపం అంటూ లేదు. దాదాపు అర్ధరాత్రివేళ ఒక ప్రయాణీకుడు ఆగదిలోకి వచ్చాడు. నాతో మాట్లాడా లనుకున్నట్లున్నాడు. మాట్లాడించినా మాట్లాడే ధోరణిలో నేను లేను.

నా కర్తవ్యాన్ని గురించే నేను ఆలోచించుకో సాగాను. నా హక్కులకోసం పోరాడడమా ? లేక, భారతదేశానికి తిరిగి వెళ్ళడమా ? అదీ గాకపోతే, అవమానాలను లెక్కచేయకుండా ప్రిటోరియాకువెళ్ళి దాదా పని పూర్తిచేసుకొని ఆ పిమ్మట స్వదేశం చేరుకోవడమా ? ఈ ఆలోచనలలో పడ్డాను. కార్య భారాన్ని నెరవేర్చకుండా భారతదేశానికి తిరిగి వెళ్ళడం పిరికితన మనిపించుకుంటుంది. వర్ణ విభేదమనే ఘోర వ్యాధి ఇక్కడ ప్రబలిపోయింది. నాకు సంభవించిన ఇక్కట్టు ఈ వ్యాధికి బాహ్య చిహ్నం మాత్రమే. అవసరమైతే ఇలాంటి ఇక్కట్లను ఎన్నిటినైనా భరించి, ఈ వ్యాధిని నిర్మూలించడానికి సాధ్యపడుతుందేమో ప్రయత్నంచేసి చూడాలి. జాతి విద్వేష నిర్మూలనకు ఎంతవరకు అవ సరమో అంతవరకు వ్యక్తిగతంగా నాకు జరిగే అన్యాయాలను అరికట్టాలి.

ఆరునూరైనప్పటికీ, నూరు ఆరైనప్పటికీ ప్రిటోరియాకు మరునటి రైలులో ప్రయాణమై వెళ్ళవలసిందేనని సంకల్పించుకున్నాను.

మరుసటి ఉదయం రైల్వేకంపెనీ జనరల్ మేనేజరుకు పెద్ద తంతివార్త పంపించాను. జరిగిన విషయాన్ని అబ్దుల్లా సేఠ్‌కు కూడా తెలియజేశాను. అబ్దుల్లా సేఠ్ తక్షణమే వెళ్ళి జనరల్ మేనేజరును కలుసుకున్నాడు. రైల్వే అధికారుల ప్రవర్తనను మేనేజరు సమర్థించాడు. సురక్షితంగా నన్ను మరుసటి రైలులో ఎక్కించి ప్రిటోరియాకు పంపించ వలసిందని స్టేషను మాస్టర్‌కు ఉత్తర్వు జారీచేసినట్లుకూడా జనరల్ మేనేజర్ సేఠ్‌కు తెలియజేశాడు. నా పరిస్థితినిగురించి మారిట్జ్‌బర్గ్‌లోని భారతీయ వ్యాపారస్థులకు, మిగతచోట్ల వున్న మిత్రులకు తంతివర్తమానం అబ్దుల్లా పంపించాడు. నన్ను కలుసుకొని, జాగ్రత్తగా చూడవలసిందని వారిని ఆయన కోరాడు. ఆవ్యాపారస్థులువచ్చి, నన్ను స్టేషనులో కలుసుకున్నారు. తాము అనుభవించిన కష్టాలన్నిటినీచెప్పి, వారు నన్ను ఓదార్చడానికి ప్రయత్నించారు. ఇల్లాంటివి సాధారణంగా జరిగే సంఘటనలేనని కూడా అన్నారు. ఒకటి. రెండు తరగతులలో రైలుప్రయాణంచేసే భారతీయులు రైల్వే అధికారులవల్లనూ, శ్వేతజాతివారి వల్లనూ చిక్కుబడక తప్పదం లేదన్నారు. ఈ విచార గాథలను వింటూ ఆరోజంతా వెళ్ళబుచ్చాను. సాయంత్రానికి రైలువచ్చింది. నాకోసం ఒక 'బెర్త్' రిజర్వుచేసివున్నది. డర్బాన్‌లో ఏ "బెడ్డింగ్ టికెట్టు" నైతే కొనలేదో, దాన్ని మారిట్జ్ బర్గ్‌లో కొన్నాను.

ఆ రైలులో ప్రయాణం చేసి ఛార్లెస్‌టౌన్ చేరాను. అక్కడినుంచి 'కోచ్' (గుఱ్ఱపు బండి—పెద్దది) బండిలో జోహనెస్‌బర్గ్ వెళ్ళాను. ఈ 'కోచ్' ప్రయాణంలో కూడా ఇబ్బందులు పడకపోలేదు. జోహెనెస్ బర్గ్‌నుంచి రైలులో ప్రిటోరియాకు ప్రయాణమై వెళ్ళాను.



# 15. ప్రజా సేవ

దక్షిణాఫ్రికాలో భారతీయుల పరిస్థితి ఏ విధంగా వున్నదీ 1893 లోనే నాకు పూర్తిగా తెలిసిపోయిందన్నమాట. ఈ సమస్యను గురించి ప్రిటోరియాలోని భారతీయులతో అప్పుడప్పుడు సంప్రతించడం మినహా అప్పటిలో నేనేమీ చేయలేదు. దాదా పని చూసుకుంటూ, భారతీయుల ఇక్కట్లను గురించి ఆలోచించడానికి సాధ్యపడలేదు. రెండు పనులనూ ఒకే సారి తలపెట్టడం వల్ల, రెండుపనులూ పాడై పోతవేమో ననుకున్నాను. ఇంతలోనే 1894 వచ్చింది. దక్షిణాఫ్రికాకు ఏ దావాపని మీద వచ్చానో, ఆ పని సంతృప్తి కరంగా పరిష్కారమైంది. ప్రిటోరియా నుంచి డర్బాన్ కు తిరిగి వెళ్ళాను. భారత దేశానికి వెళ్ళిపోదామని సన్నాహ పడుతున్నాను. దాదా అబ్దుల్లాసేఠ్ నా గౌరవార్థం వీడ్కోలు ఏర్పాటు చేశాడు. ఆ వీడ్కోలు సందర్భంలో 'నెటాల్ మెర్క్యూరీ' అనేపత్రిక కాపీ ఒకటి ఎవరో నాకు ఇచ్చారు. దాన్ని చదివాను. నెటాల్ శాసనసభ చర్చ వివరాలన్నిటినీ అందులో ప్రకటించారు "భారతీయుల వోటింగు హక్కు" అనే శీర్షిక క్రింద కొన్ని పంక్తులు అచ్చు అయినవి. భారతీయులకు ఓటింగుహక్కు లేకుండా చేయడానికి నేటాల్ ప్రభుత్వం ఒకబిల్లు ప్రవేశపెట్టబోతున్నట్లు ఆ వార్తచదివి తెలుసుకున్నాను. అక్కడ భారతీయులకువున్న కొద్దిపాటి హక్కులు అంతటిలో రద్దు కాబోతున్న వన్నమాట. ఆ వార్త చదివిన మీదట, స్వదేశ ప్రయాణాన్ని విరమించు కున్నాను. ఆ రాత్రే కూర్చుని, నేటాల్ శాసనసభకు పంపడానికి ఒకపిటిషను తయారు చేశాను. నేటాల్ శాసన సభలో ఈ బిల్లుపై చర్చకు వాయదా వేయించవలసిందని ప్రభుత్వానికి తంతివార్త పంపించాము. సేఠ్ అబ్దుల్లా అధ్యక్షత కింద ఒకకమిటీ ఏర్పాటు చేశాము. ప్రభుత్వానికి తంతివార్తను సేఠ్ అబ్దుల్లా

పేరచే పంపించాము. పిటిషన్ ఫలితంగా బిల్లుపై మిగతా చర్చను రెండు రోజులపాటు వాయిదా వేశారు. దక్షిణాఫ్రికా శాసన సభకు భారతీయులు పంపుతున్న మొదటి పిటీషన్ అదే. బిల్లును పూర్తిగా అరికట్ట లేకపోయిన ప్పటికీ, ఆ పిటిషన్ మొత్తంమీద కొంతవరకు పనిచేసింది. ఆందోళన సాగిస్తే. ఫలితం ఏ విధంగా వుండగలదో తెలుసుకోవడంలో దక్షిణా ఫ్రికా భారతీయుల తొలి అనుభవం ఇదే. వారందరిలో ఇది ఒక విధమైన నూతోన్నిత్సాహాన్ని కలిగించింది. ప్రతిరోజూ సమావేశాలు జరిపేవారు. ఆ సమావేశాలకు ఆ రోజు కారోజు ఎక్కువమంది ప్రేక్షకులు హాజరుకా వడం మొదలుపెట్టారు. ప్రచార విధికి కావలసిన ధనం అనుకున్నదానికంటే ఎక్కువగా వసూలైంది. విజ్ఞప్తుల ప్రతులను తయారుచేయడంలోనూ, వాటిపై సంతకాలు చేయించడంలోనూ, తత్సంబంధమైన ఇతరపనుల లోనూ, అనేక మంది వాలంటీర్లు ప్రతిఫలం తీసుకోకుండా సహాయ పడ్డారు. కొంతమంది కార్యకలాపంలో పాల్గొనడమేగాక, విరాళాలుకూడా ఇచ్చి సహాయంచేశారు. చాలామంది భారతీయులు ఉత్సాహంతో ఉద్యమం లో చేరారు. రాత్రింబగళ్లు వారందరూ బదులు మాట్లాడకుండా దేనికి కావ లసివస్తే దానికి కాపీలు వ్రాసి పెట్టేవారు. ఇంకా అనేక పనులు చేసేవారు. ఒకే ఒక మాసంరోజుల వ్యవధిలో పదివేలమంది సంతకాలతో పెద్దమహ జరొకటి తయారు చేసి, అప్పుడు వలసరాజ్య శాఖా మంత్రిగా పనిచేస్తున్న లార్డ్ రిప్పన్‌కు పంపించాము. నేను తలపెట్టిన తొలికార్య క్రమం అంత టితో పూర్తిఅయింది.

స్వదేశం వెళ్ళడానికి సెలవు ఇవ్వవలసిందని కోరాను. అప్పటి వరకు సాగించిన ఆందోళన భారతీయులను బాగా ఆకర్షించింది. అందుచేత నన్ను వారు ప్రయాణం కానివ్వలేదు. "చివరకు నాశనమై పోవడానికైనా సిద్ధపడి చేస్తున్న పనులలో ఇది మొదటిదని మీకై మీరే అన్నారుకదా? బ్రిటిష్ వలసరాజ్యశాఖామంత్రి మన మహజరుకు సుముఖ సమాధానం

ఇస్తాడో, ఇవ్వడో ఎవరికి తెలుసు? ఈ విషయంలో మా ఉత్సాహం ఏ విధంగా వున్నదీ ప్రత్యక్షంగా చూస్తూనే వున్నారు. డబ్బు ఇవ్వడానికీ, పని చేయడానికీ మేము సంసిద్ధంగా వున్నాము. ఇప్పటివరకు చేసిన పనిఅంతా మీరు వెళ్ళిపోయినట్లయితే, సరియైన నాయకత్వం లేక వృధా కావచ్చు. అందువల్ల మీరు ఇక్కడే వుండడం మీ విద్యుక్త ధర్మమని మా అభిప్రాయం" అని వాదించారు. ఈ వాదన బలం నాకు బోధపడింది. దక్షిణాఫ్రికాలో భారతీయుల క్షేమంకోసం పనిచేసే శాశ్వత సంస్థను ఏర్పాటు చేస్తే బాగావుంటుందని తోచింది. నెటాల్ ఇండియన్ కాంగ్రెస్‌ను వెంటనే స్థాపించాము. నా జీవిత సౌధానికి భగవంతుడు పునాదులను దక్షిణాఫ్రికాలోనే వేశాడు. జాతీయ ఆత్మ గౌరవ రక్షణార్థం జరగవలసిన పోరాటానికి అంకురార్పణకూడా అక్కడే జరిగింది. 1894. మే మాసం ప్రాంతంలో కాంగ్రెస్ స్థాపితమైంది.

ఈ కాంగ్రెస్ చరిత్ర ఉత్తరభాగం అద్భుతమైనట్టిదేగాని, దాని వివరాలను విధిలేక ఇక్కడ వదలివేయవలసి వస్తున్నది. కాంగ్రెస్ ఉత్తరోత్తరా ఏవిధంగా అనేక చిక్కులను ఎదుర్కొన్నదీ, ప్రభుత్వోద్యోగులు దానిపై ఏవిధంగా దెబ్బతీసిందీ, వాటన్నిటికీ తట్టుకొని అది ఏవిధంగా అకుంఠితమై బయటపడిందీ ఇక్కడ చెప్పడానికి వీల్లేకపోతున్నది. ఒక విషయంమాత్రం చెప్పక తప్పదు. గోరంతలను కొండంతలుగాచేసి చెప్పే దురభ్యాసంనుంచి భారతీయులను తప్పించడానికి కొన్ని చర్చలు జరపవలసి వచ్చింది. ఎవరి లోపాలు వారు తెలుసుకునేటట్లు చేయడానికి ప్రయత్నాలు చేశాము. భారతీయులకు ప్రతికూలంగా యూరపియనులు చేసే వాదనలలో ఏమాత్రం సబబు, సందర్భము వున్నప్పటికీ వాటిని నిరాక్షేపణగా ఒప్పుకునే పద్ధతి పెట్టుకున్నాము. ఆత్మ గౌరవానికి భంగంరాని పద్ధతిలో యూరపియనులతో సరిసమాన ప్రాయాన సహకారం జరపడానికి వీలైనప్పుడల్లా హృదయపూర్వకంగా అంగీకరించే

వాళ్ళము. భారతీయోద్యమాన్ని గురించి వార్తా పత్రికలు ఎన్ని వివరాలను ప్రకటించగలిగితే అన్ని వివరాలను పంపించేవాళ్ళము. భారతీయులపై పత్రికలలో అన్యాయంగా ఏవైనా ఖండనలు వెలువడినట్లయితే, ఆయా పత్రికలకు సమాధానాలు వ్రాసి ప్రకటనార్థం పంపించేవాళ్ళము.

# 16. తుపాను సూచనలు

నేను దక్షిణాఫ్రికాలో వుండడం మొదలుపెట్టి అప్పటికి మూడు సంవత్సరాలైంది. అక్కడి ప్రజలను నేను, నన్ను అక్కడి ప్రజలు అర్థం చేసుకోవలసిన అగత్యం ఏర్పడింది. నాకు ఒకమాదిరిగా మంచి ప్రాక్టీసే వుండేది. నేను అక్కడ వుండడం అవసరమని ప్రజలు భావిస్తున్నట్లు నాకు స్పష్టపడింది. అందువల్ల, స్వదేశం వెళ్ళి భార్యా పిల్లలను దక్షిణాఫ్రికాకు తీసుకువద్దామని సంకల్పించుకున్నాను. దక్షిణాఫ్రికాలోనే స్థిరంగా వుండిపోదా మనుకున్నాను.

దక్షిణాఫ్రికా భారతీయుల అనుమతితో ఆరునెలల వ్యవధికోరి, 1896.లో భారతదేశం చేరుకున్నాను. ఆరునెలలు పూర్తిఅయినదో, కాలేదో, తక్షణమే బయలుదేరి రావలసిందని నెటాల్‌నుంచి కేబుల్ వార్తవచ్చింది. వెంటనే బయలుదేరి వెళ్ళాను. దాదా అబ్దుల్లా "కోర్లెండ్" అనే పొగ ఓడను కొనివున్నాడు. ప్రయాణపు ఖర్చు లేకుండా, భార్యా సమేతంగా ఆ ఓడలో రావలసిందని అబ్దుల్లా సేట్ బలవంతం చేశాడు. ఆయన సూచనను కృతజ్ఞతతో ఆమోదించాను. డిసెంబరు నెల ప్రారంభంలో బొంబాయి నుంచి నెటాల్‌కు ప్రయాణమైనాను. నెటాల్‌కు ప్రయాణం చేయడం అది నాకు రెండవసారి. ఐతే,

ఈసారి నా భార్య, ఇద్దరు కుమార్లు కూడా వెంటవున్నారు. "నదేరి" అనే మరొక ఓడకూడా అదే సమయంలో డర్బాన్‌కు ప్రయాణమవు తున్నది. ఈ రెండు ఓడలలోనూ కలసి దాదాపు 800 మంది ప్రయాణీకులు వుంటారు. వీరిలో సగం మంది ట్రాన్స్‌వాల్‌కు వెళ్లుతున్నవారే.

మధ్య రేవులలో ఎక్కడా ఆగకుండా, ఎకా ఎకిన నెటాల్‌కే చేరిన కారణంచేత ప్రయాణం 18 రోజులు మాత్రమే పట్టింది. ముమ్ముందు రానున్న అసలు తుపానుకు హెచ్చరికేమో నన్నట్లుగా, మా నౌక పెనుగాలిలో చిక్కుబడింది. నెటాల్ ఇక నాల్గురోజులలో చేరుతా మనగా ఇది సంభవించింది. దక్షిణార్ధగోళంలో గ్రీష్మఋతువు డిసెంబరు నెలలోనే వస్తుంది. ఆ ఋతువులో దక్షిణ సముద్రాలమీద చిన్నవి, పెద్దవి తుపానులు చెలరేగడం సాధారణమైన విషయమే. మా ఓడను చిక్కులపాలు జేసిన గాలివాన భయంకరంగా చాలాసేపు కొట్టింది. ప్రయాణీకులు భీతావహులైనారు. ఆ దృశ్యం హృదయ విదారకమై తోచింది. ఆ విపత్స మయంలో ప్రయాణీకు లందరూ ఏకమైనారు. తమతమ విభేదాలను విస్మరించారు. ముసల్మానులు, హిందువులు, క్రిస్టియనులు, తదితరులు అందరూకలసి భగవన్నామ స్మరణ చేయసాగారు. కొందరు రకరకాల మొక్కులు మొక్కుకున్నారు. ప్రయాణీకుల ప్రార్థనలలో ఓడ సరంగుకూడా చేరాడు. తుపానువల్ల ప్రమాదం లేదని చెప్పడానికి వీల్లేక పోయినప్పటికీ, ఇంతకంటే ఘోరమైన తుపానులను అనేకం ఎదుర్కొన్న అనుభవం తనకు వున్నదనీ, ఓడ మంచిదీ, గట్టిదీ అయినట్లయితే దాదాపు ఎట్టితుపాను కైనా తట్టుకోగలదనీ సరంగు ప్రయాణీకులకు ధైర్యం చెప్పడం మొదలు పెట్టాడు. కాని, అంతమాత్రం చేత ప్రయాణీకులు ఊరట చెందలేను. అనుక్షణం పెద్దపెద్ద ధ్వనులు, పగుళ్ళ చప్పుళ్ళూ వినవచ్చినవి. వాటినిబట్టి నౌక భగ్నమవుతున్న దేమో ననుకున్నాము. ఓడ అటూఇటూ ఉయ్యాల లూగుతున్నది. చాలా దూరం

కొట్టుకొని పోవడంకూడా మొదలు పెట్టేసరికి, ఏ క్షణమైనా తలక్రిందులై పోతుందేమో నని కూడా అనిపించింది. ఓడ ఉపరి భాగంమీద వుండడం అసంభవంగా పరిణమించింది. "భగవదేచ్ఛ ఎలావున్నదో అలా జరిగితీరు తుంది." అనే మాటలే ప్రతి నోటా వినవచ్చినవి. ఇట్టి భయానక స్థితిలో మేము దాదాపు ఇరవై నాలుగు గంటల పాటుఉన్నట్లు నాకు జ్ఞాపకం. చిట్ట చివరకు ఎలాగైతే నేమి మేఘాలు విడిపోయి ఆకాశం నిర్మలమైంది. సూర్యభగవానుడు దర్శనమిచ్చాడు. తుపాను సర్దుమణిగిందని సరంగు అన్నాడు. ప్రయాణీకుల ముఖాలలో సంతోష కాంతులు కనిపించినవి. ప్రమాదం తొలగి పోవడంతో పాటు, వారినోళ్ళనుంచి భగవన్నామస్మరణ కూడా సమసిపోయింది. యథాప్రకారం తినడం, తాగడం, ఆడడం, పాడ డం, కేరింతలు కొట్టడం ప్రారంభించారు. మృత్యుభీతి తొలగి పోయింది. క్షణంపాటే అయినప్పటికీ, త్రికరణ శుద్ధిగానే వారు దైవప్రార్థన చేశారు. ఆ ప్రార్థన స్థానే "మాయ" ఆవరించింది. మామూలుగా జరిగే నమాజు, ప్రార్థన జరిగినవి గాని, వాటిలో ఆ ఆపత్సమయ ప్రార్థనలోని గాంభీర్యం ఏ మాత్రం కానరాలేదు.

తుపాను కారణంగా నేనూ మిగతా ప్రయాణీకులతో కలసి పోవ డం జరిగింది. ఆ విధమైన తుపానులలో అనుభవం ఉన్నందువల్ల నాకేమీ భయ మనిపించలేదు. నేను మంచి నౌకా ప్రయాణీకుణ్ణి. సముద్రయా నంలో సాధారణంగా ప్రయాణీకులకు చేసే జబ్బు నాకు చేయదు. అందుచేత నిర్భయంగా ప్రయాణీకు లందరితో కలసి మెలసి వారిని ఓదారుస్తూ, ఉత్సాహ పరుస్తూ, సరంగుద్వారా తెలుసుకున్న వర్తమానాలను ఏ గంట కా గంట వారికి అందజేస్తూ వుండేవాడిని. వారితో ఏర్పడిన స్నేహం నాకు ఏ విధంగా ఉపకరించిందీ ముందు ముందు పాఠకులు తెలుసు కుంటారు.

ఓడ డిసెంబరు 18 వ తేదీనో 19 వ తేదీనో డర్బాన్ రేవులో

లంగరువేసింది. "నదేరీ" అనే ఓడ కూడా అదేరోజున చేరింది. అసలు తుపానుకు ఇది అంకురార్పణ.

---

# 17. హింస

ఇరవైమూడురోజుల ప్రవాసానంతరం ఓడలురేవు చేరగలిగినవి. ప్రయాణీకులు ఒకరొకరే దిగి ఒడ్డు చేరుతున్నారు. శ్వేతజాతి వారికి నేనంటే విపరీతమైన ఆగ్రహంగా వున్నదనీ, నా ప్రాణానికే భయపడవలసిన పరిస్థితి ఏర్పడిందనీ, ప్రభుత్వ సభ్యుడు ఎస్కోంబు మా ఓడ సరంగుకు వర్తమానం పంపాడు. అందుచేత, నేనూ, నా భార్య బిడ్డలు కనుచీకటి వేళ ఓడదిగి ఇల్లు చేరడం మంచిదని, పోర్టు సూపర్నెంటు టాటం అనే అతడు మమ్ములను ఇంటివరకూ సాగనంపుతాడనీ కూడా సలహా ఇచ్చాడు. సరంగు నాకు ఆ కబురు అందజేసాడు. ఆ సలహా ప్రకారం నడుచుకోడానికి నేను సమ్మతించాను. ఆ కబురు అంది సరిగా అరగంట అయిందో, లేదో లాటన్ అనే ప్రసిద్ధన్యాయవాది ఓడలోకివచ్చి, సరంగుతో ఇలా అన్నాడు—"ఆయనకు ఏ విధమైన ఆక్షేపణా లేకపోయినట్లయితే, గాంధీని నా వెంట తీసుకు వెళ్ళుతాను. ఏజెంటు కంపెనీ లీగల్ అడ్వాయిజర్‌ను కాబట్టి ఒక విషయం మీతో చెబుతున్నాను. ఎస్కోంబు పంపిన వర్తమానాన్ని గాంధీకి అందజేయవలసిన పూచీ మీ కేమీలేదు." అతడే (లాటనే) వచ్చి నాతో ఇలా చెప్పాడు—"మీరు భయపడక పోయినట్లయితే, నేనొక సలహా ఇస్తాను. మీ భార్యను పిల్లలను కారులో రుస్తుంజీ ఇంటికి పంపండి. మనం ఇద్దరమూ నడిచి వెళ్ళుదాము. మీరు దొంగమాదిరిగా రాత్రిపూట నగరంలో ప్రవేశించడమనే విషయం నాకు ఏమాత్రం మనస్కరించడం

లేను. ఎవరైనా మిమ్ములను కొడతారేమోనని భయపడవలసిన అగత్యం లేదను కుంటాను. పరిస్థితి ఇప్పుడు ప్రశాంతంగానే వున్నది. గుంపులు కూడిన తెల్లవారందరూ ఎవరి దారినవారు వెళ్ళి పోయినారు. ఏది ఎలాగైన ప్పటికీ, మీరు నగరంలో రహస్యంగా ప్రవేశించడం మంచిపని కాదనే నా నమ్మకం." ఈ వాదనతో నేను వెంటనే ఏకీభవించాను. నా భార్య, పిల్లలు కారులో సురక్షితంగా రుస్తోంజీ ఇంటికి వెళ్ళారు. సరంగు అనుమతితో లాటన్, నేను కలసి ఓడదిగి ఒడ్డుకు వెళ్ళాము. రుస్తోంజీ ఇంటికీ, రేవుకూ దాదాపు రెండుమైళ్ళ దూరం.

మేము ఓడదిగి వెళ్ళే వెళ్ళగానే, కొంతమంది యూరపియన్ యువకులు నన్ను గుర్తుపట్టారు. "గాంధీ! గాంధీ!" అని కేకలు వేశారు. అంతట దాదాపు అరడజనుమంది ముందుకు తోసుకువచ్చి అందరూకలసి కేకలువేయ సాగారు. గుంపు ఇంకా పెద్దదవుతుం దేమోనని లాటన్‌కు భయంవేసింది. వెంటనే ఒక రిక్షావాడిని పిలిచాడు. రిక్షాలో అదివర కెన్నడూ నేను కూర్చోలేదు. అది నాకు ఏనాడూ మనస్కరించని విషయం. ఇదేనా తొలిఅనుభవం కాబోతున్న దన్నమాట. ఆ యూరపియన్ యువకులు నన్ను రిక్షాలో ఎక్కనివ్వలేదు. 'ప్రాణంతీస్తాం, జాగ్రత్త!' అన్నట్టుగా రిక్షా కుర్ర వాడిని వాళ్ళు బెదరించారు. అదిచూసి వాడు పారిపోయినాడు. మేము నడిచి వెళ్ళుతున్న కొద్దీ, జనసమూహంకూడా పెరిగిపోవడం మొదలు పెట్టింది. ముందుకు సాగిపోవడం మాకు అసంభవంగా పరిణమించింది. లాటన్‌ను పట్టుకొని, నాకు దూరంగా లాగుకొని పోయినారు. అంతట నాపై రాళ్ళు ఇటుక ముక్కలు, కుళ్ళిపోయిన గుడ్లు రువ్వడం మొదలుపెట్టారు. ఆ గుంపులో ఎవరో నా తలపాగా లాగివేశారు. మరికొందరు వచ్చి నన్ను పెడీ, పెడీ గుద్దడం మొదలుపెట్టారు; తన్నారు. ఆ దెబ్బలకు స్పృహతప్పి పడి పోతూండగా, ఒక ఇంటి ముందువున్న ఇనుప కటకటాలు చేజిక్కి నవి కొంచం ఊపిరి పీలుద్దామని అలాగే నిలుచుని పోయినాను. ఐతే అది

సాగలేదు. అంతలోనే మరొక మూకవచ్చి నాపై ముష్టియుద్ధం చేయడం మొదలుపెట్టింది. దావ చితకకొట్టింది. పోలీసు సూపర్నెంటు, అలెగ్జాండరుగారి భార్య ఆ దారినే పోతూ నన్నుచూసింది. ఆమె నన్నెరుగు. ఆమె ధైర్యంగా ముందుకువచ్చి ఎండలేక పోయినప్పటికీ, గొడుగువిప్పి నాకూ, జనసమూహానికీ మధ్య అడ్డంగా నిలబడింది. ఆమెకు దెబ్బ తగలకుండా నన్ను కొట్టడానికి వారికి అవకాశం లేకపోయింది. ప్రజల ఉద్రేకాన్ని ఆ విధంగా అరి కట్టడమైనది.

ఈ లోపుగా ఈ సంఘటనలను చూసిన ఒకభారతీయ యువకుడు పోలీసు స్టేషనుకు పరుగెత్తుకొని వెళ్లాడు. నన్ను ప్రజల బారినుంచి తప్పించి, సురక్షితంగా ఇల్లు చేర్చవలసిందని పోలీసు సూపర్నెంటు అలెగ్జాండర్ కొంతమంది పోలీసు భటులను పంపించాడు. సకాలంలోనే పోలీస్‌దళం వచ్చింది. పోలీసుస్టేషను మేము వెళ్ళే దారిలోనే వున్నది. అక్కడికి చేరగానే, ఆ సూపర్నెంటు కొంచంసేపు స్టేషనులో తలదాచుకోవలసిందని సలహా ఇచ్చాడు. కృతజ్ఞతతో ఆ సూచనను నిరాకరించాను. "తమ తప్పు తాము తెలుసుకోగానే వారందరూ తప్పక సర్దు మణుగుతారనే నా నమ్మకం. వారిన్యాయబుద్ధి ఎడల నాకు విశ్వాసంవున్నది" అని ఆయనకు సమాధానం చెప్పాను. పోలీసువారు వెంటరాగా ఏ విధమైన అపాయం జరగకుండానే రుస్తోంజీ ఇంటికిచేరాను. నా శరీరమంతా చీలుకపోయింది. ఒక్కచోట తప్ప పెద్ద గాయాలేవీ తగులలేదు. ఓడలో డాక్టర్‌గావున్న దాదిబార్జోర్ అనే ఆయన చేయగలిగిన చికిత్సచేసి సహాయపడ్డాడు.

భవన అంతర్భాగం ప్రశాంతంగానే వున్నది. వెలుపల మాత్రం తెల్లవారు భవనాన్ని ముట్టడించారు. చీకటి పడుతున్నది. ప్రజలు మిన్నుముట్టేటట్లు "గాంధీని మాకు అప్పగించండి," అని కేకలు వేస్తున్నారు. పోలీసు సూపర్నెంటు అప్పటికే అక్కడికివచ్చి గుంపులను అదుపులో పెట్టాలని ప్రయత్నిస్తున్నాడు. ఐతే ఆయన వారిని అదిరింపులతో, బెదిరింపులతో

గాక, లాలనతో, పాలనతో బుజ్జగించాలని చూస్తున్నాడు. ఆయన నన్ను గురించి ఆందోళన చెందక పోవడంలేదు. "మీ మిత్రుడి ఇంటిని, ఆస్తినే గాక, మీ భార్యా పిల్లలను కూడా భద్రంగా కాపాడ దలచుకున్నట్లయితే నా సలహా ప్రకారం మీరు నడుచుకోవాలి. మారువేషం వేసుకొని ఇక్కడి నుంచి మీరు తప్పించుకు పోవాలి" అని సూపర్నెంటు నాకు కబురు పంపించాడు.

ఆయనసూచన ప్రకారం ఇండియన్ కానిస్టేబులు దుస్తులు ధరించాను. తలమీద లోతైన లోహపు డిప్పను పెట్టుకొని, అది కనబడకుండా మద్రాసీఫక్కీలో తలపాగా చుట్టాను. ఇద్దరు సి. ఐ. డీలు నా వెంట వచ్చారు. వీరిలో ఒకడు భారతీయ వ్యాపారస్థుడి వేషం వేశాడు. భారతీయుడిముఖం మాదిరిగా కనబడేటట్లు ముఖానికి రంగు పూసుకున్నాడు. రెండవవాడు ఏ వేషం వేసిందీ మరచిపోయినాను. ఒకచిన్న సందుద్వారా రుస్తోంజీ భవనానికి పక్కనేవున్న దుకాణంలోకి చేరుకున్నాము. అక్కడ గిడ్డంగిలో పేర్చివున్న బస్తాల చాటుగావెళ్లి దుకాణం ద్వారంనుంచి బయటపడ్డాము. ఆ తర్వాత జనసమూహంలోనుంచే మెల్లగావెళ్ళి, వీధి చివర మా కోసం సిద్ధంగా వున్న బండి ఎక్కాము, పోలీసు సూపర్నెంటు అలెగ్జాండర్ నన్ను ఏ స్టేషనులో తలదాచుకోవలసిందని మొదట కోరాడో, ఆ స్టేషనుకే బండిలో వెళ్ళాము. ఇద్దరు సి. ఐ, డీ. ఆఫీసర్లకు. అలెగ్జాండరుకు కూడా నా కృతజ్ఞత తెలియజేశాను.

రుస్తోంజీ ఇంటినుంచి నేను ఆ విధంగా మారువేషంతో పలాయనమవుతున్న సమయంలో అలెగ్జాండర్ ఈ కింది చరణాలు పాడుతూ ప్రజలను నవ్వించడం మొదలు పెట్టాడు—

"ముసలి గాంధిని, పుల్లయాపిల్
చెట్టుపై, ఉరి తీయండోయ్ !"

సురక్షితంగా పోలీసు స్టేషను చేరాననే వర్తమానం తెలిసిన తర్వాత సూపర్నెంటు ప్రజలకు ఇలా తెలియజేశాడు—"మీరు పట్టుకోదలచిన గాంధీ పారిపోయినాడు. ఇక మీరు మీ ఇళ్ళకు పోవచ్చు." ఆ మాటవిన గానే కొందరికి ఆగ్రహం కలిగింది. మరికొందరికి నవ్వువచ్చింది. ఇంకా కొందరు ఆ మాటలు నమ్మలేదు.

"నా మాటలలో నమ్మకం లేకపోతే మీ తరపున ఇద్దరిని పంపించండి. వారికి ఇల్లంతా చూపిస్తాను. గాంధీ వారి కంటబడితే, ఆయనను మీకు, సంతోషంగా, అప్పగించి వేస్తాను. గాంధీ కనబడక పోయి నట్లయితే, మీ దారిన మీరు వెళ్ళిపోవలసి వుంటుంది. రుస్తొంజీ ఇంటిని నాశనంచేయాలనే ఉద్దేశం గాని. గాంధి భార్యా బిడ్డలకు అపాయం కలిగించాలనే ఉద్దేశంగాని మీకు లేదనుకుంటాను!" అన్నాడు అలెగ్జాండర్.

ఇల్లు సోదా చేయడానికి ఇద్దరిని ప్రజలు పంపించారు. ఇల్లువెతికి ఆశాభంగం చెంది వారు తిరిగివచ్చారు. చిట్టచివరకు ఆ వార్తవిని ప్రజ లందరూ వెళ్ళిపోయినారు. సూపర్నెంటు చాకచక్యాన్ని కొంతమంది కొని యాడితే, మరికొందరు చిర్రు బుర్రు లాడి చీదరించుకున్నారు.

కీర్తిశేషుడు ఛేంబర్లేన్ అప్పుడు బ్రిటిష్ వలసరాజ్య శాఖామంత్రి. నాపై దౌర్జన్యంచేసిన వారందరినీ ప్రాసిక్యూట్ చేయవలసిందని ఆయన నెటాల్ ప్రభుత్వాన్ని కోరాడు. ఎస్కొంబు అంతట నన్ను పిలిపించు కొని, నాకు గాయాలు తగిలినందుకు విచారాన్ని తెలియజేశాడు. "మీకు వెంట్రుకవాసి హాని కలగడంకూడా నాకు సమ్మతమైన విషయం కాదు. లాటన్ సలహా ప్రకారం నడుచుకో డానికి మీకు హక్కువున్నది. నేను మొదటయిచ్చిన సూచనకు మీరు సుముఖత చూపినట్లయితే, ఈ సంఘ టనలే జరిగి వుండేవికావు. దౌర్జన్యదార్లను మీరు గుర్తుపట్టగలిగి నట్ల యితే, వారిని అరెస్టు చేయడానికి తయారుగా వున్నాను. వలసరాజ్య శాఖా

మంత్రి ఛేంబర్లేన్ కూడా నాకు ఇదేసలహా ఇచ్చారు" అన్నాడు, ఎస్కోంబ్.

"ఎవరినీ ప్రాసిక్యూట్ చేయవద్దని నా కోరిక. ఒకరిద్దరిని నేను బహుశా గుర్తుపట్టగల ననుకుంటాను. వారిని శిక్షించడంవల్ల వచ్చే ప్రయోజనమేమున్నది? పైగా, ఈ దొమ్మీదార్లను నేను నేరస్థులుగా ఎంచడంలేదు. నెటాల్‌లో శ్వేతజాతివారిని గురించి నేను గోరంతలు కొండంతలుగా చూపిస్తూ ఏవేవో ప్రకటనలు చేశాననీ, వారిని దూషించాననీ వినివుంటారు. ఈ వార్తలను నమ్మి వున్నట్లయితే, వీరికి ఆగ్రహం కలగడంలో ఆశ్చర్యమేమీలేదు. మీరు అనుమతించినట్లయితే, ఒకమాట మాత్రం చెప్పగలను. నాయకులైన మీరే ఈ అల్లరికి బాధ్యులు. ప్రజలను సక్రమమైన దారిలో మీరు పెట్టవలసింది. రాయిటర్ ఏజెన్సీ పంపిన వార్తలను నమ్మి, నే నేవేవో అతిశయోక్తులు చెప్పినట్లు వీరు భావించి వుంటారు. ఎవరిపైనా కేసు పెట్టకూడదనే నా అభిమతం. నిజం బయట పడినప్పుడు తమ ప్రవర్తనకు తామే తప్పక విచారపడతారని నా నమ్మకం" అన్నాను.

"ఈ విషయాన్నే వ్రాతమూలకంగా ఇస్తారా?" అన్నాడు. "ఛేంబర్లేన్‌కు ఈ విషయం తెలియచేయవలసి వుంటుంది. త్వరపడి మీరు ఎట్టి ప్రకటననూ చేయవలసిన అగత్యంలేదు. అవసరమైతే, లాటన్ సలహాను, మిగతా మిత్రుల సలహాను తీసుకోండి. ఆ సలహా పొందినతర్వాతనే, మీరు తుది నిర్ణయానికి రావచ్చు. దొమ్మీదార్లపై కేసుపెట్టే హక్కును వదులుకున్నట్లయితే, మీరు మీ ప్రతిష్ఠను పెంపొందజేసుకోవడమేగాక, భద్రత నెలకొల్పే విషయంలో నాకు విశేషంగా సహాయపడినవారవుతారు," అనికూడా తెలియజేశాడు.

"మీ సలహాకు కృతజ్ఞుడిని. ఎవరితోను ఆలోచించవలసిన పని లేదు. మీ వద్దకు రాకపూర్వమే ఈ విషయంలో ఒక నిర్ణయం చేసుకు

న్నాను. దొమ్మిదార్లపై కేసు పెట్టకూడదన్నదే నా నిశ్చితాభిప్రాయం. ఆ మాట ఈ క్షణంలోనే వ్రాసి ఇవ్వడానికి తయారుగా వున్నాను" అని బదులు చెప్పాను.

ఈ మాటలు అంటూనే, కాగితంమీద వ్రాసి ఇచ్చాను.

అలాగే పోలీసు స్టేషనులో వుండిపోయినాను. రెండురోజులైన తర్వాత, నన్ను ఎస్కోర్టుంట్ వద్దకు తీసుకు వెళ్ళారు. అనవసరమే అయి నప్పటికీ, అంగరక్షకులుగా నావెంట ఇద్దరు పోలీసులు వచ్చారు.

ఓడ దిగిన రోజునే, 'నెటాల్ అడ్వర్టయిజర్' పత్రిక ప్రతినిధి నన్ను 'ఇంటర్వ్యూ' చేయడానికి వచ్చారు. అతగాడు నన్ను అనేక ప్రశ్నలు వేశాడు. నాపై ఇతరులు చేసిన ఆరోపణలన్నిటినీ అతడికి ఇచ్చిన సమాధానాలలో ఖండించి వేశాను. భారతదేశంలో ఇచ్చిన ప్రతి ఉపన్యాసమూ నేను వ్రాసి చదివినదే. ఇందుకు సర్ ఫిరోజిషా మెహతాకు నా కృతజ్ఞత తెలియజేయక తప్పదు. ఆ ఉపన్యాసాల కాపీలు, నా ఇతర రచనలు అన్నీ నావద్ద వున్నవి. దక్షిణాఫ్రికాలో పటుతరమైన భాషలో చెప్పని ఏ ఒక్క విషయాన్నీ భారతదేశంలో చెప్పివుండలేదని నిరూపిస్తూ, ఆ విలేఖరికి కాపీలన్నీ ఇచ్చివేశాను. "కోర్లెండ్" "నదేరీ" ఓడలలో భారతీయులు వచ్చారంటే, అందుకు నేనేవిధంగానూ బాధ్యుడిని కానని స్పష్టపరిచాను. ఆ ప్రయాణీకులలో చాలామంది దక్షిణాఫ్రికాలో పాత నివాసులేననీ, నెటాల్‌లో వుండడానికి రాలేదనీ, ట్రాన్స్‌వాల్ వెళ్లుతున్నారనీకూడా చెప్పాను. ఆ రోజులలో నెటాల్‌లోకంటే ట్రాన్స్‌వాల్‌లోనే జీవితం లాభసాటిగా వుండేది. కాబట్టి, వారు అక్కడికే వెళ్ళుతున్నారని స్పష్టీకరించాను.

దొమ్మిదార్లను ప్రాసిక్యూట్ చేయించడానికి నిరాకరించడం, ఈ ఇంటర్వ్యూ పత్రికలో అచ్చుకావడం, డర్బాన్‌లోని యూరపియనులపై దివ్యంగా పనిచేసినవి. తమ ప్రవర్తనకు తామే (యూరపియనులు)

సిగ్గుపడ్డారు. నేను నిర్దోషినని పత్రికలు ప్రకటించినవి. అల్లరిమూకల చర్యలను ఖండించినవి. నన్ను వాళ్ళుపెట్టిన హింస చివరకు నాకు—అంటే నా ఉద్యమానికి—వరప్రసాదంగా పరిణమించింది. దక్షిణాఫ్రికాలో భారతీయుల ప్రతిష్ఠను పెంపొందజేసింది. తద్వారా నా కార్యక్రమం సులభ సాధ్యమైంది. నా ఈ అనుభవం సత్యాగ్రహాచరణకు దోహదమిచ్చింది.

మూడు, నాల్గు రోజులైన తర్వాత నేనుండే ఇంటికి చేరుకున్నాను. తిరిగి కాలూని నిలవడానికి ఎంతోకాలం పట్టలేదు.

---

# 18. నాకు నేనే చాకలిని

సౌఖ్యంగాను, హాయిగాను జీవయాత్ర చేయడం ప్రారంభించాను. ఐతే, ఇది అట్టే కాలం సాగలేదు. సౌఖ్యప్రదమైన జీవయాత్రకు అవసరమైన ఏర్పాట్లన్నీ ఇంట్లో చేసుకున్నాను. కాని, ఆ సౌకర్యాలన్నీ నన్ను లోబరుచుకోలేక పోయినవి. ఖర్చులన్నీ తగ్గించి వేయాలనే బుద్ధి పుట్టింది. చాకలివాడి 'బిల్లు' మితిమీరి పోవడం మొదలుపెట్టింది. అంత డబ్బు చెల్లించినప్పటికీ, ఆ చాకలి అనుకున్న రోజుకు గుడ్డలు ఇచ్చేవాడుకాడు. రెండు మూడు డజనుల చొక్కాలు, కాలర్లు వున్నా చాలేవి కావు. ఏరోజు కారోజు కాలరు మార్చవలసి వచ్చేది. చొక్కామాత్రం ప్రతిరోజూ గాకపోయినప్పటికీ, కనీసం రోజుమార్చి రోజైనా మార్చక తప్పేదికాదు. ఈ కారణాలవల్ల ఇబ్బడి ఖర్చు భరించవలసి వస్తుండేది. అంత ఖర్చు పెట్టడం అనవసరంగా కనబడింది. చాకలికి ఇచ్చే డబ్బు మిగిలేటట్లు చేద్దామని చాకలి పనిముట్లు ఏర్పాటుచేసుకున్నాను. గుడ్డలు

ఏవిధంగా ఉతికేదీ, ఏవిధంగా ఇస్త్రీ చేసేదీ తెలుసుకోడానికి ఒక పుస్తకం కొన్నాను. ఆ కళను అభ్యసించడమేగాక, నా భార్యకుకూడా నేర్పాను. ఇందువల్ల నాకు పని ఎక్కువైన మాట నిజమే. కొత్త కాబట్టి, అదీ ఒక వింతగానే వుండేది.

నేను స్వయంగా మొట్టమొదట గంజిపెట్టి ఇస్త్రీచేసిన 'కాలరు' గాథను ఎన్నటికీ మరువలేను. గంజి విపరీతంగా ఉపయోగించాను. ఇస్త్రీ పెట్టెలో తగినన్ని బొగ్గులు పోయలేదు. కాలరు ఎక్కడ తగులబడి పోతుందోనని భయపడి, ఆ పెట్టెతో కాలరుమీద అదిమి రుద్దనుకూడా రుద్దలేదు. 'కాలర్' బాగా బిర్రబిగిసిందిగాని, గంజి ఎక్కువైన కారణం చేత దానిచుట్టూ విస్తారంగా దుమ్ము పడడం మొదలుపెట్టింది. ఆ 'కాలర్' వేసుకొని కోర్టుకు వెళ్ళాను. తోటి బారిష్టరుల పరిహాసానికి పాత్రుడ నైనాను. ఇతరులు పరిహసించినప్పటికీ, ఆరోజులలోనూ, లెక్కచేసే వాడిని కాను.

"నా కాలర్లు నేనే ఉతుక్కోవడంలో ఇదే నా ప్రథమ ప్రయత్నం. అందువల్లనే కాలర్‌నిండా ఇలా గంజి నిలిచిపోయింది. అయినా ఏమీ ఫరవాలేదు. నన్ను మీరు వేళాకోళం చేయడానికి అవకాశం ఇందువల్లనైనా దొరికిందికదా! అదే చాలు." అని బదులు చెప్పాను.

"సరే, నీవుచెప్పేది బాగానేవుంది. ఇక్కడ 'లాండ్రీ'ల కరువు రాలేదుకదా!" అన్నాడు ఒక మిత్రుడు.

"లాండ్రీ బిల్లు విపరీతంగా పెరిగిపోతున్నది. ఒక్కొక కాలరు ఇస్త్రీచేసి ఇవ్వాలంటే, లాండ్రీవాడు దాదాపు దానిధర అంతఛార్జీ ఇవ్వమంటున్నాడయ్యో! పైగా, అంత డబ్బూ చెల్లించినప్పటికీ, చాకలివాడి దయాధర్మంపై ఆధారపడి వుండవలసి వస్తున్నది. అందువల్ల నా గుడ్డలు నేనే ఉతుకుకోవడం మంచిదని తోచింది," అన్నాను.

ఇంత కంఠ శోషపడినప్పటికీ, స్వయం సహాయంలోవున్న సొగ

సును మిత్రులు గమనించేటట్లు చెయ్యలేకపోయినాను. రోజులు గడిచిన కొద్దీ, చాకలిపనిలో కాకలుతీరినవాడి నైనాను. నా గుడ్డలు నేనే ఉతుక్కున్నప్పటికీ, 'లాండ్రీ'లో ఉతికినవాటికి ఏవిధంగానూ తీసిపోయేవి కావు. మిగతా అన్ని కాలర్లమాదిరిగానే, నా కాలర్లూ బిగువుగా థళ థళ లాడుతుండేవి.

---

# 19. స్ఫురణ : పశ్చాత్తాపము

డర్బాన్‌లోనూ, జోహెనెస్ బర్గ్‌లోనూ వున్నప్పుడు స్నేహితులు, అప్పుడప్పుడు ఆఫీసు గుమాస్తాలు, మా ఇంటిలో మాతోపాటే వుంటూం దేవాళ్ళు. బంధువులనీ—తదితరులనీగాని, స్వదేశీయులనీ—విదేశీయులనీ గాని, తెల్లవారనీ—నల్లవారనీగాని నాకు ఏనాడూ భేదభావం వుండేదికాదని వాస్తవం చెబుతున్నాను. అది నాలో ఒక ప్రత్యేక సుగుణమని చెప్పుకోవడంలేదు. అది నా స్వభావంలో ఒకభాగమే అయింది. డర్బాన్‌లో ప్రాక్టీసు చేస్తుండగా ఆఫీసు గుమాస్తాలు చాలామంది మాతోపాటు మా ఇంట్లోనే వుంటుండేవాళ్ళు. వీళ్ళలో ఒక క్రిష్టియన్ వుండేవాడు. ఇతడి తల్లిదండ్రులు 'అస్పృశ్యులు.' పాత్రలు శుభ్రంచేయడం మొదలైన పనులన్నిటినీ ఇంట్లోవున్నవాళ్ళే చూస్తుండేవాళ్ళు. ఈ క్రిష్టియన్ గుమాస్తా కొత్తగావచ్చి చేరాడు కాబట్టి, అతడి సౌకర్యాలు ఏర్పాటుచేయవలసిన బాధ్యత మాపై పడింది. మిగతా అందరి అవసరాల విషయంలోనూ నా భార్య శ్రద్ధవహించి వెంటనే పనిచేసేది. కాని, 'అస్పృశ్యుల' విషయంలో మాత్రం ఆమె తన దురభిప్రాయాన్ని వదలలేక పోయింది. కొత్తగా

వచ్చిన క్రిష్టియన్ కుర్రవాడికి గది ఏర్పాటుచేయడంలో అయిష్టత కన బరిచింది. ఒకసారి ముఖంలో చిరాకుపైతం చూశాను. ఆమె తన విధ్యుక్త ధర్మాన్ని అంత అయిష్టంగా చేయడం నాకు అసంతృప్తి కలి గించింది. భార్యపై నాకు ఆపేక్ష, దయా లేకపోలేదు. ఐతే, ఆ ఆపేక్షలో క్రూరత్వంకూడా వుండేది. నా మనోదార్ఢ్యతను ఉపయోగించి, నేను చెప్పిన పనిని ఆమెచేత ఉత్సాహంతో చేయించడం అవసరమనుకున్నాను. ఏపనినీ నిర్బంధంవల్ల ఎవరిచేతా ఉత్సాహంతో చేయించలేమనే అంశం నాకు ఆ ఆగ్రహంలో తోచలేదు. "ఈ ఆటలు నా ఇంట్లో సాగనివ్వను," అని గట్టిగా అరిచాను.

"ఐతే, మీ ఇంటిసంగతి మీరే చూసుకోండి." అని ఆమెకూడా బిగ్గరగానే సమాధానం చెప్పింది. అంతట నా ఒళ్ళు నాకు తెలియలేదు. ఆమె చెయ్యి పట్టుకున్నాను. గుమ్మంవద్దకు గబగబా లాగుకొని వెళ్ళాను. ఆమెను బయటికి గెంటివేదామని తలుపు తెరవబోయినాను. ఆమె చెక్కిళ్ళ వెంట బొట బొట కన్నీళ్ళు కారుతున్నవి.

"ఇది పరువు, ఇది బేపరువు అనే యుక్తాయుక్త విచక్షణ పోయిందా ? ఇంత ఒళ్లు తెలియని శివమెందుకు ? నే నెక్కడికి పోగలను? తల దాచుకోడానికైనా నీడ ఇచ్చేవాళ్లు ఇక్కడ నాకెవరూ లేరుకదా? నేను మీ భార్యను కాబట్టి, మీ మోచేతిపోట్లూ, మోకాలి తన్నులు తింటూ పడి వుండాలనేనా మీ ఉద్దేశం ? సవ్యంగా ప్రవర్తించడం మంచిది. భాగోతంతో వీధికెక్కడంకూడా ఎందుకు, తలుపు తెరవకండి" అన్నది.

ముఖంలో గంభీరభావాన్ని కనబరుస్తున్నానేగాని, ఆ మాటలు విన్నమీదట నా పనికి నాకే సిగ్గువేసింది. నా భార్య నన్ను వదలిపెట్టలేక పోతే, నేనుమాత్రం నా భార్యను వదిలిపెట్టగలనా ? ఈవిధంగా మా ఇద్దరి మధ్యా అనేకసార్లు కజ్జాలు వచ్చినవి. ప్రతిసారీ పర్యవసానంగా ఉభయు లం శాంతించేవాళ్ళము. ఒకరి నొకరం మరీ గాఢంగా అవగాహన చేసుకో

డానికి వీలైంది. అసమాన సహనశక్తితో ప్రతిసారీ నా భార్యే నన్ను జయించేది. అప్పటివరకు. వ్యామోహాంధకారంలో పడివున్న భర్తగా నేను ప్రవర్తించాను. అంతటితో మారిపోయినాను. నేను చెప్పినట్లల్లా ఆమె వినాలనే నా వైఖరి మారిపోయింది. ఉభయులం ఆప్తమిత్రులుగా తయారైనాము. కేవలం కామతృష్ణ తీర్చుకునే ఉపకరణాలుగా ఒకరి నొకరం భావించడం మానివేశాము. నాకు జబ్బుగా వున్నన్నిరోజులూ అత్యంత భక్తితో నర్సువలె సపర్యచేసింది. కృతజ్ఞతా పూర్వక అభివందనలనైనా ఆమె నావద్ద ఆశించలేదు. నేను తలపెట్టిన ప్రతి ప్రముఖ కార్యక్రమంలోనూ ఉత్తమ సహధర్మచారిణివలె సంపూర్ణ స్వార్థత్యాగంతో ఆమె నన్ను అనుసరించింది.

---

# 20. బోయెర్ యుద్ధానుభవాలు

1897—1899 సంవత్సరాలమధ్య జరిగిన అనేక విషయాలను వదలివేస్తున్నాను. బోయెర్ యుద్ధానుభవాలను ఇక్కడ పేర్కొంటాను.

యుద్ధం ప్రకటించగానే, నా వ్యక్తిగత సానుభూతి అంతా బోయెర్ తెగ వారివైపుకే మొగ్గింది. కాని, అల్లాంటి పరిస్థితులలో నా వ్యక్తిగత భావాలను ఆచరణలో పెట్టడానికి నాకేమి హక్కులేదని ఆనాడు అభిప్రాయ పడ్డాను. బోయెర్ యుద్ధం విషయంలో నా అంతర్మథనను 'దక్షిణాఫ్రికా సత్యాగ్రహోద్యమ చరిత్ర' అనే గ్రంథంలో విపులంగా చర్చించాను. తెలుసుకోవాలనే కుతూహలం గలవారు దాన్ని చదువవచ్చు. బ్రిటిష్ పరిపాలన ఎడల నాకువున్న భక్తికారణంగానే, ఆ యుద్ధంలో

బ్రిటిష్‌వారి సరసన పాల్గొన్నాను. నా హక్కులు నాకు ఇవ్వవలసిందని బ్రిటిష్ పౌరుడుగా పోరుతున్నాను. కాబట్టి బ్రిటిష్ సామ్రాజ్య రక్షణలో పాల్గొనడం విద్యుక్త ధర్మమని తోచింది. బ్రిటిష్ సామ్రాజ్యంలోవుండే, బ్రిటిష్ సామ్రాజ్యం ద్వారానే భారతదేశం తన సంపూర్ణ విమోచనను సాధించగలదని అప్పటిలో అభిప్రాయపడుతుండేవాడిని. బ్రిటిష్‌వారి సహాయార్థం సాధ్యమైనంతమంది సహచరులను సమీకరించాను. బ్రహ్మ ప్రళయంమీద వారి సేవను 'అంబులెన్స్ దళం' సేవగా పరిగణించేటట్లు చేయగలిగాను.

భారతీయుడు వట్టి పిరికివాడనీ, జీవితంలో ఏ విధమైన ప్రమాదాలనూ ఎదుర్కొనే తాహతు లేనివాడనీ, స్వార్థప్రయోజనాన్ని మించి అతడి చూపు పైకిపోదనీ సాధారణంగా ఆంగ్లేయులు మనలను గురించి అభిప్రాయపడుతుండేవాళ్ళు. అనేకమంది ఆంగ్ల మిత్రులు నన్ను నిరుత్సాహపరిచారు. కాని డాక్టర్ బూత్ అనేఅతడు కూడా మాలోచేరాడు. ఈ సేవాదళం బాగా పనిచేసి, మాట దక్కించింది. మా దళంలో మొత్తం 1,100 మంది వున్నారు. నాయకులు 40 మందివున్నారు. వీరిలో 300 భారతీయులు స్వతంత్రులు. తక్కినవారు 'కూలీలు.' మేము యుద్ధభూమికి వెలుపలే వుండి పనిచేయాలనే నియమంవున్నది. మాకు రెడ్‌క్రాస్ వారి రక్షణ కూడా లేకపోలేదు. ఒకానొక క్లిష్ట సమయంలో యుద్ధభూమిలోకే వెళ్ళి పనిచేయవలసిందని మా దళాన్ని కోరారు. యుద్ధభూమి వెలుపలే పనిచేయాలనే షరతు మాకై మేము కోరిపెట్టుకున్నది కాదు. తుపాకి గుండ్లు పడే ప్రాంతంలోకి వెళ్ళ నవసరంలేదని అధికార్లే చెప్పారు. స్పియాన్ కాప్ వద్ద చేకూరిన పరాజయంతో పరిస్థితి మారిపోయింది. ప్రమాద ప్రాంతానికి వెళ్ళ వలెననే నిర్బంధం లేకపోయినప్పటికీ, యుద్ధభూమిలో గాయపడిన వారిని సురక్షిత స్థలాలకు చేర వేయడానికి ఇష్టపడి వట్లయితే ప్రభుత్వం కృతజ్ఞత తెలుపుతుందని జనరల్ బుల్లర్ మాకు

కబురు చేశారు. మేము అందుకు సంకోచించలేదు. ప్రత్యక్షంగా యుద్ధ భూమిలోనే పనిచేయడం ప్రారంభించాము. గాయపడిన వారిని స్ట్రెచర్ల మీద వేసుకొని ఇరవై, ఇరవై అయిదు మైళ్ళు మోసుకు పోవలసి వచ్చేది. జనరల్ వుడ్‌గేట్ మొదలైన ప్రముఖ సైనికులను సైతం స్ట్రెచర్లపై మోశాము.

ఆరు వారాలు పనిచేసిన తర్వాత మా సేవా దళాన్ని రద్దుచేశారు. ఉడుతా భక్తిగా మేముచేసిన సేవను అందరూ ఎంతో ప్రశంసించారు. భారతీయుల ప్రతిష్ఠ హెచ్చింది. "ఎంతచెడినా సామ్రాజ్య పుత్రులుగదా!" అని వార్తాపత్రికలు భారతీయులను గురించి శ్లాఘిస్తూ వ్రాసినవి.

కఠిన పరీక్షా సమయాలలో మానవ స్వభావం ఎంత ఉదాత్తపరిణితిని పొందేదీ తెలియజేసే ఒక ఉదంతాన్ని ఇక్కడ స్మరించకుండా వుండలేక పోతున్నాను. కోలెన్సో సమీపంలోని చీవ్లీ శిబిరం దిశగా మేము తరలిపోతున్నాము. లార్డ్ రాబర్ట్స్ కుమారుడు లెఫ్టినెంట్ రాబర్ట్స్ గాయపడి మరణించాడు. అతడి కళేబరం ఆ శిబిరంలోవున్నది. దాన్ని యుద్ధరంగంనుంచి చేరవేసే గౌరవం మా సేవాదళానికి లభ్యమైంది. మేము బయలుదేరిన రోజున చాలా ఉడకపోత పోస్తున్నది. ప్రతివారికీ దాహం విపరీతంగా వేయడం మొదలుపెట్టింది. దాహం తీర్చుకోడానికి మార్గమధ్యంలో చిన్న చలమ ఒకటి కనిపించింది. దానిలో వున్న కొంచెం నీటిని ఎవరు ముందుతాగడం? మా వెంటవున్న సైనికులు ముందుతాగితే, తర్వాత మేము తాగుతా మన్నాము. వారు ముందు తాగడానికి ఒప్పుకోలేదు. మమ్మలనే తాగవలసిందని పట్టుపట్టారు. ఈ విధంగా కొంచంసేపు కులాసాగా మీరు ముందంటే, మీరు ముందనుకున్నాము.

ఈ అధ్యాయాన్ని ముగించక పూర్వమే మరొక ఉదంతాన్నికూడా చెబుతాను. లేడీస్మిత్ అనే పట్టణంపై బోయెర్లు ముట్టడి ప్రారంభించారు. దానిలో ఆంగ్లేయులే గాక, అక్కడక్కడ కొంతమంది భారతీయులు

కూడా వున్నారు. ఈ భారతీయులలో కొంతమంది వ్యాపారస్థులు. మిగతావారు రైలు మార్గాలలోను, యూరపియనుల వద్దను కుదురుకున్న కార్మికులు. వీరిలో ప్రభూసింగ్ అనే అతడు ఒకడు. అతడు ఒక 'కూలీ.' లేడీస్మిత్ పట్టణాన్ని రక్షిస్తున్న మిలిటరీ ఉద్యోగి ఆ పట్టణంలోవున్న ప్రతిపౌరుడూ కొన్నివిధులను నిర్వర్తించాలని ఆజ్ఞాపించాడు. ప్రభూ సింగ్‌పైన అతిప్రమాద కరమైన, అత్యంత బాధ్యతాయుతమైన భారం పడింది. లేడీస్మిత్ పట్టణ సమీపంలోని ఒక కొండపై బోయెర్లు ఫిరంగులు అమర్చుకున్నారు. ఈ ఫిరంగి కాల్పుల ఫలితంగా పట్టణంలో చాలా భవనాలు ధ్వంసమైనవి. కొంతమందికి ప్రాణాపాయం సైతం సంభవించింది. కొండపైనుంచి ఫిరంగి కాలిస్తే గుండు వూరిమీద పడడానికి ఒకటి రెండు నిమిషాలు పడుతుంది. ముట్టడిలోవున్న ప్రజలకు ముందుగా హెచ్చరిక చేసినట్లయితే, గుండు పడేలోపుగానే వారు ఆశ్రయం పొంది, అపాయంనుంచి తప్పించుకోడానికి వీలవుతుంది. ఫిరంగి కాల్పులు జరిగినంతసేపూ ప్రభూసింగ్ ఒకచెట్టుపైకెక్కి, ఆ కొండవైపే జాగ్రత్తగా చూస్తూ, ఫిరంగి కాల్చినట్లు కనుపించినవెంటనే ఒకగంట కొట్టడం మొదలుపెట్టాడు. ఆ గంట మోతవిని ప్రజలు వెంటనే ఆశ్రయంపొంది ఫిరంగి గుండ్ల బారినుంచి తప్పించుకున్నారు. ప్రభూసింగ్ గంటకొట్టడమే, ఫిరంగిగుండు పడుతున్నట్లు గుర్తు.

ప్రభూసింగ్ ధైర్యసాహసాలను ఇండియా వైస్రాయి లార్డ్ కర్జన్ సైతంవిని, అతడికి కాశ్మీర దుస్తులను బహుమతిగా పంపించాడు.

# 21. స్వదేశాగమనం—తిరిగి ప్రయాణం

యుద్ధపు బాధ్యతనుంచి విరమించగానే, నేను చేయవలసిన పని దక్షిణాఫ్రికాలో కంటే భారతదేశంలోనే ఎక్కువగా వున్నట్లు భావించాను. స్వదేశం వెళ్ళడానికి అనుమతి ఇవ్వవలసిందని సహచరులను కోరాను. సంవత్సరంలోపల ఏదైనా అవసరం ఏర్పడినట్లయితే, తిరిగి దక్షిణాఫ్రికా రావడానికి సిద్ధంగా వుండేపక్షంలో స్వదేశం వెళ్ళవచ్చునన్నారు. ఎంతో ఆప్యాయంగా, ఉత్సాహంగా వీడ్కోలు సభ ఏర్పాటుచేసి, గౌరవించారు. వెండి—బంగారు వస్తువులను, వజ్రాలను బహూకరించారు ధర్మకర్తృత్వంవిషయంలో అవి నా కొక గుణపాఠాన్ని నేర్పినవి. వాటన్నిటినీ దగ్గరబెట్టుకొని ఒక రాత్రిఅంతా నిద్రపట్టక బాధపడ్డాను. దక్షిణాఫ్రికాలోని భారతీయుల సహాయంకోసం ఒకనిధిగా వుంచవలసిందని కోరుతూ వాటిని తిరిగి ఇచ్చివేయాలని నిర్ణయించుకున్నాను. ఆ నిర్ణయం ప్రకారమే నడుచుకున్నాను. అవన్నీ ఇచ్చివేసినందుకు నా భార్యకు కడుపు మంట లేక పోలేదు. కాని, కొన్ని సంవత్సరాలు గడిచిన తర్వాత ఆ నాటి నా నిర్ణయం ఎంత సబబైనదో నా భార్యకూడా గ్రహించగలిగింది. ప్రజాసేవకుడైన వాడెవడూ ప్రజలవద్ద బహుమతులు స్వీకరించ రాదనే అభిప్రాయం నాలో క్రమేపీ బలవత్తరమైంది.

నేను స్వదేశం చేరేసరికి, ఆ సంవత్సరం కాంగ్రెస్ మహాసభ కలకత్తాలో జరుగుతున్నది. ప్రజాసేవకు ఆ మహాసభ నాకు మహదవకాశాన్ని చేకూర్చింది. వీధులు ఊడవడంలోను, పాకీదొడ్లు శుభ్రపరచటంలోనూ, వాలంటీర్లకు స్వయంగా కొన్నిపాఠాలు ఇవ్వగలిగాను. కాంగ్రెస్ మహాసభ ప్రధానకార్య దర్శులలో ఒకడైన శ్రీ ఘోషాల్‌గారి కింద గుమాస్తాగా పనిచేసే గౌరవం కూడా లభ్యమైంది. దక్షిణాఫ్రికా

భారతీయుల విషయమై మహాసభలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించే అదృష్టంకూడా పట్టింది. ఇందుకు గోపాలకృష్ణ గోఖ్లేకు సర్వదా కృతజ్ఞుడివి. స్వదేశానికి తిరిగి వచ్చినప్పటినుంచీ ఆయన నన్ను తనతమ్ముడివలె ఆదరించాడు. నా కార్య కలాపాలన్నిటిలో ఆయన విశేష శ్రద్ధతీసుకునేవాడు. ఏ ప్రముఖులతో పరిచయం అవసరమో వారందరికీ నన్ను ఎరుక పరిచాడు. ఆయన పనిచేస్తుండగా చూస్తే, అపరిమిత సంతోషం కలిగేది. ఆ దృశ్యం ప్రబోధాత్మకంగా వుండేది. ఆయన ఏమిచేసినప్పటికీ, దేశక్షేమాన్ని కాంక్షించే చేసేవాడు. నేను బొంబాయిలోనే వుండి, బారిస్టర్‌గా ప్రాక్టీసు చేయడం అవసరమనీ, తాను సాగిస్తున్న కాంగ్రెస్ కార్య కలాపాలలో తనకు సహాయపడాలనీ గోఖ్లే నన్ను కోరాడు. ఆయన సలహా నాకు బాగానచ్చింది. కాని, నేనుబారిస్టర్‌గా రాణించగలనా? అనే అధైర్యం కలిగింది. అందువల్ల రాజకోటలో న్యాయవాద వృత్తి ప్రారంభించాను. బాగానే సాగుతున్నది. నేను ఇంగ్లండువెళ్ళి విద్య నభ్యసించడానికి ముఖ్య కారకుడు శ్రీకేవలరామ్ దావే. ఇతడు నా మిత్రుడు; నా శ్రేయోభిలాషి. బొంబాయిలో ప్రాక్టీసు పెట్టవలసిందని ఇతడు నన్ను ఉద్బోధించాడు. అనుకున్నదానికంటే మిన్నగానే బొంబాయిలో బారిస్టర్ వృత్తిలో రాణించాను. దక్షిణాఫ్రికాలో నా కున్న క్లయింట్లందరూ తరుచు నా చేతఏదో పని చేయించుకొని డబ్బు పంపుతుండేవాళ్ళు. జీవయాత్రకు ఆ డబ్బు సరిపోయేది. ఏదోవిధంగా వృత్తిలో కాలు తొక్కి విలవ గలుగుతున్నానను కుంటున్న రోజులలో దక్షిణాఫ్రికాకు బయలుదేరి రావలసిందని అర్జంటు కేబుల్ వార్త ఒకటి వచ్చింది. లోగడచేసిన వాగ్దానం ప్రకారం తక్షణమే బయలుదేరి వెళ్ళాను.

అనాటి దక్షిణాఫ్రికా రాజకీయ పరిస్థితికి సంబంధించిన బాధాకరమైన వివరాలన్నిటినీ ఇక్కడ పాఠకుడికి ఏకరువు బెట్టబోవడంలేదు. యుద్ధాన్నీ, యుద్ధంలో భారతీయులు చేసిన సహాయాన్నీ అధికార్లు మరచి పోయినారు.

అక్కడ భారతీయ నివాసుల స్థితి మరీ అధ్వాన్నంగా పరిణమించింది. వారికి అంతులేకుండా కొత్తచిక్కులు తెచ్చిపెట్టారు. అక్కడి భారతీయులకు సహాయ పడాలంటే, చాలాకాలం పాటు దక్షిణాఫ్రికాలోనే వుండిపోవడం అవసర మనిపించింది. జోహెన్స్ బర్గ్‌లోనే ఆఫీసు పెట్టుకుందామని నిర్ణయించుకున్నాను. నగరంలో న్యాయవాదులు నివసించే ప్రాంతంలో కష్టంమీద గదులు సాధించాను.

స్వజాతీయుల సేవకే జీవితాన్ని పూర్తిగా అంకితం చేద్దామనే స్థిర సంకల్పంతో వున్ననాకు భగవద్గీత పునః పారాయణంతో ఆత్మజిజ్ఞాస ఎక్కువైంది.

ఈ సారికూడా కొంతమంది దివ్యజ్ఞాన సామాజికులతో కలసి గీతను పారాయణచేయడం సంభవించింది. గతసారికంటే ఎక్కువ భక్తితో పఠించాను. కొన్నిశ్లోకాలను ముఖస్తంచేసుకోవాలని కూడా ప్రయత్నించాను. పదమూడు అధ్యాయాలకు తక్కువ గాకుండా కంఠతః నేర్చుకున్నట్లు జ్ఞాపకం. భగవద్గీత నాకు అమోఘ మార్గదర్శిగా పరిణమించింది. సందేహ నివారణకు అదేనాకు పరమ నిఘంటువైంది. "అపరిగ్రహ, సమభావ" అనే ఉదాత్తపదాలు నా హృదయాన్ని కైవశం చేసుకున్నవి. సమభావాచరణను సాధించడం ఎలా? అన్నసమస్యలో నేను నిమగ్నుడనైనాను. సర్వస్వాన్నీ త్యజించి భగవంతుడిని అనుసరించడమేనా? ఈ ప్రశ్నకు సూటిగా సమాధానం దొరికింది. సర్వ పరిత్యాగం చేస్తేనేదప్ప, దేవుడిని అనుసరించడం సంభవంకాదని తోచింది. దృక్పథ పరివర్తనం, హృదయ పరివర్తనం వస్తేనేతప్ప సర్వపరిత్యాగం, సమభావ సాధన సంభవంకావని స్పష్టపడింది. "నా ఇన్స్యూరెన్సుపాలిసీ"ని కాలదోషం పట్ట నివ్వవలసిందని బొంబాయిలో వున్న మిత్రులకు వ్రాశాను. అప్పటివరకూ నిల్వచేసిన డబ్బుఅంతా తనకేఇచ్చివేశానని, ఇకమీద నేనేమీ పంపగలనని అనుకో వద్దనీ, ఇక ఏ మాత్రం ఆదాచేరినప్పటికీ ఆ డబ్బు

అంతా స్వజాతీయుల క్షేమం నిమిత్తం ఉపయోగించవల సవుతుందనీ మా సోదరుడికి ఒక ఉత్తరం వ్రాశాను.

అదే సమయంలో "ఇండియన్ ఒపినియన్" అనే వారపత్రికకు సంపాదకత్వ బాధ్యతను స్వీకరించాను. అది దక్షిణాఫ్రికా భారతీయుల క్షేమ సమస్యలకు సంబంధించిన పత్రిక. నా ఆర్థిక సహాయం వుంటేనే గాని ఆ పత్రిక నడిచే అవకాశం లేదని త్వరలోనే తెలుసుకున్నాను. భుక్తికి పోను నాకు మిగిలేడబ్బు ఆ పత్రికమీద పెడుతూ వచ్చాను ఇంచు మించు మిగిలేడబ్బుఅంతా దానికే వినియోగించ వలసివచ్చింది. ఈ నాడు "యంగ్ ఇండియా" "నవజీవన్" పత్రికల మాదిరిగానే, ఆ నాడు "ఇండియన్ ఒపినియనే" పత్రికకూడా నా జీవిత ప్రతిబింబమే.

జాగ్రత్తగా ఆలోచించకుండా ఒకమాటగాని, ఒక అత్యుక్తి గాని, ద్వేష పూర్వకంగా ఒకవిషయాన్ని గాని ఆ పత్రికలో నేను ఎన్నడూ వ్రాసినట్లు జ్ఞాపకంలేదు. ఆ పత్రికకు సంపాదకత్వం వహించడం ఆత్మని గ్రహసాధన విషయంలో నిజానికి నా కొక శిక్షణగా పరిణమించింది. ఆ పత్రిక ధోరణిని బట్టి, వ్యాఖ్యాత తన రచనలను అతివిబ్బరంతో సాగించవలసి వచ్చేది. ఆహారవిషయాలను గురించి అందులో వరసగా అనేక వ్యాసాలు వ్రాశాను. తర్వాత ఆ వ్యాసాలను ఇంగ్లీషుభాషలోకి అనువదించి, గ్రంథరూపంలో ప్రచురించారు. ఆ గ్రంథంపేరు "గైడ్ టు హెల్త్". దాన్నిచదివిన ప్రాచ్య, పాశ్చాత్య పాఠకులు చాలమంది తమ జీవిత పద్ధతులను మార్చుకున్నట్లు కనిపిస్తుంది.

# 22. గ్రంథ ప్రభావం

నేను చదివిన కొన్ని పుస్తకాలు నాలో అద్భుతమైన మార్పును కలిగించినవి. రస్కిన్ మహాశయుడు వ్రాసిన "అంటూ దిస్ లాస్ట్" (Unto This Last) అనే పుస్తకం కలిగించినంతటి విప్లవాత్మకమైన మార్పును నాలో మరేపుస్తకమూ కలిగించలేదు. "ఇండియన్ ఒపినియన్" పత్రిక వ్యవహారాలను చక్కబెట్టడానికి గాను 1904 లో నేను డర్బాన్ నగరం వెళ్ళవలసివచ్చింది. ఆల్బర్ట్ వెస్ట్ అనే ఆంగ్లేయుడు నా మిత్రుడు. అచ్చుపని సంగతి సందర్భాలు స్వయంగా తెలిసినవాడు. ఆల్బర్ట్‌వెస్ట్ నా సూచన ననుసరించి తన వ్యాపారమంతటినీ కట్టిపెట్టిన త్యాగశాలి. "ఇండియన్ ఒపినియన్" వ్యవహారాలను సరిచేయడానికి డర్బాన్ వెళ్ళవలసిందని అతడిని కోరాను. ఆ పత్రిక ఆర్థిక పరిస్థితి అసమంజసంగా వున్నట్లు అతడు నాకు తెలియజేసాడు.

డర్బాన్ రైలుకు ప్రయాణమై స్టేషనుకు వెళ్ళుతుండగా మిత్రుడు పోలక్ కనబడి "అంటూ దిస్ లాస్ట్" అనే గ్రంథాన్ని రైలులో చదువవలసిందని నాకుఇచ్చాడు. "ఈ పుస్తకం నీకు బాగానచ్చుతుంది," అని కూడా అన్నాడు

చదవడం ప్రారంభిస్తే పూర్తికావిదే ఆ పుస్తకాన్ని అవతల పెట్టడం అసంభవమై తోచింది. అది నన్ను ముగ్ధునిచేసింది. రైలు సాయంత్రానికి డర్బాన్ చేరింది. ఆ రాత్రి అంతా నాకు నిద్ర పట్టనేలేదు. రస్కిన్ గ్రంథాలలో నేను చదివినది అదేమొదటిది. చదివిన వెన్వెంటనే నాలో పెద్దమార్పు తెచ్చింది. ఆ గ్రంథములోని ప్రబోధాలకు అనుగుణంగా జీవితాన్ని మార్పు చేసుకోవాలని సంకల్పించు కున్నాను. నా అతిగాఢవిశ్వా

సాలలో కొన్నిటిని ఆ పుస్తకం ప్రతిబింబింప జేసింది. నాకు అర్థమైనం తవరకు దానిలోవున్న ప్రబోధాలు ఇవి—

1. సమిష్టి క్షేమంలో వ్యక్తి క్షేమంకూడా ఇమిడి వున్నది.

2. ప్లీడర్ చేసేపని ఎంత విలువైనదో మంగలివాడి పనీ అంతే విలువైనది. ఎందుచేతనంటే, ఏదోపనిచేసి జీవనోపాధి ఏర్పాటు చేసుకో డానికి అందరికీ సమానమైన హక్కున్నది గనుక.

3. భూమి దున్ని కాయ కష్టంతో పనిచేసే కర్షకుడిజీవితం, చేతిప నులే జీవనాధారంగా గలవాడి జీవితం ఉత్కృష్ట మైనవి.

వీటిలో మొదటిది నాకుతెలుసు.

రెండవది అస్పష్టంగా అవగాహనైంది.

మూడవది అంతకు పూర్వం ఎన్నడూ నా బుద్ధికి తోచనేలేదు. "అంటూ దిస్ లాస్ట్" అనేగ్రంథం పై రెండు, మూడుఅంశాలు కూడా దానిలోనే ఇమిడివున్నవని సుస్పష్టం చేసింది. ఈ సూత్రాలను ఆచరణలో పెట్టవలసిందే ననే సంకల్పంతో ఉదయమే లేచాను.

---

# 23. ఫినిక్స్ ఆశ్రమం

రస్కిన్ గ్రంథాన్ని చదివినపిమ్మట జీవిత పద్ధతినే మార్చివేయాలని నిర్ణయించుకున్నాను కదా! "ఇండియన్ ఒపినియన్" పత్రికను ఒక వ్యవసాయ కేంద్రానికి మారుద్దామన్నది నా ఈ సంకల్పానికి తొలిఫలితం. ఆ కేంద్రంలో అందరూ కష్టపడి పనిచేయాలనీ, సమాన వేతనం పుచ్చుకోవాలనీ తీరికసమయంలో అందరూ "ప్రెస్" పని చూడాలనీ నిర్ణయించాను. ఆల్బర్ట్ వెస్ట్ ఈ పద్ధతిని ఆమోదించాడు. ప్రతిమనిషీ నెల ఒకటికి

మూడు పౌనులుమాత్రం 'అలవెన్సు' కిందతీసుకోవాలని తీర్మానించాము. డర్బాన్ రైలుస్టేషను సమీపంలో ఏదైనా భూమి అమ్మకానికి వున్నట్లయితే కొందామని వెంటనే "అడ్వర్టయిజు" చేశాను. ఇరవై ఎకరాల భూమి అమ్మకానికి దొరకగా కొన్నాను. దానిలో ఒక చిన్న నీటిబుగ్గ, కొన్ని నారింజచెట్లు, మామిడిచెట్లు వున్నవి. దీనిని ఆనుకునే, పక్కగా 80 ఎకరాలు కంద్రిక అమ్మకానికి వచ్చింది. ఇందులో చాలా పండ్లచెట్లు వున్నవి. శిధిలావస్థలో ఒక కుటీరంకూడా వున్నది. దీన్నికూడా మొత్తం 1000 పౌనుల కిమ్మతుచేసి కొన్నాను. ముద్రణాలయ స్థాపనకోసం వెంటనే ఒక పాకా వేయించాము. అల్బర్ట్‌వెస్ట్, తదితరులు ఎన్నో ప్రమాదాలకోర్చి వడ్రంగులతోనూ, తాపీ పనివారితోనూ వుండిపోవలసివచ్చింది. ఇది అంతకు క్రితం నిర్మానుష్య ప్రదేశం. దట్టంగా గడ్డి, గాదం పెరిగి వున్న స్థలం. పాములు విస్తారంగా వుండేవి. అందుచేత, మానవులు నివసించడానికి అది ప్రమాదమైన ప్రాంతం. దాన్ని బాగా శుభ్రంచేశాము. నివాస యోగ్యంగా మార్చివేశాము. వారంరోజుల వ్యవధిలో మా పరికరాలన్నిటినీ బండ్లలో ఫినిక్స్‌కు చేర్చుకున్నాము. దీనికి 'ఫినిక్స్ కేంద్రం' అని నామకరణంచేశాము. భారతదేశంనుంచి నాతోవచ్చిన బంధువులను, మిత్రులను ఫినిక్స్‌కు వెంటపెట్టుకుపోదామని ప్రయత్నించాను. కొందరు రావడానికి ఒప్పుకున్నారు. ఇలా వచ్చినవారిలో కీర్తిశేషుడు మగన్‌లాల్‌గాంధీ పేరును ముఖ్యంగా చెప్పక తప్పదు. ఇతడు తన వ్యాపారాన్ని వదలివేసి, నాతోపాటు మునిగితే మునుగుదాము, తేలితే తేలుదామని వచ్చాడు. తన సామర్థ్యంవల్లా, త్యాగంవల్లా, దీక్షవల్లా ఇతడు నా సహచరులలో అగ్రేసరుడైనాడు. నా నైతిక ప్రయోగాలన్నిటిలో ఇతడు పరీక్షలకు సులభంగా తట్టుకోగలిగాడు. చేతి పనులను స్వయంగా అభ్యసించి నేర్చుకోగలిగిన కారణంచేత ఇతడిది నా సహచరులలో విశిష్టస్థానం. దక్షిణాఫ్రికా సత్యాగ్రహానంతరం భారతదేశానికి తిరిగివెళ్ళిన జట్టుకు నాయకత్వం వహిం

చింది ఇతడే. ఇప్పుడు సత్యాగ్రహాశ్రమమని పిలుస్తున్నదానికి వీరు మూల సభ్యులు. 1928 లో మృత్యువాత పడేవరకూ మగన్‌లాల్ గాంధీ ఆ ఆశ్రమానికి జీవగర్రగా వుండేవాడు. నేను ఏ నియమాలను గాఢంగా విశ్వసించి అనుష్ఠించ దలచానో, వాటి ఆచరణలోనే ఇతడు తన ప్రాణా లర్పించాడు. మగన్‌లాల్ మరణం నాకు పెద్ద దెబ్బ.

ఫినిక్స్ ఆశ్రమాన్ని 1904 లో స్థాపించాను. అనేక చిక్కులను ఎదుర్కొనవలసి వచ్చినప్పటికీ, 'ఇండియన్ ఒపినియన్' పత్రిక ఇప్ప టికీ అక్కడినుంచే వెలువడుతున్నది. ఆరంభదశలో ఏర్పడిన చిక్కు లను, పెట్టుకున్న ఆశలను, ఎదుర్కొన్న ఆశాభంగాలను ఇక్కడ విపులీ కరించ నవసరంలేదు. ముద్రణాలయానికి చెందిన పనులు మగన్ లాల్ గాంధీకి కొత్త అయినప్పటికీ, త్వరలోనే దాదాపు అన్ని విషయాలలోనూ చాకచక్యం సంపాదించాడు. ఆ పనులను నిర్వహించడంలో మమ్ముల నందరినీ తలదన్నాడు.

కొత్తగా నిర్మించిన ఈ ఫినిక్స్ ఆశ్రమంలో ఆట్టే రోజులు వుండక ముందే, నేను జోహెనెస్‌బర్గ్ వెళ్ళవలసి వచ్చింది. పత్రిక విషయంలో నేను ప్రవేశపెట్టిన మార్పులన్నిటినీ జోహెనెస్ బర్గ్‌లో పోలక్‌కు తెలియ జేశాను. తాను ఇచ్చిన గ్రంథం నాలో అపూర్వమైన మార్పులు తెచ్చిందని చెప్పగా, పోలక్ అపరిమిత సంతోషభరితుడైనాడు. 'క్రిటిక్' అనే పత్రి కలో తన ఉద్యోగాన్ని వదలివేసి, "మా కుటుంబం"లో సభ్యుడుగా చేరాడు. ఐతే, అతడిని నేను ఆట్టేకాలం వుంచుకోలేక పోయినాను. జోహెనెస్ బర్గ్ ఆఫీసును ఒంటరిగా నిర్వహించడం నాకు దుస్తరమని పించింది. ఆఫీసులోచేరి పనిచేస్తూనే, 'అటార్నీ'గా ప్రాక్టీసు చేయడానికి 'సర్టిఫికేటు' సంపాదించవలసిందని పోలక్‌ను కోరాను. చివరకు ఉభయు లం వృత్తినుంచి విరమించి, ఫినిక్స్‌లోనే వుండిపోవచ్చుకదా! అను కున్నాను. ఐతే, ఆ కోరిక నెరవేరలేదు. ఏదో పనిమీద ఎప్పుడూ నేను

ఫినిక్స్‌ను వదలివుండవలసివచ్చేది. రస్కిన్ మహాశయుడి ప్రబోధాన్ని దృష్టిలో పెట్టుకొని, తదనుగుణంగా ఇంటి ఏర్పాట్లు చేసుకోవడంతో మాత్రమే తృప్తిపడవలసి వచ్చింది. బారిస్టర్ ఇల్లు ఎంత నిరాడంబరంగా వుండడానికి వీలున్నదో, అంత నిరాడంబరంగా నా ఇంటిని వుంచాను. కాయ కష్టపు పనులు చేయడం అంటే అభిమానం ఎక్కువైంది. రొట్టెల అంగడికివెళ్ళి రొట్టెకొనుక్కోడానికి బదులు, పొట్టుపోని, పులియబెట్టని పిండితో మా రొట్టెలు మేమే ఇంటివద్ద తయారుచేసుకోవడం ప్రారంభించాము ఈవిధంగా రొట్టె చేసుకోవాలంటే, చేతితోకొట్టిన పిండి కావాలి. ఇందుకోసం 7 పౌనుల పెట్టుబడితో ఒక పిండిమర కొన్నాను. దీన్ని చేతితోనే తిప్పవచ్చు. ఈ మర తిరగడానికి ఇద్దరు పనిచేయాలి. మామూలుగా పోలక్, నేను, పిల్లలు కలసి ఈమర నడిపేవాళ్ళము. ఈ పనిచేయడమంటే పిల్లలు చాలా సరదాపడేవాళ్ళు. ఇది వాళ్ళకు మంచి కసరతుగా ఉపయోగపడింది. మాకు ఒక నౌకరు వున్నప్పటికీ, మునిసిపల్ పాకీవాడువచ్చి దొడ్లు శుభ్రం చేస్తున్నప్పటికీ, పాకీదొడ్ల శుభ్రత విషయంలో మాకై మేమే శ్రద్ధతీసుకునేవాళ్ళము. ఇది పిల్లలకు మంచి శిక్షణగా ఉపయోగపడింది. ఈ కారణంచేత, నా కుమారులు ఎవరికీ పాకీపని అంటే అసహ్యమేమీ వేసేదికాదు. పైగా గృహపారిశుధ్య విషయంలో వాళ్ళకు మంచి ప్రవేశం ఏర్పడింది.

ఈవిధంగా నన్ను, నా పిల్లలను క్రమశిక్షణలో పెట్టుకుంటున్న సమయంలోనే ఒక సంఘటన జరిగింది. జోహెనెస్‌బర్గ్‌లో కాపురం ఎత్తివేయడానికీ, నా భార్యా బిడ్డలను ఫినిక్స్‌కువెళ్ళి అక్కడే స్థిరంగావుండేటట్లు చేయడానికీ ఈ సంఘటన నాకు సహాయపడ్డది. ఆరోజులలో పోలక్ ఒక్కడూ ఒక చిన్న ఇంటిలో వుంటుండేవాడు. "జులూ తిరుగుబాటే" ఈ సంఘటన.

# 24. 'జులూ తిరుగుబాటు'

బోయెర్ యుద్ధంలో మాదిరిగానే, జులూ 'తిరుగుబాటు'లో కూడా బ్రిటిష్ సామ్రాజ్యంపై నాకున్న భక్తే బ్రిటిష్‌వారికి చేతనైన సహాయం చేయవలసిందని నన్ను విశేషంగా ప్రోత్సహించింది. జులూ తెగవారిపై నాకు ద్వేషమేమీలేదు. వారు భారతీయులలో—ఎవరికీ ఏవిధమైన హానీ చేయలేదు. అసలు ఈ సంఘటనను 'తిరుగుబాటు' అని వర్ణించకుండానే వుండేవాడిని. కాని, బ్రిటిష్ సామ్రాజ్యం ప్రపంచక్షేమం కోసమే పనిచేస్తున్నదని ఆరోజులలో నేను అభిప్రాయపడుతుండేవాడిని. నేను నెటాల్ పౌరుడిని. నెటాల్ బ్రిటిష్ సామ్రాజ్యంలో ఒకభాగం. ఈ కారణాలన్నిటివల్లా, 'ఇండియన్ అంబులెన్స్‌కోర్'ను ఒకదాన్ని స్థాపించ దలచామని నెటాల్ గవర్నరుకు తెలియజేయడం నా విద్యుక్త ధర్మమని భావించాను. ఈ సూచనను గవర్నర్ వెంటనే ఆమోదించాడు. అంతట ఎకా ఎకిన డర్బాన్‌కువెళ్ళి అంబులెన్సు దళంలో చేరవలసిందని భారతీయులకు విజ్ఞప్తిచేశాను. మొత్తం ఇరవైనాల్గు మందిమి చేరాము. నాకు ఒక హోదా ఇవ్వాలనే ఉద్దేశంతో తాత్కాలిక సార్జెంటు మేజర్‌గా నియోగించారు. మా దళం దాదాపు ఆరు మాసాలు మాత్రమే 'తిరుగుబాటు' ప్రాంతంలో పనిచేసింది. తీరా అక్కడికివెళ్ళిచూస్తే, ఆ తిరుగుబాటంతా పన్నుల నిరాకరణోద్యమంగా కనబడింది. అది చూసిన తర్వాత, జులూ తెగవారిపై నాకు సానుభూతి ఏర్పడింది. ఆ పరిస్థితులలో గాయపడిన జులూ తెగవారికి సపర్య చేయడమే మా ముఖ్య కర్తవ్యమైనందుకు సంతోషించాను. గాయపడిన జులూలకు సహాయపడే నిమిత్తం తెల్లవారెవరూ ముందుకు రానందున, మెడికల్ ఆఫీసర్ ఏమిచేయాలో తెలియక, తికమకలో పడ్డాడు. మా రాక ఆయనకు హర్షహేతువైంది.

'బాండేజి' పరికరాలను, 'డిస్ ఇన్ఫెక్టెంటు' ఔషధాలను, తదితర సామగ్రిని మాకు తక్షణమే ఆ ఆఫీసరు సప్లయిచేశాడు. ఆసుపత్రిని ఏర్పాటు చేసిన స్థలానికి తీసుకువెళ్ళారు. సహాయం చేయడానికి మేము వెళ్ళగానే, జులూలు సంబరపడ్డారు. మేము సేవచేస్తున్నవారు యుద్ధంలో గాయపడినవారుకారు. జులూలలో కొందరిని అనుమానంమీద ఖైదీలుగా పట్టుకున్నారు. బ్రిటిష్ సేనాని వారికి కొరడాదెబ్బల శిక్ష విధించాడు. ఆ దెబ్బల ఫలితంగా వారికి తీవ్రమైన గాయాలు తగిలినవి. జులూతెగ సానుభూతిపరులుకూడా వీరిలో కొందరున్నారు. శరవేగాన ముందుకు పోతున్న పటాలంతో మా ఆంబులెన్సు దళాన్ని జతపరిచారు. ఏ ప్రాంతంనుంచి ప్రమాదవార్తవస్తే, ఆ ప్రాంతానికి వెళ్ళవలసిందని ఈ పటాలానికి ఉత్తర్వు చేశారు. రెండుమూడు సందర్భాలలో మేము రోజుకు నలభై మైళ్ళుకూడా వెళ్ళవలసి వచ్చింది. ఎక్కడికి వెళ్లినప్పటికీ, మానవ సేవనే చేయవలసి వచ్చినందుకు కృతజ్ఞులం. ఈ సంఘర్షణలలో పొరబాటున గాయపడిన జులూ మిత్రులను స్ట్రెచెర్లలో శిబిరానికి చేరవేయడమూ, వారికి నర్సులుగా పనిచేయడమూ మా పని.

. ఈ తిరుగుబాటు అంతా యుద్ధంవలె గాక, అనుమానం వున్నవారిని వేటాడి ఖైదుచేయడంగా మాకు తోచింది నేను సంప్రతించిన చాలామంది ఆంగ్లేయులు కూడా ఇదే విధంగా అభిప్రాయపడ్డారు. ఏ పాపమెరుగని అమాయకపు గ్రామాలలో సీమ టపాకాయల మాదిరిగా సైనికుల తుపాకులు ప్రేలినవనే వార్తలు వినవస్తుండేవి; ఒకవైపు ఆవార్తలు వింటూ, మరొకవైపు పనిచేయడం బాధకరంగా తోచింది. గాయపడిన జులూలకు సేవచేసే భాగ్యం లభ్యమైంది కదా అనే అభిప్రాయంతో అంతరాత్మను సంతృప్తిపరుచుకొని బ్రిటిష్ విషప్రచారాన్ని దిగమింగి వూరుకునేవాడిని. మేము సేవజేయక పోయినట్లయితే, గాయపడిన జులూల అతీ గతీచూసిన దిక్కే ఉండేది కాదు.

# 25. బ్రహ్మచర్యం

ఈ విషయంలో నా అంతరాత్మ ఒకవిధంగా ఊరట చెందినప్పటికీ, అనేక ఇతరవిషయాలను గురించి ఆలోచన లేకపోలేదు. "జులూ లెండు"లోని ప్రశాంతమైన కొండల మీదుగా, కొండ చరియలమీదుగా గాయపడినవారిని మోసుకుపోతూ, మోసుకురాను పోతూవుండగా నేను తరుచు గాఢమైన ఆలోచనలో పడుతుండేవాడిని. బ్రహ్మచర్య వ్రతాన్ని గురించీ, దాని సాధక బాధకాలను గురించీ దీర్ఘంగా ఆలోచిస్తుండేవాడిని. ఈ ఆలోచన లన్నిటివల్లనూ నా అభిప్రాయాలు మరీ దృఢంగా నాటుకుపోయినవి. బ్రహ్మచర్య వ్రతాన్నిగురించి సహచరులతో చర్చించి చూశాను. ప్రతివ్యక్తీ తననుతాను తెలుసుకోడానికి బ్రహ్మచర్య వ్రతం అనుసరించడం ఎంత తప్పని సరియైన విషయమో అప్పటిలో నాకు అవగాహన కాలేదు. కాని మానవకోటిని పరిపూర్ణ హృదయంతో సేవించాలని ఆశించేవ్యక్తి మాత్రం బ్రహ్మచర్యావలంబన లేనిదే తనపనిని సాగించలేడని స్పష్టంగా తెలుసుకున్నాను. ఇప్పటివరకు చేసినట్లుగానే, మానవసేవ చేయవలసిన సందర్భాలు ఉత్తరోత్తరా అనేకం ఏర్పడినవి. సంసార సౌఖ్యాలలో పడి, సంతానాన్ని కనడంలోనూ, దాన్ని పోషించడంలోనూ, మునిగి తేలుతున్నట్లయితే, మానవసేవా నియతికి నాకుతగిన తాహతు ఉండదని కూడా గమనించాను. ఒక్కమాటలో చెప్పవలెనంటే ఐహిక సౌఖ్యాలకు ఆధ్యాత్మిక మార్గాను సరణకు పొసగదని తెలుసుకున్నాను. నా భార్య గర్భవతిగా వున్నట్లయితే జులూ తిరుగుబాటు రాగానే మానవ సేవలో దూకడానికి నాకు వీలుండేదికాదు. బ్రహ్మచర్య వ్రతాన్ని అవలంబించని పక్షంలో మానవసేవకు, కుటుంబసేవకు, మధ్యఘర్షణ ఏర్పడే

మాట నిజం. బ్రహ్మచర్యాన్ని అనుసరించినట్లయితే, పరస్పర వైరుధ్యంలేకుండా రెంటినీ సవ్యంగా సాగించవచ్చు.

ఒకవైపు విశేషంగా కాయకష్టపడి పనిచేస్తూ మరొకవైపు తీవ్ర ఆలోచనలో పడివున్న సమయం ఇది. "జూలూ తిరుగుబాటు"ను అణచివేయడం ఇంచుమించుపూర్తి అయిందనీ. త్వరలోనే మమ్మల్ని ఆ పని నుంచి విడుదల చేయబోతున్నారనీ వర్తమానం వచ్చింది. ఈ వార్తవిన్న ఒకటి రెండురోజులకే విడుదలచేయడం కూడా జరిగింది. మేము చేసిన సేవను అభినందిస్తూ, గవర్నరు వ్రాసిన లేఖకూడా అందింది.

"ఫినిక్స్" ఆశ్రమానికి చేరినతర్వాత సహచరులతో చర్చించి చూశాను. యావజ్జీవ బ్రహ్మచర్య వ్రతాన్ని అవలబించ వలసిందేనని తుది నిర్ణయం చేసుకున్నాను. ఈవ్రతానుష్ఠానంలో వున్న గాంభీర్యాన్ని గాని, అపారత్వాన్నిగాని, నేను పూర్తిగా అవగాహన చేసుకోలేదనే ఒప్పుకొనక తప్పదు.

త్రికరణ శుద్ధిగా ఒక శపథం చేసినట్లయితే, దానిమీదవున్న విశ్వాసబలమే అనుష్ఠానంలో పెట్టనికోటగా పరిణమిస్తుందనే నమ్మకం ఉన్నది

యావజ్జీవ బ్రహ్మచర్య వ్రతాన్ని అవలంబిస్తే, స్త్రీ వ్యామోహానికి తట్టుకోవడం కష్టమనే ఆక్షేపణలను తోసివేశాను. స్థిరమైన శపథాన్ని పట్టి ఏ వ్రతాన్ని ఆచరణలో పెట్టినప్పటికీ, ఆ శపథబలమే పెట్టని కోటగా పరిణమించి ప్రమాద భరితమైన వ్యామోహాలన్నిటి నుంచీ కాపాడుతుంది. దుర్బలత్వానికీ సంశయావస్థకూ కూడా ఇది విరుగుడుగా పనిచేస్తుంది. "విరక్తి లేనిదే ఎంతటి పరిత్యాగమైనా స్థిరంగా నిల్వలేదు." అని కవి కీర్తించిన మాటలలో ఎంతైనా సత్యమున్నది. ఒక అవస్థనుంచి మరొక అవస్థకు మారుతున్న సమయంలో చెడ్డవాటిమీద విరక్తి ఎక్కువవుతుంది. అప్పట్టున శపథబలం ఎంతైనా అవసరం.

1906 లో బ్రహ్మచర్య వ్రతాన్ని అవలంబించేవరకు, నా మనో

గత భావాలను నా భార్యకు తెలియ జేయలేదు. చివరకు నా వ్రతాన్ని తెలిసినప్పుడు. ఆమె ఏ విధమైన ఆక్షేపణనూ చెప్పలేదు. ఆమె వైఖరి నాకు అపరిమిత ఆనందాన్ని చే కూర్చింది. ఆమెకు స్థిరయశస్సు లభ్యమైంది.

వ్రతాన్ని ఆచరణలో పెట్టినమీదట నేను అనుభవించిన స్వేచ్ఛా. సంతోషాలను 1906 కు పూర్వం ఎన్నడూ అనుభవించలేదు. బ్రహ్మచర్య వ్రతాన్ని అవలంబించిన దాదాపు నెలరోజులలోనే, సత్యాగ్రహానికి పునాదులు వేయవలసి వచ్చింది. నాకు తెలియకుండానే బ్రహ్మచర్య వ్రతం నన్ను సత్యాగ్రహానికి సంసిద్ధ పరచసాగింది. సత్యాగ్రహం ముందుగా ఆలోచించి ఆచరణలో పెట్టిన పథకంకాదు. ఏ విధమైన సంకల్పమూ లేకుండానే దానంతటదే ఉద్భవించింది. ఐతే నేను అంతకుపూర్వం జరిపిన ప్రతిచర్య క్రమేపీ నన్ను సత్యాగ్రహం అనే గమ్యస్థానానికి చేర్చి వుండాలని మాత్రం తోచింది. జోహెన్స్ బర్గ్‌లో వుండగా విపరీతంగా పెరిగి పోయిన ఇంటి ఖర్చులన్నిటినీ తగ్గించివేశాను. అక్కడినుంచి ఫినిక్స్‌కు మారాను. బ్రహ్మచర్య వ్రతాన్ని అవలంబించడానికే, ఫినిక్స్‌కు చేరానేమో ననిపిస్తుంది.

వ్రతం సాగినకొద్దీ సంతోషం ఎక్కువవుతున్నమాట నిజం. వ్రతాన్ని సులభంగా ఆచరణలో పెట్ట గలుగుతున్నానని మాత్రం ఎవరూ ఊహించవద్దు. ఈ వార్ధక్యంలో సైతం బ్రహ్మచర్యాన్ని కాపాడడం ఎంతో కష్టమైన విషయంగా కనిపిస్తుంది. ఇది కేవలం అసిధారా వ్రతమేనని ఏ రోజు కా రోజు నాకు బోధపడుతున్నది. నిరంతరం జాగరూకత వహించి వుండడం ఎంత అవసరమో అనుక్షణం అవగాహ నవుతున్నది.

మనసా, వాచా, కర్మణా సర్వేంద్రియాలను నిగ్రహించడమే బ్రహ్మచర్యం. యదేచ్ఛా విహార జీవితానికీ, బ్రహ్మచారి జీవితానికీ

వ్యత్యాసాన్ని గమనించడం అవసరం. ఉభయులూ తమ నయనేంద్రి యాన్ని ఉపయోగిస్తారు. బ్రహ్మచారి భగవంతుడి అమోఘ లీలలను పరికించడానికి తన నయనేంద్రియ శక్తిని ఉపయోగిస్తాడు. రెండవ వ్యక్తి తనచుట్టూవున్న కళ్మలాన్ని చూడడానికి ఉపయోగిస్తాడు.

ఉభయులూ తమ కర్ణేంద్రియాలను ఉపయోగిస్తారు. ఐతే ఒకరు కేవలం భగవన్నుతి వినడానికే ఉపయోగిస్తే, మరొకరు శుష్కప్రియు లతో, అసభ్య వాచాలత్వంతో వీనులకు విందుచేసుకుంటారు. ఉభయులూ రాత్రిళ్ళు చాలాసేపు నిద్రమేల్కొని వుంటారు. ఐతే, ఒకరు ధ్యానము ద్రలో, ప్రార్థనలో నిమగ్నులై వుంటే, మరొకరు విచ్చలవిడిగా వెర్రి ఆనందంతో కాలాన్ని వృధా పుచ్చుతారు. ఉభయులూ తమ అంతరా త్మకు ఇంత ఆహుతి పడవేస్తారు. ఒకరు దేహమనే ఈ పవిత్ర ఆల యాన్ని చెక్కు చెదరకుండా వుంచడానికి ప్రయత్నిస్తే, మరొకరు వెక్కసం వేసేటట్లు తిని, దాన్ని ఒక పెంటకుప్పగా తయారుచేస్తారు.

నిరంతరంగా, నిర్విరామంగా కృషిచేస్తేనే తప్ప, ఇట్టి బ్రహ్మ చర్య వ్రతాన్ని సాగించడం అసంభవం. స్వయంకృషి విషయంలో ఎంత విశ్వాసబలం వుంటుందో భగవంతుడి విషయంలో కూడా అంతే విశ్వాస బలంవుంటే, బ్రహ్మచర్యా నుష్ఠానంద్వారా భగవంతుడిని సాధించ దలచిన వారెవరూ నిస్పృహ చెందవలసిన అగత్యంలేదు.

భగవద్గీతలో ఏమని ఉన్నదంటే—

శ్లో॥ విషయా వినివర్తంన్తే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥

కాబట్టి మోక్షకామికి భగవన్నామం, భగవత్కృప ఇవి రెండు శరణ్యాలు. భారత దేశానికి తిరిగివచ్చిన తర్వాతగాని ఈ సత్యం నాకు బోధపడలేదు.

# 26. న్యాయవాద వృత్తిలో కొన్ని అనుభవాలు

దక్షిణాఫ్రికాలో ప్లీడరుగా ప్రాక్టీసు చేసినప్పటివి నా అనుభవాలు ఒకటి, రెండు ఈ అధ్యాయంలో స్ఫురణకు తెచ్చుకుంటాను. ప్లీడరు వృత్తి పచ్చి అబద్ధాల వృత్తేనని చదువుకుంటూన్న రోజులలో వింటూండే వాడిని. అబద్ధాలాడి ధనంగాని, అధికారంగాని సంపాదించాలనే ఉద్దేశం నాకు ఎన్నడూలేదు. అందువల్ల న్యాయవాదవృత్తి అబద్ధాలవృత్తే వనే విషయం నామీద ఏ విధంగానూ పనిచేయలేదు. నా వృత్తిలో నేను ఎన్న డూ అబద్ధమాడినట్లు జ్ఞాపకంలేదు. పైగా ప్రాక్టీసులో విశేషభాగాన్ని ప్రజాసేవకోసమే వినియోగించాను. పార్టీలవద్ద ఖర్చుఖర్చులుతప్ప ఎప్పు డూ దమ్మిడీకూడా ఎక్కువ పుచ్చుకొని ఎరుగను. అప్పుడప్పుడు ఆ ఖర్చుపు ఖర్చులుకూడా నేనే భరిస్తుండేవాడిని. కేసు గెలిస్తేనే ఫీజు ఇవ్వండ అనే షరతును ఎన్నడూ పెట్టినట్లుకూడా నాకు జ్ఞాపకంలేదు. తప్పుడుకేసు పట్టననీ, సాక్షులకు పాఠాలుచెప్పి తరిఫీదు చేసేపద్ధతి నాదికాదనీ కొత్తగా వచ్చే ప్రతి క్లయింటుకూ ముందుగానే హెచ్చరిక చేసేవాడిని. ఇందువల్ల నావద్దకు తప్పుడు కేసులు తీసుకువస్తే లాభం లేదనే ఖ్యాతి ఒకటి ఏర్పడింది.

ఒకప్పుడు జొహెనెస్ బర్గ్ మెజిస్ట్రేటు కోర్టులో కేసు నడుపు తుండగా, నా క్లయింటు నన్ను మోసంచేశాడని తెలుసుకున్నాను. అతడి సంగతి నేను కనిపెట్టానని తెలియగానే, బోనెక్కి సాక్ష్యం ఇస్తున్న వాడల్లా విభ్రాంతుడై నిలువునా కుప్ప కూలినట్లు కూలిపోయినాడు. అంతట వాదనా, గీదనా ఏమీ లేకుండానే కేసు కొట్టివేయవలసిందని మేజిస్ట్రేటును

కోరాను. ఎదటి పక్షపు ప్లీడరు ఆశ్చర్య చకి[illegible]. మెజిస్ట్రేటు సంతోషించాడు. ఈ కేసులో నేను ఈవిధంగా [illegible] నా ప్రాక్టీసేమీ తగ్గలేదు. నిజానికి నాపని బాగా తేలికైందికూడా. సత్య పథాన్నే అంటిపెట్టుకొనివున్న కారణంచేత, తోడి న్యాయవాదులలో నా ప్రతిష్ఠ పెంపొందినట్లు గమనించాను. వర్ణవిభేదం వున్నప్పటికీ, కొన్ని విషయాలలో తోడి న్యాయవాదుల ఆదరణను పైతం పొందగలిగాను.

దక్షిణాఫ్రికాలోని భారతీయులందరికీ కీర్తిశేషుడు పార్సీ రుస్తోంజీ పేరు బాగా తెలిసినదే. ఒకా నొక సందర్భంలో ఇతను చాలా గట్టి చిక్కులో పడిపోయినాడు. చిరకాలంనుంచీ నా సహచరుడు. తన వ్యవహారాలన్నీ ఎప్పటి కప్పుడు నాతో చెబుతుండేవాడు. ఈసారి తనసంగతి నాతో చెప్పలేదు. బొంబాయి, కలకత్తా నగరాలనుంచి సామగ్రిని విస్తారంగా దిగుమతిచేస్తుండేవాడు. అప్పుడప్పుడు రహస్యంగాకూడా సరుకు చేరవేస్తుండేవాడు. కస్టమ్స్ శాఖోద్యోగులందరూ ఇతడితో బహుస్నేహంగా వుండేవాళ్ళు. వారిలో ఏ ఒకరూకూడా ఇతడిని అనుమానించేవారే కారు. కాని, ఈసారి 'ఇన్వాయిస్' విషయమై ప్రశ్నవచ్చింది. నేరం బయటపడింది. ఖిన్నుడై పశ్చాత్తాప హృదయంతో నావద్దకు ఆదరా బాదరా పరుగెత్తుకొని వచ్చాడు. అతడికి చెక్కిళ్ళపైనుంచి కన్నీళ్లు బొట బొటా రాలుతున్నవి. ఊరట పరిచాను. నాకు తెలిసినంతవరకు ఈ చిక్కునుంచి బయటపడవలెనంటే ఒకేఒక మార్గమున్నదని చెప్పాను. చేసిన నేరాన్ని స్పష్టంగా ఒప్పుకోవడమే గత్యంతర మన్నాను.

"మీ ఎదుట ఒప్పుకుంటున్నాను కదా, అది చాలదా ?" అన్నాడు.

"నీవు అన్యాయంచేసింది ప్రభుత్వానికి కాని, నాకుకాదు గదా ? నా ఎదుట ఒప్పుకుంటేమాత్రం ప్రయోజన మేమిటి ?" అని నేను బదులు చెప్పాను.

మేము ఉభయులమూ వెళ్ళి రుస్తోంజీ ప్లీడరును సలహా అడిగాము.

నా సలహాతో ఆయన ఏకీభవించేటట్లు కనిపించలేదు. రుస్తోంజీమాత్రం నా సలహానే అనుసరిస్తానన్నాడు. ప్రాసిక్యూషన్ నడుపవలసినవారు కస్టమ్స్ ఆఫీసరు, అటార్నీ జనరలు. కాబట్టి వీరిద్దరినీ కలుసుకొని సంప్రతిస్తానని చెప్పాను. ఈ ఇద్దరు ఉద్యోగులు ఎంత జరిమానా విధిస్తే, అంత జరిమానాను చెల్లించడానికి ఇష్టపడాలనికూడా ముందుగానే రుస్తోంజీకి తెలియచెప్పాను. జరిమానా విధించడానికి ఈ ఇద్దరు ఉద్యోగులు ఒక వేళ సమ్మతించకపోయే పక్షంలో, జైలుకు వెళ్ళక తప్పదనికూడా చెప్పాను. నేరంచేయడంలో నామర్దావున్నదిగాని, జైలుకు వెళ్ళడంలో ఏమంత నామర్దా లేదనికూడా నచ్చచెప్పాను.

నా అభిప్రాయాలన్నిటితో పార్సీ రుస్తోంజీ వెంటనే ఏకీభవించాడని చెప్పలేను. ఐతే, రుస్తోంజీ మంచి ధైర్యస్థుడు. "ఇన్నిమాటలెందుకు? పూర్తిగా మీ ఆధీనంలో వుంటున్నానని ఇదివరకే చెప్పుకున్నానుకదా?" అన్నాడు.

ఈ కేసులో నా సర్వశక్తులనూ ఉపయోగించాను. ఇద్దరు ఉద్యోగులనూ కలుసుకున్నాను. జరిగిన విషయం ఏమాత్రం దాపరికము లేకుండా చెప్పివేసినందుకు వారు హర్షించారు. ఇందులో ఏ ఒక్క విషయాన్నీకూడా నేను దాచలేదని వారు పూర్తిగా నమ్మారు. చివరకు రాజీ వద్ధతిమీద పార్సీ రుస్తోంజీ కేసును వారు పరిష్కరించారు. రహస్యంగా చేరవేసిన సరుకు కిమ్మతు ఎంతో దానికి రెట్టింపు డబ్బు జరిమానాగా రుస్తోంజీ కట్టవలసి వచ్చింది. కేసు వివరాలన్నిటినీ కాగితంమీద వ్రాసి, ఆ కాగితానికి 'ఫ్రేము' కట్టించి, దాన్ని తన ఆఫీసుగదిలో గోడకు తగిలించాడు. తన వారసులకు, తోటి వ్యాపారస్థులకు అదొక జ్ఞాపకచిహ్నంగా వుండడానికి రుస్తోంజీ అలా చేశాడు.

---

# 27. సత్యాగ్రహోదయం

జూలూ "తిరుగుబాటు"లో నా పని ముగించుకొని తిరిగివచ్చిన తర్వాత, "ఫినిక్స్" ఆశ్రమంలోని సహచరులతో జీవితాదర్శాన్ని గురించీ, నా భవిష్యత్ కార్య క్రమాన్ని గురించీ చర్చిస్తూండగా ట్రాన్స్‌వాల్ ప్రభుత్వ అసాధారణ గెజటులో 1906, ఆగస్టు 22.వ తేదీన ఒక "ఆర్డినెన్సు" చిత్తు ప్రతి ప్రకటితమైందనే వర్తమానం తెలియవచ్చింది. అది దక్షిణాఫ్రికాలోని భారతీయులకు సర్వనాశన హేతువు కాగల "ఆర్డినెన్సు."

ఎనిమిది సంవత్సరాల వయస్సు పైబడిన భారతీయ స్త్రీ, పురుష, బాల బాలికలు యావన్మందీ—ట్రాన్స్‌వాల్‌లో నివాసపు హక్కువున్న వారందరూ—ఈ కొత్త ఆర్డినెన్సు కింద ఆసియా ఖండవాసుల రిజస్ట్రారు వద్దకు వెళ్ళి, తమతమ పేర్లను రిజస్టరు చేయించుకోవాలి. రిజస్ట్రేషను సర్టిఫికేటును పొందాలి.

రిజస్ట్రేషన్ కోసం దరఖాస్తులు పెట్టుకొనే వారందరూ తమపాత నివాసాను మతులను రిజస్ట్రార్‌కు ఇచ్చివేయాలి. దరఖాస్తులలో తమ పేర్లను, నివాస స్థలాన్నీ, తెగను, వయస్సు మొదలైన విషయాలన్నిటినీ నమోదు పరచాలి. దరఖాస్తుదారు ఒంటిమీద ఏవైనా ముఖ్యమైన గుర్తులు, పుట్టుమచ్చలు మొదలైనవి—వున్నట్లయితే రిజస్ట్రారు వాటిని మనిషి గుర్తుకోసం వ్రాసుకుంటాడు. ఐదు వేళ్ళ ముద్రలూ వేయించుకుంటాడు. దరఖాస్తులు పంపుకోడానికి ఒక తేదీని నిర్ణయించారు. ఆ తేదీలోపుగా దరఖాస్తులు పంపించని ప్రతిభారతీయుడు ట్రాన్స్‌వాల్‌లో తన నివాసపు హక్కును కోల్పోతాడన్నమాట. అంతేకాదు. దరఖాస్తు పెట్టకపోవడం

చట్టరీత్యా నేరం చేసినట్లుగా పరిగణిస్తా మన్నారు. అట్టినేరస్థుడికి జరిమానా విధించవచ్చు; కారాగార శిక్ష చెప్పవచ్చు; లేదా కోర్టువారికి యుక్తమని తోచేపక్షంలో దేశాంతరం కూడా పంపించి వేయవచ్చు.

ఈ ఆర్డినెన్సు వెలువడిన కొన్నిరోజులకే ప్రముఖ భారతీయులు ఒక చిన్న సమావేశం జరిపారు. ఆ సభలో ఆర్డినెన్సులోని ప్రతిముక్కకూ విమర్శగా అర్థం చెప్పాను. దాని అంతరార్థమంతా బోధపడగానే, నా మాదిరిగానే వారూ దిగ్భ్రమ చెందారు. తమ పరిస్థితి ఎంత ప్రమాదంగా పరిణమించిందో సభకువచ్చిన వారందరూ అవగాహన చేసుకున్నారు. తిరిగి ఒక బహిరంగ సభ జరపడానికి తీర్మానించారు.

1909, సెప్టెంబరు 11-వ తేదీన బహిరంగ సభజరిగింది. సభికులు ఆమోదించిన తీర్మానా లన్నిటిలో నాల్గవ తీర్మానం అతిప్రధానమైనది. సభకు హాజరైన భారతీయులందరికీ ఈ తీర్మాన పాఠాన్నీ, ప్రాధాన్యాన్నీ సమగ్రంగా వివరించి చెప్పాను. తాము తీవ్రంగా ప్రతిఘటిస్తున్నప్పటికీ ఈ ఆర్డినెన్సు చట్టంగా మారే పక్షంలో భారతీయుడైన వాడెవడూ దానికి తలవొగ్గకూడదనీ, ఇందుకు ఎన్నిశిక్షలు, జరిమానాలు విధించినప్పటికీ భరించ వలసిందేననీ ప్రేక్షకులు త్రికరణశుద్ధిగా ఈ తీర్మానం ద్వారా సంకల్పించు కున్నారు. ఈ ఉద్యమానికే అప్పటలో "సాత్విక నిరోధము" అని నామకరణం చేశాము. అచిరకాలంలోనే దానికి "సత్యాగ్రహం" అనే పేరువచ్చింది.

ఈ "ఆర్డినెన్సు" చట్టం గాకుండా అడ్డుపడలేక పోయినాము. "పికెటింగ్" జరిపి నప్పటికీ, ప్రజాభిప్రాయం విరుద్ధంగా వున్నప్పటికీ, కొంతమంది భారతీయులు వెళ్ళి తమపేర్లను "రిజష్టరు" చేసుకున్నారు. ట్రాన్స్‌వాల్ ప్రభుత్వ 'ఏషియాటిక్ శాఖ' ఎంత శ్రమపడి పని చేసినప్పటికీ, ఐదు వందల మందికిమించి భారతీయులు బుద్ధి పూర్వకంగా తమ పేర్లను రిజిస్టరు చేయించుకో లేదు. అందువల్ల ఎవరినో ఒకరిని అరెస్టు

చేయడానికి ఆ శాఖవారు నిర్ణయించుకున్నారు జెర్మిస్టన్ పట్టణంలో అనేకమంది భారతీయులు వున్నారు. వారిలో పండిట్ రామసుందర్ అనే అతడు ఒకడు. మంచి ధైర్యస్థుడు. కొంతవరకు ఉపన్యాస సామర్థ్యం కూడా గలవాడు. నిన్న మొన్నటి వరకు జెర్మిస్టన్ పట్టణంలోని సాధుజను లకు మాత్రమే ఇతడి పేరు తెలుసు. ప్రభుత్వం అరెస్టు చేయగానే, ఇతడు ప్రసిద్ధ పురుషుడైనాడు. న్యాయస్థానంలో కూడా రామసుందర్‌కు యథోచిత గౌరవంజరిగింది. ఇతడిని సాధారణ ఖైదీగా గాక, భారతీ యుల ప్రతినిధిగా చూశారు. ఆతుర్దాతో అనేకమంది భారతీయులు కోర్టుహాలు నిండా మూగారు. రామసుందర్‌కు ఒకనెల విడిఖైదు విధిం చారు. జోహెనెస్ బర్గ్ జైలులోని యూరపియన్ వార్డులోకి ఇతడిని పంపించారు. రామసుందర్‌కు శిక్షచెప్పిన రోజున భారతీయులు అమిత కోలాహలంగా ప్రదర్శనలు జరిపారు.

చివరకు రామసుందర్ చెల్లని నాణెముగా పరిణ మించాడు. అటు జైలు అధికారులు, ఇటు స్వజాతీయులు ఇతడివిషయంలో ఎంతో శ్రద్ధచూపి నప్పటికీ, రామసుందర్‌కు కారాగార శిక్ష అనుభవించడం బహు చిరాకు వేసింది. ట్రాన్స్‌వాల్‌లో తన నివాసానికీ, భారతీయులు ప్రారంభించిన ఉద్యమానికీ ఒక సలాం కొట్టి తప్పుకున్నాడు.

ఇతడి తప్పిదాలను బయటపెట్టాలనే ఉద్దేశంతో నేనీ రామసుందర్ గాథను ప్రస్తావించడంలేదు. ఒక నీతి సూచించ డానికే ఈ ప్రసక్తి తెచ్చాను. నిష్కళంకమైన ఏ ఉద్యమాన్ని సాగించదలచి నప్పటికీ దాని నాయకులు అందులో విధిగా నిష్కళంక యోధులను మాత్రమే చేర్చుకునే టట్లు చూడాలి.

# 28. కారాగారశిక్ష

రామసుందర్‌ను అరెస్టు చేయడంవల్ల ప్రభుత్వానికి ఏ విధమైన ప్రయోజనమూ చేకూరలేదు. మీదుమిక్కిలి భారతీయుల ఉత్సాహం ఆ నాటి కానాడు అతిశయిస్తున్నట్లే ప్రభుత్వానికి కనబడింది. 'ఏషియాటిక్' శాఖోద్యోగులు 'ఇండియన్ ఒపీనియన్' పత్రికను బహుజాగ్రత్తగా చదువుచుండేవాళ్లు. భారతీయులు సాగిస్తున్న ఉద్యమ చరిత్రను యథాతథంగా తెలుసుకోడానికి ఆ పత్రిక ఉద్యోగులకు ఉపయోగపడింది. కొంతమంది నాయకులు యథేచ్ఛగా వున్నంతకాలం, ఉద్యమబలాన్ని అణగదొక్కడం సంభవంకాదని వారికి తోచింది. మేజిస్ట్రేటు ఎదుట హాజరు కావలసిందని కొంతమంది నాయకులకు 1907 క్రిస్మస్ వారంలో నోటీసులు జారీ చేశారు. అన్నరోజుకు—అంటే 1907, డిసెంబరు 28 వ తేదీన—వారందరూ కోర్టుకు హాజరైనారు. చట్టంప్రకారం రిజిస్ట్రేషనుకు దరఖాస్తులు పంపలేదు కాబట్టి, వారందరినీ ఒకగడువులోపుగా ట్రాన్స్‌వాల్‌నుంచి ఖాళీచేసి వెళ్ళిపోవలసిందని మెజిస్ట్రేటు ఎందుకు కోరకూడదో సంజాయిషీ చెప్పుకోవలసిందని నోటీసులలో ఉదహరించారు.

మేజిస్ట్రేటు ఏ కేసు కా కేసు విడిగా విచారించాడు. నలభై ఎనిమిదిగంటల గడువుపెట్టి, ట్రాన్స్‌వాల్‌నుంచి వెళ్ళిపోవలసిందని కొందరికి మేజిస్ట్రేటు ఉత్తర్వుచేశాడు. మరికొందరికి పద్నాలుగు రోజుల వ్యవధి ఇచ్చాడు.

ఇచ్చిన గడువుకాస్తా 1908, జనవరి 10-వ తేదీతో పూర్తిఅయింది. ఉత్తర్వులను ధిక్కరించిన కారణంగా, శిక్ష పొందడానికి కోర్టుకు హాజరుకావలసిందని కూడా అదే రోజున మమ్ములను కోరారు.

మాలో ఎవరమూ 'డిఫెన్స్' పెట్ట దలుచుకోలేదు. గడువులోపుగా ట్రాన్స్‌వాల్ నుంచి ఖాళీచేసి వెళ్ళిపోవలసిందని జారీచేసిన ఉత్తర్వులను ఉల్లంఘించిన నేరాన్ని ఒప్పుకో దలిచాము.

కోర్టువారి ఎదుట వేనొక వాఙ్మూలం ఇవ్వడానికి అనుమతించారు. అందరికంటే నాకు ఎక్కువ శిక్ష విధించవలసిందని మేజిస్ట్రేటును కోరుకున్నాను. మేజిస్ట్రేటు నా కోర్కెను మన్నించలేదు. రెండు నెలల విడి ఖైదు మాత్రమే విధించాడు. ఏ కోర్టులో నేను తరుచూ న్యాయవాదిగా హాజరవు తుండేవాడినో, అదే కోర్టులో ముద్దాయిగా హాజరు కావలసి వచ్చినందుకు కొంచెం నామర్దా వేసినమాటనిజం. న్యాయవాదిగా కంటే ముద్దాయిగా అక్కడ హాజరు కావడమే ఎన్నోరెట్లు గౌరవ ప్రదమైన విషయమని చివరకు మనస్సును కుదటపరుచుకున్నట్లు జ్ఞాపకం. ఖైదీగా బోనెక్కుతున్నందుకు నిజంగా గర్వించాను.

కోర్టుకు కొన్నివందల మంది భారతీయులు వచ్చారు. తోడి న్యాయవాదులు చాలామంది నాకు ఎదురుగానే కూర్చుని వున్నారు. శిక్ష చెప్పగానే, పోలీసుల అధీనంలోకి వెళ్ళవలసి వచ్చింది. అప్పుడుమాత్రం నేను ఒంటరిగానే వున్నాను. ఖైదీలకు ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన బల్లమీద నన్ను కూర్చోపెట్టి, పోలీసు భటుడు తలుపు బిగించి తనదారిన తాను వెళ్లిపోయినాడు. మానసికంగా కొంత ఆందోళన చెందాను. తీవ్ర ఆలోచనలో పడిపోయినాను. నివసించిన ఇల్లు, ప్రాక్టీసుచేసిన కోర్టులు, జరిపిన బహిరంగ సమావేశాలు—ఇవన్నీ ఒక కలమాదిరిగా గతించిపోయినవి. ఇప్పుడు ఖైదీ అయినాను. రెండునెలల కారాగార వాసంలో ఏమి జరుగబోతున్నది? శిక్షాకాలం పూర్తిగా గడుపవలసిందేనా? ప్రజలు తమ మాట మీద నిలబడి అధికంగా కారాగారానికి వచ్చినట్లయితే, పూర్తి శిక్షాకాలం గడుపవలసిన అగత్యం వుండదు. వారు తమ మాట నిలుపుకొనక పోయినట్లయితే, రెండునెలలే ఒక యుగంగాతోచి విసుగు పుట్టేమాటనిజం.

ఈ ఆలోచనలన్నీ నా బుర్రలో గిర్రున తిరగడానికి తృటిపాటు కూడా పట్టలేదు. వీటిని తలుచుకున్న కొద్దీ, నామర్దా ఎక్కువైంది. నేను ఎంత శుద్ధ గర్వపోతునోకదా! అనిపించింది! కారాగారాలను బ్రిటిష్ సార్వభౌముని హోటళ్ళుగా భావించ వలసిందని ప్రజలలో ప్రబోధంచేసింది నేనే. జాతి విభేద శాసన ధిక్కారంవల్ల సంభవించే సర్వబాధలనూ పరమానందంతో ఎంచవలసిందని హితబోధ చేసిందీ నేనే. ఈ శాసనాన్ని ధిక్కరించడంలో ప్రతివారూ తమ సర్వ స్వాన్నీ, చివరకు తమ ప్రాణాలను సైతం త్యాగం చేయడమే మహదానంద కరమైన విషయమని ఉపదేశించిందీ నేనే. ఆ జ్ఞానమంతా ఈ నాడు ఎక్కడికి పోయినట్లు? ఈవిధంగా ఉత్తరక్షణంలోనే మరొక ఆలోచనా పరంపర కూడా తట్టింది. రెండవసారి తోచిన ఆలోచనలన్నీ నా మీద ఒక దివ్యౌషధంవలె పనిచేయ సాగినవి. నా అవివేకం నాకే నవ్వుతెప్పించింది. మిగతవారికి ఏ విధమైన శిక్ష విధిస్తారు? వారినీ నాతోపాటు ఒకే జైలులోనే వుంచుతారా? ఈ విధంగా ఆలోచిస్తుండగానే, పోలీసు ఆఫీసరు వచ్చి తలుపుతెరిచాడు. నన్ను తనవెంట రమ్మన్నాడు. నేను బయలుదేరాను. నన్నే ముందు నడువమన్నాడు. ఆతడు నా వెనుక రావడం మొదలుపెట్టాడు. నాల్గువైపులా మూసివున్న ఖైదీల వాహనం వద్దకు తీసుకువెళ్ళి అందులో కూర్చోవలసిందని నాకు చెప్పాడు. అంతట నన్ను జోహెనెస్ బర్గ్ జైలుకు తీసుకు వెళ్ళారు.

జైలులో నా మామూలు దుస్తులు ధరించడానికి వీల్లేదన్నారు. అధికార్లు నా పూరూ, చిరునామా వ్రాసుకున్నమీదట, విశాలమైన బందిఖానాలోకి తీసుకువెళ్ళారు. నేను అందులో ప్రవేశించిన కొంచంసేపటికే, నవ్వుతూ, కేరింతలు కొడుతూ, నా సహచరులు వచ్చి కలుసుకున్నారు. నాకు విధించిన శిక్షనే తమకు మేజిస్ట్రీటు విధించినట్లు వారు చెప్పారు. నా అరెస్టు అనంతరం జరిగిన విశేషాలను నాకు తెలియజేశారు. ఒకే

జైలులో, ఒకే గదిలో మమ్ముల నందరినీ వుంచినందుకు అందరం సంతోషించాము.



# 29. జైలులో తొలి అనుభవాలు

జైలు గది తలుపు ఆరుగంటలకు తాళంవేశారు. ఆ తలుపుకు ఇనుప బద్దలేవీలేవు. ఐతే గట్టిదే. వెలుతురు రావడానికి గోడ మిటాసాన ఒక కిటికీ మాత్రంవున్నది. మొత్తంమీద మమ్ములను ఒక పెట్టెలో పెట్టినట్లు తోచింది.

ఆ రెండవ రోజునుంచో, మూడవ రోజునుంచో సత్యాగ్రహ ఖైదీలు బహుసంఖ్యాకంగా జైలుకు రావడం మొదలు పెట్టారు. వీరందరూ బుద్ధిపూర్వకంగా అరెస్టయినవాళ్లు. వీరిలో చాలామంది వీధులవెంట తిరిగి సామగ్రి అమ్ముకునే వాళ్ళున్నారు. దక్షిణాఫ్రికాలో ఈ విధంగా అమ్ముకునే తెల్లవారుగాని, నల్లవారుగాని, ముందుగా లైసెన్సులు పొందవలెననే నియమమున్నది. ఆ లైసెన్సులను తమవద్దనే వుంచుకొని, పోలీసులు ఎప్పు డడిగితే అప్పుడు చూపించాలి. అడిగినప్పుడు లైసెన్సుచూపనివాళ్ళని అరెస్టు చేస్తారు. మమ్ములను అరెస్టు చేశారనే వార్త వినగానే కారాగారాలను ఖైదీలతో నింపివేయాలని భారతీయులు తీర్మానించుకున్నారు. ఇందులో వీధులవెంట తిరిగి సామగ్రి అమ్ముకునేవాళ్లు ముందంజవేశారు. వీళ్ళందరూ చాలా సులువుగా అరెస్టయేవాళ్లు. లైసెన్సులు చూపించడం మాని వేయగానే, పోలీసులు ఇట్టే అరెస్టుచేసేవాళ్ళు. ఈ విధంగా ఒకవారం రోజులలో సత్యాగ్రహ ఖైదీల సంఖ్య వంద దాటిపో

యింది. ప్రతిరోజూ తప్పకుండా కొంతమంది కొత్త ఖైదీలు వస్తుండే వాళ్ళు కాబట్టి, ఏ రోజు కా రోజు పత్రిక చూడకుండానే వార్తలు తెలుస్తుండేవి. అరెస్టవుతున్న సత్యాగ్రహుల సంఖ్య ఎక్కువ కాగానే, ఇది కార్లు కఠిన కార్మిక శిక్షకూడా విధించడం ప్రారంభించారు.

జోహెనెస్ బర్గ్ జైలులోని ఖైదీలలో కఠిన కార్మికశిక్షకు గురికానివారికి ఉదయంపూట మొక్కజొన్న గంజి ఇచ్చేవాళ్ళు. దానిలో ఉప్పు వేసేవాళ్ళుకారు. ఐతే, ప్రతిఖైదీకీ విడిగా కొంతఉప్పు ఇచ్చేవాళ్ళు. మధ్యాహ్నం ప్రతి ఖైదీకీ నాల్గు ఔన్సుల బియ్యం వండి అన్నము, నాల్గు ఔన్సుల రొట్టె, ఒక ఔన్సు నెయ్యి, కొంచం ఉప్పు, సాయంత్రం తిరిగి మొక్కజొన్న గంజీ, కొంచం కూర (మామూలుగా బంగాళా దుంపలే : చిన్నవైతే రెండుదుంపలు, పెద్దవైతే ఒకే దుంప) ఇచ్చేవాళ్ళు. ఈ ఆహారం మాలో ఎవరికీ సంతృప్తికరంగా లేక పోయింది. అన్నం బహుమెత్తగా గుజ్జన కూడల్లె వండేవాళ్లు. భారతదేశంలోని కారాగారాలలో ఊరగాయలు ఇస్తారనీ, మాకు కూడా ఏ వైనా ఊరగాయలు ఇప్పించవలసిందనీ జైలు మెడికల్ ఆఫీసరును అడిగాము. "ఇది భారతదేశం కాదు" అని పుల్ల విరిచినట్లు సమాదానం చెప్పాడు. "జైలులో ఇచ్చేఆహారం రుచిగా వుండాలనే నిర్బంధ మేమీలేదు. అందువల్ల ఊరగాయలు ఇవ్వడానికి వీలుపడదు" అని కూడా ఖండితంగా చెప్పివేశాడు. ఇప్పుడిస్తున్న ఆహారంలో కండ పుష్టి కలిగించే పదార్థాలేమీ లేవనీ, పప్పు పదార్థాలు చేర్చవలసిందనీ అడిగాము. "వైద్య సంబంధమైన విషయాలను ఆధారంగా పెట్టుకొని ఖైదీలు వాదించడానికి వీల్లేదు," అని హెచ్చరించాడు. "కండపుష్టి కలిగించే ఆహారాన్ని ఇస్తూనే ఉన్నాము. వారానికి రెండు సార్లు మొక్కజొన్న జావబదులు ఉడకబెట్టిన చిక్కుడు గింజలు పెడుతున్నాము కదా," అన్నాడు. ఇంతకూ మా సౌకర్యాన్ని గురించి శ్రద్ధవహించే ఉద్దేశం ఇతడికి లేదన్నమాట. ఇలా వుండగా, మా ఆహారం

మేమే వండుకోడానికి జైలు సూపర్నెంటు అనుమతి ఇచ్చాడు. తంబి నాయుడిని మా వంటమనిషిగా ఎన్నుకున్నాము. ఆ హోదాలో ఆయన మా తరపున అధికార్లతో అనేకసార్లు పోరాడవలసి వచ్చింది. మాకు ఇచ్చే కూరగాయల రేషను తూకం తక్కువైతే, పూర్తిరేషన్ రావలసిందే నని పట్టుబట్టేవాడు. కూరగాయలు వారానికి రెండుసార్లు మాత్రమే ఇచ్చే వాళ్ళు. ఆ రెండురోజులూ రెండుపూటలా వంటచేసుకునే వాళ్ళము. మిగతారోజులలో ఒకేసారి వండుకునే వాళ్ళము. ఒక్క మధ్యాహ్న భోజనానికి మాత్రం, వాళ్ళు ఇచ్చేపదార్థాలే గాక, మిగతా వాటినికూడా వండుకోడానికి అధికార్లు ఒప్పుకున్నారు. మా వంట మేమే చేసుకోవడం మొదలు పెట్టిన తర్వాత, ఒకవిధంగా మా పరిస్థితి బాగానే వున్నదని చెప్పవచ్చు.

ఈ సౌకర్యాలు లభ్యమైనా, గాకపోయినా, శిక్షా కాలాన్ని పూర్తిగా హాయిగానూ, శాంతంగానూ జైలులో గడప వలెననే మాలో ప్రతి ఒక్కరూ స్థిరంగా సంకల్పించుకొని వున్నారు. సత్యాగ్రహ ఖైదీల సంఖ్య క్రమేపీ 150 వరకూ పెరిగింది.

ఈ విధంగా జైలులో ఒకపక్షం రోజులు గడిపిన తర్వాత, భారతీయులలో రాజీ ఏర్పాటు చేసుకోడానికి ఎంతవరకు అవకాశం వున్నదని ప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు కొత్తగావచ్చిన ఖైదీల ద్వారా తెలిసింది. అంతలోనే జనరల్ స్మట్స్‌తో సంప్రదించడానికి రావలసిందని నాకు పిలుపుకూడా వచ్చింది. భారతీయులలో తగినంత మంది ఐచ్ఛికంగా తమ పేర్లను రిజిస్టరు చేయించుకునే పక్షంలో, జాతి విభేద శాసనాన్ని ఉపసంహరిస్తామనీ, ఖైదీలను విడుదల చేస్తామనీ ప్రభుత్వం ప్రతిపాదించడం జరిగింది. సత్యాగ్రహిని కాబట్టి అట్టి రాజీసూచనను నిరాకరించ లేకపోయినాను. ఖైదీలను విడుదల చేశారు. పరిష్కార షరతులను స్వదేశీయులకు వివరించి చెప్పడం ప్రారంభించాను.

---

# 30. మరువరాని గాథ (i)

ఏకాఏకిన జోహెనెస్ బర్గ్ వెళ్లాను. వెళ్ళినరాత్రే 11 గంటల వేళనో, 12 గంటల వేళనో సమావేశం ఏర్పాటు చేశారు. అవ్యవధిగా అంత అర్ధరాత్రివేళ జరుగు తున్నప్పటికీ, ఆ సమావేశానికి దాదాపు వెయ్యి మంది ప్రేక్షకులు వచ్చారు. ఇద్దరు పఠానులు తప్ప సభకు వచ్చినవారందరూ నేను ప్రభుత్వంతో చేసుకున్న పరిష్కారాన్ని ఆమోదించారు. ఐచ్ఛికంగానే అయినప్పటికీ, వేలి ముద్రలు ఇవ్వడం సబబైన విషయం కాదని ఆ పఠానుల వాదన.

1908, ఫిబ్రవరి 10-వ తేదీన మాలో కొంతమందిమి వెళ్లి రిజిస్ట్రేషను సర్టిఫికెట్లు తెచ్చుకోడానికి తయారైనాము. అందరూ వెళ్ళి త్వరగా రిజస్ట్రేషన్ పని పూర్తిచేసుకోవడం ఎంత అత్యవసరమో భారతీయులకు సమగ్రంగా ఎరుక పరిచాము. నాయకులైన వారే ముందుగావెళ్ళి తమ సర్టిఫికెట్లను తీసుకోవాలనే ఏర్పాటు కూడా జరిగింది. ఇలా చేస్తే చాలామందికి సందేహ నివృత్తికావచ్చుననీ, ప్రభుత్వోద్యోగులు తమ విద్యుక్త ధర్మాలను సక్రమంగా, సమర్యాదగా నిర్వర్తిస్తారో లేదో తెలుసుకోవచ్చుననీ, ప్రభుత్వ ఏర్పాట్లపై కన్ను వేసి వుండడానికి వీలవుతుంది కదా అనీ ఉద్దేశించాము.

నా కార్యాలయమూ సత్యాగ్రహ సంఘకార్యాలయమూ ఒకటే. నేను నా ఆఫీసుకు వెళ్ళేసరికి మీర్ ఆలం అనే ఒకపఠాన్ కొంతమంది మిత్రులతో భవనానికి వెలుపల నిలుచుని వున్నాడు. ఇతడు నా పాత క్లయింట్లలో ఒకడు. తన వ్యవహారాలలో ఇతడు తరుచూ నా సలహా పొందుతుండేవాడు. ఆరడుగుల ఎత్తుగల మంచి జవాను. బలిష్టమైన కాయంగలవాడు. నేను ఇతడిని నా కార్యాలయానికి వెలుపల చూడడం అదే మొదటి

సారి. అంతకు పూర్వం ఎప్పుడువచ్చినా, లోపలికే వచ్చేవాడు. ఉభయులం ఒకరి నొకరం చూసుకున్నాము. కాని, మీర్ అలామ్ ఆ రోజునాకు సలాం చేయడం మానివేశాడు. ముందు నా అంతట నేనే నమస్కారం చేసాను. అంతట అతడూ 'శాల్యూట్' చేశాడు. మామూలుగానే, "ఎలా వున్నావు?" అని కుశల ప్రశ్న వేశాను. కులాసాగానే వున్నానని అతడు బదులు చెప్పినట్లు గుర్తు. కాని, అతడి ముఖంలో సాధారణంగా కనబడే మందహాసం ఆ రోజు కనబడలేదు. అతడు కోపంగా చూస్తున్నట్లు గమనించి, మనస్సులో వుంచుకున్నాను. ఆ రోజు ఏదో జరుగబోతున్న దనే తోచింది. కార్యాలయంలోకి వెళ్ళిపోయినాను. అంతలో ఛైర్మన్ ఈ సఫ్ మియాన్, ఇతరమిత్రులు వచ్చారు ఏషియాటిక్ శాఖ కార్యాలయానికి బయలుదేరాము. మీర్ అలాం, అతడి సహచరులు కూడా మా వెంట వచ్చారు

రిజిస్ట్రేషన్ కార్యాలయం ఫాన్ బ్రాండిస్ చౌకులోవున్నది. నా కార్యాలయానికీ దానికీ దూరం ఒకమైలుకు తక్కువగా వుంటుంది. ఏషియాటిక్ కార్యాలయానికి వెళ్ళవలెనంటే పెద్ద బజార్లగుండా వెళ్ళాలి. ఫాన్ బ్రాండిస్ వీధిగుండా వెళ్ళుతున్నాము. అర్నాట్ గిబ్సన్ కంపెనీ భవనానికి వెలుపల వున్నాము. రిజిస్ట్రేషన్ కార్యాలయాన్ని చేరడానికి ఇక మూడునిమిషాలు కూడా పట్టదు. మీర్ అలాం నాకు అడ్డువచ్చి, "ఎక్కడికి పోతున్నావ్?" అని ప్రశ్నించాడు.

"పదివేళ్ళ ముద్రలూవేసి రిజిస్ట్రేషన్ సర్టిఫికెటు తెచ్చుకోడానికి పోతున్నాను," అన్నాను. "నీవు నాతో వచ్చినట్లయితే రెండు బొటన వ్రేళ్ళ ముద్రలతోనే సరిపెట్టి, ముందుగానే నీకూ సర్టిఫికెటు ఇప్పిస్తాను; నీ సర్టిఫికెటు నీకు ఇప్పించిన తర్వాతనే, వేలిముద్రలువేసి నా సర్టిఫికెటు నేను తీసుకుంటాను," అని కూడా అతడికి చెప్పాను.

ఆఖరు వాక్యం ముగించానో, లేదో వెనుక వైపునుంచి దుడ్డు

కర్రతో నా తలమీద తపీమని దెబ్బపడ్డది. "హా! రామా!!" అంటూ వెంటనే స్పృహతప్పి పడిపోయినాను. ఆ తర్వాత ఏమిజరిగిందో నాకు తెలియదు. మీర్ అలాం, అతడి అనుచరులుమాత్రం ఇంకా కొన్ని దెబ్బలుకొట్టి, నన్ను తన్నారు. ఆ అలజడి విని దారిన పోతున్న కొంతమంది యూరపియనులు అక్కడికి వచ్చారు మీర్ అలాం, అతడి అనుచరులు పారి పోయినప్పటికీ, వారిని యూరపియనులు పట్టుకో గలిగారు. అంతలో పోలీసులు వచ్చి, వారిని వశపరుచుకున్నారు. పడివున్న నన్ను జే. సి. గిబ్సన్ ప్రైవేట్ ఆఫీసుకు మోసుకు వెళ్ళారు. కొంత సేపటికి స్పృహ వచ్చింది. మిత్రుడు డోక్ నా ముఖంమీదికి వంగి, "ఎలాఉన్నారు?" అని అడిగాడు. "బాగానే ఉన్నాను. కాని పళ్ళలోనూ, పక్కఎముకల లోనూ బాధగావున్నది! అది సరే! మీర్ అలాం ఎక్కడున్నాడు?" అన్నాను.

"మిగతా వాళ్ళతోపాటు అతడినీ అరెస్టుచేశారు" అన్నారు డోక్‌గారు

"వాళ్ళను తక్షణమే విడుదల చేయాలి," అన్నాను

"సరే బాగానేవుంది; ఆ విషయం అలావుంచండి. మీరు ఇప్పుడు ఒక అపరిచయస్థుడి ఆఫీసులో వున్నారు. మీ పెదిమ, బుగ్గ బాగా చీలుకు పోయినవి. మిమ్ములను ఆసుపత్రికి చేరవేయడానికి పోలీసులు వచ్చి వున్నారు. ఆసుపత్రికి వెళ్ళకుండా మా ఇంటికి వచ్చినట్లయితే నా భార్యా, నేనూ ఇద్దరమూ మా శక్తికొద్దీ మీకు సపర్య చేస్తాము" అన్నాడు డోక్

"అలాగైతే, మీ ఇంటికేవస్తాను. సహాయపడడానికి వచ్చినందుకు పోలీసులకు కృతజ్ఞత చెప్పండి. మీ ఇంటికి వస్తున్నాననే కబురుకూడా తెలియజేయండి" అన్నాను.

ఏషియాటిక్ ప్రజల రిజస్ట్రారు చామ్నీకూడా ఇంతలో అక్కడికి

వచ్చారు. డోక్ అనే అతడు క్రిష్టియన్ మతప్రచారకుడు. ఇతడి నివాసం స్మిట్ వీధిలో. బండిలో వేసుకొని నన్ను అక్కడికి తీసుకు వెళ్ళారు. డాక్టరును పిలిపించారు. బండెక్కి బయలుదేరడానికి పూర్వం చామ్నీతో ఇలా అన్నాను—"మీ ఆఫీసుకువచ్చి, పదివేళ్ళ ముద్రలూ వేసి అందరి కంటే ముందుగా నా రిజిస్ట్రేషన్ సర్టిఫికెటును తీసుకుందామని బయలు దేరాను. కాని నే నొకటి తలిస్తే దేవుడు మరొకటి తలిచాడు. ఆ కాగితా లను ఇక్కడికే తెప్పించి వెంటనే నా పేరు రిజస్టరు చేసుకునే అవకాశం ఇవ్వవలసిందని వేడుకుంటున్నాను నా కంటే ముందు మరెవరూ తమ పేర్లు రిజస్టరు చేసుకోకుండా చూడండి."

"ఇప్పుడు దాని తొందరేమివచ్చింది ? త్వరలోనే డాక్టరు వస్తాడు ఇక్కడికి. దయచేసి విశ్రాంతి తీసుకోండి. పరిస్థితి అంతా అదే కుదట బడుతుంది. రిజిస్ట్రేషన్ పట్టీలో మీ పేరునే అన్నిటికంటే పైనవ్రాసి మిగతా వారందరికీ సర్టిఫికెట్లు ఇచ్చి వేస్తాను," అన్నాడు చామ్నీ.

"అది పనికిరాదు. ఈ బొందిలో ప్రాణం వున్నంతవరకూ, భగవ దేచ్ఛ లభ్యమైనంత వరకూ మున్ముందుగా సర్టిఫికెటును నేనే తీసుకుంటా నని ప్రమాణం చేసివున్నాను. అందువల్ల వున్నవారు వున్నట్లే ఆ కాగితా లను ఇక్కడికి తెప్పించండి," అన్నాను. అంతట చామ్నీ ఆ కాగితాలను అక్కడికే తెప్పించాడు.

నాపై జరిగిన దొమ్మికి మీర్ ఆలాంను గాని, తదితరులను గాని నేను నేరస్థులగా ఎంచననీ, వారిని ప్రాసిక్యూట్ చేయించాలని నేను కోర లేదనీ, నా కోర్కెను పాటించి వారిని విడుదలచేయు వలసిందనీ, అటార్నీ జనరల్‌కు తంతి వార్త ఇచ్చాను. అంతట మీర్ ఆలాంను, మిగతవారిని విడుదలచేశారు ఐతే, జోహెనెస్ బర్గ్‌లోని యూరపియ నులు అటార్నీజనరల్‌కు ఘాటైన ఉత్తరంఒకటి వ్రాశారు. నేరస్థులకు శిక్ష విధించే విషయంలో గాంధి వ్యక్తిగత అభిప్రాయాలు ఏ విధంగా

వున్నప్పటికీ, వాటిని దక్షిణాఫ్రికాలో అమలు జరపడానికి మాత్రం వీల్లే దని ఈ ఉత్తరంలో తెలియజేశారు. 'గాంధి తనంతటతాను దొమ్మిదార్లపై ఏ విధమైన చర్యనూ తీసుకొనక పోవచ్చు. కాని ఈ దొమ్మి గాంధిపై ఏ రహస్య ప్రాంతంలోనో జరిగింది కాదు; రహదారిలో బహిరంగంగానే జరిగింది. కాబట్టి, దీన్ని బాహాటంగా జరిగిన నేరంగానే ఎంచక తప్పదు, అని కూడా ఉత్తరం వ్రాశారు. చాలామంది ఇంగ్లీషువారు సాక్ష్యం చెప్పడా నికి కూడా సిద్ధమైనారు. నేరస్థులను ప్రాసిక్యూట్ చేయక తప్పదన్నారు. ఈ లేఖను చూసిన తర్వాత మీర్ అలాంను, అతడి అనుచరులలో ఒకడినీ అటార్నీ జనరల్ తిరిగి అరెస్టు చేయించాడు. వారిద్దరికీ చెరిఒక మూడు నెలల కఠిన కార్మిక శిక్ష విధించారు. సాక్ష్యం చెప్పడానికి నాకు సమనే రాలేదు.

---

# 31. మరువరాని గాథ (ii)

తిరిగి రోగిగది సంగతికి వద్దాము. డాక్టర్ త్వెయిట్స్ వచ్చి నన్ను పరీక్షచేశాడు. పై పెదవిమీద తగిలిన గాయాలను కుట్టివేశాడు. పక్క ఎముకలకు రాయడానికి ఏదో మందు వ్రాసిఇచ్చి. పెదిమమీద వేసిన కుట్లు విప్పదీసేవరకూ మాట్లాడ కూడదని ఆజ్ఞాపించాడు.

మాట్లాడడానికి వీల్లేక పోయినప్పటికీ నా చేతులు మాత్రం స్వేచ్ఛ గానే వున్నవి. నా పరిస్థితిని భారతీయులకు తెలియజేసే ఉద్దేశంతో ఈ క్రింది చిన్న లేఖవ్రాసి ఛైర్మన్‌ద్వారా దాన్ని ప్రచురణకు పంపించాను — "డోక్ దంపతులు నన్ను నా సోదరుడివలె, సోదరివలె చూస్తున్నారు. కులాసాగానే వున్నాను. త్వరలోనే నావిధులను నేను నిర్వర్తించగలనని

ఆశిస్తున్నాను. మీర్ అలాం, అతనిమిత్రులు తాము ఏమిచేస్తున్నదీ తెలియకుండానే ఇంతపనీచేశారు. నేను తప్పుచేస్తున్నట్లు వారు భావించారు. తమకు తెలిసిన ఒకే ఒక పద్ధతిలో నా మీద వారు కసితీర్చుకున్నారు. అందువల్ల వారిపై ఏ విధంగానూ చర్య జరపవద్దని కోరుతున్నాను. ఏ మహమ్మదీయుడో, లేక, మహమ్మదీయులో నాపై దొమ్మి జరిపారనే కారణంగా హిందువుల మనస్సుకు బహుశాబాధ కలుగవచ్చు. హిందువులు నిజంగా బాధపడి నట్లయితే, ప్రపంచ సాక్షిగా, ఆ భగవంతుడు సాక్షిగా తప్పు చేస్తున్నారని చెప్పవలసి వుంటుంది. ఈ రక్తధార హిందూ, ముస్లిం తెగలు రెంటికీ స్నేహబంధంగా పరిణమించాలి; ఇదే నా హృదయ పూర్వక ప్రార్థన. భగవంతుడు ఇట్టి స్నేహబంధాన్ని చేకూర్చు గాక! ఈ దొమ్మి జరగక పూర్వం ఏ సలహా ఇచ్చానో, ఇప్పుడూ అదే సలహా ఇస్తున్నాను. ఆసియా జాతులవారిలో అధిక సంఖ్యాకులు వెళ్ళి వేలిముద్రలు వేయాలన్నదే ఈ సలహా. అంతరాత్మ సంబంధమైన ఆక్షేపణలేవైనా వున్నట్లయితే, ప్రభుత్వం అట్టివారిని మినహాయించి ప్రత్యేక అనుమతి ఇస్తుంది. ఇంతకుమించి మనం ప్రత్యేక సౌకర్యాలు కోరినప్పటికీ, అది కుర్రతనపు చేష్టే కాగలదు. సత్యాగ్రహ పరమార్థాన్ని సవ్యంగా అవగాహన చేసుకున్నట్లయితే, ప్రజలు ఒక్క భగవంతుడికి తప్ప ఇతరులెవరికీ భయపడవలసిన అగత్యంలేదు. కాబట్టి, శాంత మనస్కులైన భారతీయులందరూ లేనిపోని పిరికితనాన్ని పెట్టుకోరాదు. తమ విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చడంలో వెనుకాడ కూడదు. శాసనాన్ని రద్దుచేస్తామని వాగ్దానం చేశారు కాబట్టి, సన్మార్గుడైన ప్రతి భారతీయుడు అటు ప్రభుత్వానికీ, ఇటు వలస వచ్చినవారికీ సహాయపడడం తన పవిత్రధర్మంగా భావించాలి."

నేను ఇది వ్రాస్తూండగానే చామ్నీ కాగితాలు తీసుకొనివచ్చాడు. అతి నీరసంగా వున్నప్పటికీ, ఏదో విధంగా కాగితాలమీద వేలి ముద్రలు వేయడం పూర్తిచేశాను. ఇదంతా చూస్తున్న చామ్నీ కన్నీరు కార్చడం

గమనించాను. ఇతడి చర్యలను అంతకు పూర్వం అనేకసార్లు ఖండించి వున్నాను. మానవ హృదయాన్ని కొన్ని సంఘటనలు ఎంత సరల మార్గానికి తిప్పగలవో నాకు ఇందువల్ల విదర్శన పూర్వకంగా తెలిసింది.

నేను పూర్తిగా విశ్రాంతి తీసుకోవాలనీ, ప్రశాంతంగా వుండాలనీ డోక్, ఆయనసతి ఆతుర్దా పడసాగారు. దెబ్బలు తగిలిన తర్వాతకూడా నేను మానసికంగా శ్రమపడడం చూసి వారు బాధపడడం మొదలుపెట్టారు. నేను పునరారోగ్యం పొందడానికి ఏ ప్రతి బంధకం ఏర్పడుతుందో నన్నదే వారి బెంగ. అందువల్ల నా పక్కదగ్గర ఎవరూలేకుండా అందరినీ పంపించివేశారు. ఏ వ్రాతపనీ పెట్టుకోవద్దనీ, ఏమీ చేయవద్దనీ నాకు హితవుచెప్పారు. కాగితంమీద వ్రాసి చూపించి ఆ దంపతులను ఒక్క కోరికమాత్రం కోరుకున్నాను. వారికి ఆలివ్ అనే చిన్నకుమార్తె వున్నది. నాకు విశ్రాంతి కలిగించడానికి నా అభిమాన ఆంగ్లశ్లోకమైన "లీడ్ కైండ్లీలైట్" అనే దాన్ని ఆమెచేత పాడించి, వినిపించవలసిందని కోరాను. డోక్ నా అభీష్టానికి వెంటనే అంగీకరించాడు. ఆ దృశ్యమంతా కళ్ళకు కట్టినట్లు ఇప్పటికీ గోచరిస్తుంది. ఆలివ్ రహస్యంగా వచ్చి తలుపువద్ద నిలుచుని, అతి మృదువుగా ఆ గీతం పాడి వినిపించేది. తలుచుకుంటే ఆమె శ్రావ్యగానం ఇప్పటికీ నా చెవులలో ప్రతి ధ్వనిస్తుంది.

---

# 32. సత్యాగ్రహ పునరారంభం

ట్రాన్స్‌వాల్ ప్రభుత్వానికి సంతృప్తి కలిగించే ధోరణిలో భారతీయులు ఐచ్ఛికంగానే తమ పేర్లను ఏ విధంగా రిజిస్టరు చేసుకున్నదీ మనం గత అధ్యాయంలో తెలుసుకున్నాము. 'బ్లాక్ ఆక్'ను ప్రభుత్వంవారు ఇకరద్దు చేయవలసివున్న దన్నమాట. ఆ చట్టాన్ని తమ మాటప్రకారం

రద్దు చేసినట్లయితే, అంతటితో సత్యాగ్రహం సమాప్త మవుతుంది. చట్టాన్ని రద్దుచేయకుండానే, జనరల్ స్మట్స్ మరొక చర్యద్వారా కొత్త పద్ధతి అవలంబించాడు. "స్టాట్యూట్ బుక్"లో చట్టాన్ని యథాప్రకారంగావుంచి, ఐచ్ఛికంగా జరిగిన రిజిస్ట్రేషన్లను ఆమోదిస్తూ పార్లమెంటులో ఒక బిల్లు ప్రతిపాదించాడు. ఏషియాటిక్ తెగల రిజిస్ట్రేషన్‌కు ఆయన ఆ విధంగా కొత్తఏర్పాటు ఒకటి చేశాడన్నమాట. ఆ బిల్లు చదివి నేను విశ్చేష్టుడనై పోయినాను.

జనరల్ స్మట్స్‌కు అంతట ఒక లేఖవ్రాశాను. ఐతే, చిక్కుప్రశ్నలకు రాజకీయవేత్తలు అసలు సమాధానాలే ఇవ్వరుగదా ! అధవా ఇచ్చినా ఏవేవో అతికీ, అతకని డొంకతిరుగుడు సమాధానాలు ఇస్తారు.

ట్రాన్స్‌వాల్ ప్రభుత్వానికి కూడా మా తీవ్ర భావాలను పొందుపరుస్తూ ఈ కిందివిధంగా ఒక లేఖవ్రాశాము—"ముందు అనుకున్న షరతుల ప్రకారం "ఏషియాటిక్ ఆక్ట్"ను రద్దుచేయని పక్షంలోనూ, ప్రభుత్వంవారు ఈ విషయంలో తమ నిర్ణయాన్ని నిర్ణీతమైన తేదీలోపుగా భారతీయులకు తెలియజేయని పక్షంలోనూ, ఇప్పటివరకూ భారతీయులు పొందిన సర్టిఫికెట్లన్నిటినీ తగులబెట్టి వేయడమవుతుంది. వినమ్రులమై, స్థిరచిత్తంతో ముమ్ముందు రానున్న ఫలితాలన్నిటినీ ఎదుర్కొంటాము."

కొత్తబిల్లును శాసన సభలో ఏ తేదీన ఆమోదించ దలిచారో, మేము ఇచ్చిన అంత్య సందేశంకూడా ఆ తేదీనే ఆఖరవుతుంది. అంత్య సందేశపు గడువుతీరిన రెండుగంటలకు బహిరంగంగా సర్టిఫికెట్లన్నిటినీ దహనం చేయడానికి సమావేశం ఒకటి ఏర్పాటుచేశాము. ఒకవేళ ఆఖరు క్షణంలో తలవని తలంపుగా ప్రభుత్వం అనుకూల సమాధానాన్ని అందజేసినప్పటికీ, ఈ సమావేశం నిరుపయోగం కాజాలదని సత్యాగ్రహ కమిటీ అభిప్రాయపడ్డది. ప్రభుత్వం అనుకూల సమాధానాన్ని పంపించడమే

జరిగితే, దాన్ని భారతీయులకు తెలియజేయడానికైనా ఈ సమావేశం ఉపయోగ పడుతుందని కమిటీ ఉద్దేశం.

సమావేశ కార్యక్రమాన్ని ఉపక్రమించ బోతూవుండగా, ప్రభుత్వం పంపిన తంతివార్త తీసుకుని సైకులుమీద ఒక వాలంటీరు సభాస్థలికి వచ్చాడు. భారతీయులు చేసిన క్రొత్తనిర్ణయంపట్ల ప్రభుత్వం వారు ఆ తంతివార్తలో తమ విచారాన్ని తెలియజేశారు. ప్రభుత్వం తా నవలంబించ దలచిన వైఖరిని మార్చుకో జాలదని కూడా స్పష్టీకరించారు. ఆ తంతి వార్తను ప్రేక్షకులకు చదివి వినిపించాము. హర్షధ్వనులు చేస్తూ, వారు దాన్ని విన్నారు. ఎలాగైతేనేమి, తమ సర్టిఫికెట్లను దహనం చేసే శుభావకాశం జారిపోనందుకు సంతోషిస్తున్నారేమో నన్నట్లుగా ప్రేక్షకులు హర్షధ్వనులు చేశారు.

సమావేశం ప్రారంభమైంది. అధ్యక్షుడు పరిస్థితి నంతటినీ చక్కగా విశద పరిచి, సభికులలో జాగృతిని కలిగించాడు. యథోచిత తీర్మానాలు జరిగినవి.

దహనం నిమిత్తం కమిటీ వారికి అప్పటికే 2,000 లకు పైగా సర్టిఫికెట్లు వచ్చినవి. వాటన్నిటినీ 'పారఫిన్'లో తడిపి ఒక పెద్ద కాగులో పడవేసి, నిప్పు అంటించాము. సభికులందరూ లేచి నిలుచున్నారు. సర్టిఫికెట్లు భస్మీపటల మవుతుండగా చూసి, తమ హర్షధ్వానులతో సభాస్థలి మార్మోగేటట్లు చేశారు. అప్పటివరకూ తమసర్టిఫికెట్లను పంపనివారు వాటిని వేదిక వద్దకు తెచ్చి, కాగులో పడవేశారు.

సమావేశానికి హాజరైన పత్రికా విలేఖరులకు ఆ దృశ్యం ఎంతో అద్భుతమై తోచింది. సమావేశ విశేషా లన్నిటినీ తమతమ పత్రికలలో కళ్ళకు కట్టినట్లుగా వర్ణించారు.

'బ్లాక్ ఆక్ట్'ను ఆమోదించిన 1907 సంవత్సరంలోనే, జనరల్ స్మట్స్ 'ట్రాన్స్‌వాల్ ఇమిగ్రేషన్ రెస్ట్రిక్షన్ బిల్లు' అనే మరొక దాన్ని

కూడా శాసన సభలో ప్యాస్ చేయించాడు. కొత్తభారతీయు డెవడూ ట్రాన్స్వాల్‌లో ప్రవేశించ కూడదని ఈ బిల్లు పరోక్షంగా నిషేధించింది.

తమ హక్కుల విషయంలో ఏర్పడిన ఈ కొత్త అక్రమాన్ని భారతీయులు ప్రతిఘటించడం అత్యావసరమైంది. ఆ మరుసటి రెండు సంవత్సరాలలోనూ అనేకమంది సత్యాగ్రహులు తమంత తామే నెటాల్‌నుంచి వచ్చి ట్రాన్స్వాల్‌లో ప్రవేశించడం ప్రారంభించారు. నెటాల్, ట్రాన్స్వాల్ రెండూ పక్కపక్కనే వున్న రాష్ట్రాలు. ఈ విధంగా రాసాగిన సత్యాగ్రహుల నందరినీ సరిహద్దు పట్టణమైన వోక్స్ రస్ట్‌లో అధికారులు ఖైదుచేయడం మొదలుపెట్టారు. అరెస్టయిన నెటాల్ వాసులను కలుసుకోవాలనే ఉద్దేశంతో. తమ సర్టిఫికెట్లను దహనం చేసిన అనేకమంది ఉత్సాహపరులు (ట్రాన్స్వాల్ వాసులు) వీధులలో తిరిగి కూరగాయలమ్మడం ప్రారంభించారు. వీధులలో కూరగాయలు అమ్మడానికి లైసెన్సులు అవసరమనే విషయం తెలిసిందే. అవి లేని కారణంచేత వారూ అరెస్టయినారు. వోక్స్ రస్ట్ జైలులో ఒకప్పుడు డెబ్భదిఐదు మంది భారతీయ ఖైదీలు చేరారు. కారాగార శిక్షకు సైతం వెరవకుండా సత్యాగ్రహులు పట్టుదల చూపుతున్నందుకు ప్రభుత్వానికే చిరాకు కలిగింది. ఆ కారణంచేత, నేరస్థులను జైళ్ళకు పంపడానికి బదులు దేశాంతరం పంపడం ప్రారంభించింది. ఇందువల్ల కొంతమంది భారతీయులు వెనకడుగువేసి నప్పటికీ, అనేకమంది ధైర్య స్థైర్యాలతో ఉత్సాహ భరితులై ముందుకువచ్చి, సమరం సాగించారు.

# 33. టాల్‌స్టాయ్ కేంద్రం

జైలుకు వెళ్ళుతున్న వారి కుటుంబాలను రొఖ్ఖరూపంలో ప్రతి నెలా అలవెన్సులు ఇచ్చి ఇప్పటివరకూ (1910) పోషిస్తూ వచ్చాము. ఈ పద్ధతి అసంతృప్తికరంగానూ, ప్రజాధనాన్ని వృధావ్యయం చేయడం గానూ కనబడింది. ఎప్పుడూ జైళ్ళకు వెళ్ళేవాళ్ళు జైళ్ళనుంచి అప్పుడప్పుడు తిరిగివస్తే, ఎక్కడ తలదాచుకోవడం? వాళ్ళ నెవరూ ఉద్యోగంలో కూడా పెట్టుకోరయ్యె। ఈ రెండు చిక్కులనూ పరిష్కరించుకోడానికి గత్యంతరం ఒకటే. సత్యాగ్రహులు, వారి సంసారాలు కలసి సహకార పద్ధతిమీద ఏక కుటుంబంగా వుండడమే ఈ గత్యంతరం.

కాలెంబాచ్ అనే జర్మన్‌శిల్పి నా ఆప్త మిత్రుడు. ఇతడు ఉదార స్వభావంతో 1100 ఎకరాల విస్తీర్ణంగల భూమిని ఉచితంగా మాకు ఇచ్చాడు.

ఈ భూమిలో దాదాపు వెయ్యి ఫల వృక్షాలు వున్నవి, ఒక కొండ దిగువనే ఒక చిన్నఇల్లుకూడా వున్నది. ఆ ఇంటిలో అరడజనుమంది కాపురంచేయువచ్చు. నీటి సప్లయికి రెండుబావులూ, ఒక చెలమా వున్నవి. ఈ వ్యవసాయ కేంద్రానికి అతి సమీపంలోనే వున్న రైలుస్టేషను పట్టణం లాలీ. రైలుస్టేషనుకూ, ఈ కేంద్రానికీ దూరం ఇంచుమించు ఒకమైలు వుంటుంది. జోహెనెస్‌బర్గ్‌కూ దీనికీ దూరం ఇరవై ఒక్క మైళ్ళు. ఈ క్షేత్రంలో ఇళ్ళుకట్టడానికీ, ఆ ఇళ్ళలో సత్యాగ్రహుల కుటుంబాలకు నివాసం ఏర్పాటు చేయడానికీ నిర్ణయించాము. నారింజపండ్లు, ఆప్రికాట్లు, ప్లములు ఇక్కడ పుష్కలంగా వుండేవి. ఏ ఋతువులో పండే పండ్లను ఆ ఋతువులో సత్యాగ్రహులు పొట్టపట్టి నన్నితినగా, ఇంకా బోలెడన్ని మిగిలేవి. నీటి చెలమకూ, మేమున్న ఇంటికీ 500 గజాల దూరం వుండేది.

ఇంటి పనులలోగాని, వ్యవసాయపు పనులలోగాని, కట్టడపు పనులలో గాని నౌకర్లను, కూలీలను పెట్టకూడదని పట్టుదల వహించాము. వంట చేయడం మొదలు వీధులు ఊడ్చే పనివరకూ స్వయంగా మేమే చేసుకునే వాళ్ళము. స్త్రీజన మందరినీ ప్రత్యేకించి ఒకచోట వుంచడం మంచిదని మొదటనే తీర్మానించుకున్నాము. అందువల్ల ఇళ్ళను రెండు వరసలుగా ఒకదానికొకటి దూరంగా కట్టవలసి వచ్చింది ప్రస్తుతానికి పదిమంది స్త్రీలకు, అరవై మంది పురుషులకు నెలవు ఏర్పాటు చేస్తే చాలుననిపించింది. మిత్రుడు కొలెంబాచ్‌కి ప్రత్యేకించి ఒక ఇల్లు, దానిపక్కనే పాఠశాల నిమిత్తం మరొకఇల్లు వేయవలసి వచ్చింది. అక్కడే వడ్రంగానికీ, చెప్పులు కుట్టడానికీ కూడా కర్మాగారాన్ని ఏర్పాటు చేశాము.

ఈ కేంద్రంలో గుజరాతువారు, తమిళులు, ఆంధ్రులు ఉత్తరహిందూస్థానపువారు నివసిస్తుండేవాళ్లు. అంటే, వీరిలో హిందువులు, క్రిస్టియనులు, ముస్లిములు, పార్సీలుకూడా వుండేవాళ్ళన్న మాట. వీరిలో నలభై మంది యువకులు. ఇద్దరు ముగ్గురు వయస్సు చెల్లిన మొగవారు. ఐదుగురు ఆడవారు, ఇరవై లేక ముప్ఫయిమంది బాలబాలికలు (వీరిలో నల్గురైదుగురు బాలికలు) వుండేవాళ్ళు.

ఈ టాల్‌స్టాయి కేంద్రంలో దుర్బలులు దృఢకాయులైనారు. కాయకష్టం చేయడం అందరికీ దివ్యౌషధం వలె పనిచేసింది.

ప్రతిఒక్కరూ తరుచూ జోహెనెస్‌బర్గ్ వెళ్ళి రావాలని కుతూహలం పడుతుండేవాళ్ళు. పిల్లలు కేవలం వేడుకకోసం అక్కడికి వెళ్ళాలని ఉబలాట పడేవాళ్ళు. నేను పనిమీద వెళ్ళవలసి వస్తుండేది. అందరికీ అవసరమైన పని ఏదైనావుంటేనే అక్కడికి రైలుమీద ప్రయాణం చేయాలనే నియమం పెట్టుకున్నాము. అదీ మూడవతరగతిలోనే ప్రయాణం చేయాలి. కేవలం కులాసాకు వెళ్ళదలుచుకున్న వాళ్ళు నడిచి పోవలసిందే. టాల్‌స్టాయ్ కేంద్రంలో తయారైన సరుకు జోహెనెస్‌బర్గ్‌లో అమ్మకానికి

తీసుకువెళ్ళాలనే నియమాన్ని కూడా పెట్టుకున్నాము. నగరంలో భోజనం నిమిత్తం ఎవరూ ఒకదమ్మిడీ ఖర్చుపెట్టడానికి వీల్లేదు. ఇన్ని కఠిన నియమాలను పెట్టుకొనక పోయినట్లయితే పల్లెవాసంవల్ల ఆదాచేసిన డబ్బు కొంచమూ రైలుఖర్చుల కిందా, హోటలు ఖర్చులకిందా సమర్పించుకోవలసి వచ్చేదే. జోహెనెస్‌బర్గ్ వెళ్ళుతూ బహుస్వల్ప విలువగల ఆహార పదార్థాలను మాత్రమే దారిభత్యానికి తీసుకు వెళ్ళేవాళ్ళం. ఇంట్లోనే ముడి పిండితో తయారుచేసిన రొట్టె, వేరుశనగపిండి పాకం, ఇంట్లోవండిన మిఠాయి తీసుకు వెళ్ళేవాళ్ళం. ఇంట్లోనే పిండిమర ఒక ఇనుపది వుండేది. కాబట్టి, గోధుమపిండి మేమే తయారు చేసుకునే వాళ్ళము. వేరుశనగ పప్పు ఉడికించి పిండి రుబ్బి, అదొక రకమైన వెన్నగా ఉపయోగిస్తుండే వాళ్ళం. మామూలు వెన్నకంటే ఈ వేరుశనగ పిండితో తయారుచేసిన వెన్న నాల్గోవంతు ధరకే గిట్టుబాటయేది. ఇక నారింజపండ్ల విషయం చెప్ప నవసరంలేదు. పుష్కలంగా వుండనే వున్నవి. ఆవుపాలు ఉపయోగించేవాళ్ళము కాదు; మామూలుగా డబ్బాపాలే ఉపయోగించే వాళ్ళము.

ఎవరైనప్పటికీ, జోహెనెస్ బర్గ్‌కు వారంలో ఒకటి రెండుసార్లు మాత్రమే కాలినడకన వెళ్ళి, కాలినడకన రావడం జరిగేది. వెళ్ళిన రోజునే తిరిగి వస్తుండే వాళ్ళము. ఇరవై ఒక్కమైళ్ళు రానూ, ఇరవై ఒక్కమైళ్ళు పోనూ, అని లోగడే చెప్పివున్నాను. కాలినడకనే వెళ్ళాలనే నియమం వల్ల కొన్నివందల రూపాయలు ఆదాచేసి వుంటాము. కాలినడకన వెళ్ళిరావడం వల్ల ఇతర విధంగా కూడా ఎంతోప్రయోజనం చేకూరింది. కొంతమందికి కొత్తగా కాలినడక అభ్యాసమైంది. జోహెనెస్ బర్గ్‌కు వెళ్ళదలుచు కున్నవాడు రాత్రి రెండుగంటలకే నిద్రలేచి, రెండున్నరకల్లా బయలుదేరడం పద్ధతైంది. ఆరు లేక ఏడుగంటలు నడిస్తే జోహెనెస్ బర్గ్ చేరుతాడు. బాగా కాలికొద్దీ నడిచినట్లయితే, జోహెనెస్ బర్గ్ 4 గంటల 18 నిమిషాలలో చేరవచ్చునని తెలుసుకున్నాము.

ఎన్ని పరిశ్రమలు వీలైతే అన్ని పరిశ్రమలూ స్థాపించి, అందరి చేతా పనిచేయించి ఈ కేంద్ర నిర్వహణకయే ఖర్చులలో కొన్నిటినైనా రాబట్టాలన్నది మా అభిప్రాయం. ప్రభుత్వంతో అవసరమయే పక్షంలో నిరంతరం పోరు సాగించడానికి ఇది ముఖ్యమని పించింది. ఒకచిన్న చెప్పుల ఫ్యాక్టరీని ఏర్పాటుచేశాము. టాల్‌స్టాయ్ కేంద్రానికి సమీపంలోనే జర్మన్ కాథలిక్ మతప్రచారకుల శిబిరం ఒకటి ఉండేది. అక్కడికి ఎవరైనా వెళ్ళి పాదరక్షలు తయారుచేయడం నేర్చుకోవచ్చు. కాలెంబాచ్ వెళ్ళి ఆ కళను అభ్యసించాడు. ఆయనే నాకు నేర్పాడు. నేను మరికొందరికి నేర్పాను. డజనులకొద్దీ చెప్పుల జతలను నేను స్వయంగా తయారు చేసినట్లు జ్ఞాపకం. వీటిని తయారు చేయడంలో చాలామంది యువకులు నన్ను కూడా మించిపోయినారు. మేము తయారుచేసిన జోళ్ళను మా మిత్రులకే అమ్మి కొంతడబ్బు సంపాదించే వాళ్ళము. వడ్రంగంపని కూడా ప్రారంభించాము. బెంచీలు, పెట్టెలు, మొదలైన రకరకాల చిన్న వస్తువులను, పెద్దవస్తువులను తయారుచేసే వాళ్ళము.

ఈ ఆశ్రమంలో పాఠశాల ఒకటి తప్పని సరిగా నడుపుకోవలసి వచ్చింది. మేము చేయ బూనుకున్న పనులలో ఇదే అతికష్ట సాధ్యమైనది. పాఠశాలను నడిపే విషయంలో చిట్టచివర రోజులలోగాని సంపూర్ణ విజయం చేకూరలేదు. పాఠాలు చెప్పే బాధ్యత విస్తారంగా నా పైనా కాలెంబాచ్ పైనా మాత్రమే వుండేది. విద్యార్థులు బడికి అపరాహ్ణం వచ్చే వాళ్ళు నేను, కాలెంబాచ్, విద్యార్థులు కూడా ఉదయమంతా కష్టపడి పని చేసి, బాగా అలసి పోయివుండే సమయమది ఉపాధ్యాయులు, విద్యార్థులు ఉభయులు కూడా తరుచూ కునుకుపాట్లు పడుతుండే వాళ్ళు. నిద్ర రాకుండా కళ్ళమీద చన్నీళ్ళు చల్లుకునే వాళ్ళము. విద్యార్థులతో ఆడుకుంటూ అటు వాళ్ళకూ, ఇటు మాకూ కూడా నిద్రరాకుండా చూడడానికి ప్రయత్నించే వాళ్లము. కొన్నిసార్లు ఎంత ప్రయత్నించినా లాభమేమి వుండేది

కాదు. నిద్రవచ్చి తీరేది. ఎంత వద్దన్నప్పటికీ దేహాంతప్పని సరిగా విశ్రాంతి కోరేది. పాఠశాలను నిర్వహించడంలో ఎదుర్కొన వలసి వచ్చిన అనేక చిక్కులలోనూ ఇది చాలా చిన్న చిక్కనే ఒప్పుకోవాలి. ఒక వైపు నిద్రమత్తు బాధిస్తున్నప్పటికీ, పాఠాలు జరుగుతునే వుండేవి. గుజరాతీ, తమిళం. తెలుగా మూడుభాషలు మాట్లాడే విద్యార్థులు వుండే వాళ్ళు. ఇన్నిభాషలు మాట్లాడే వాళ్ళకు ఏమిటి బోధించడం? ఏలా బోధించడం? నాకు కొద్దిగా తమిళభాష తెలుసునుగాని, తెలుగు తెలియదు. దేశ భాషలలోనే విద్య బోధించాలని నా ఆదుర్దా. ఈ పరిస్థితులలో ఏ ఉపాధ్యాయుడైనప్పటికీ, ఏమిచేయగలడు?

విద్యా బోధన విషయంలో ఈ ప్రయత్నం విఫలం కాలేదు. బాల బాలికలను అసహనమనే అంటువ్యాధినుంచి కాపాడడానికి వీలైంది. ఇతర మతాలను, ఆచారాలను విశాల హృదయంతో, ఔదార్యంతో పాటించడం వీరికి అలవాటైంది. ఏక కుటుంబంలోని సంతానం వలె జీవించడం కూడా నేర్చుకున్నారు. ఒకరి కొకరు సహాయపడడం, ఒకరి నొకరు మర్యాద చేసుకోవడం, సమిష్టిగా పరిశ్రమించడం అనే సుగుణాలు వీరికి అబ్బినవి. టాల్‌స్టాయ్ కేంద్రంలో విద్యనభ్యసించిన బాల బాలికలతో కొందరి విషయమై ఉత్తరోత్తరా వారి కార్య కలాపాలు ఏ విధంగా వున్నదీ కొంతవరకు విచారించి తెలుసుకున్నాను. నాకు తెలిసి నంతవరకు, వా రక్కడ పొందిన శిక్షణ వృధా కాలేదనే నా నమ్మకం. టాల్‌స్టాయి కేంద్రంలో అనుసరించిన విద్యావిధానం అసమగ్ర మైనట్టిదే కావచ్చు. ఐతే, అది బహుజాగ్రత్తగా ఆలోచించి ప్రవేశపెట్టిన పద్ధతి. ఒక విధమైన మతప్రబోధం దానికి ప్రాతి పదిక. టాల్‌స్టాయి కేంద్రానికి సంబంధించిన అతిమధుర స్మృతులన్నిటిలో ఈ విద్యా బోధనస్మృతులు మిగతావాటికి ఏ విధంగానూ తీసిపోవు.

# 34. స్త్రీల పాత్ర (i)

గోపాలకృష్ణ గోఖ్లే సత్యాగ్రహులకూ, ప్రభుత్వానికీ మధ్య రాజీ కుదర్చడానికి 1912 శీతాకాలంలో దక్షిణాఫ్రికాకు వచ్చాడు. జనరల్ బోథాతో సంప్రతించిన పిమ్మట, దక్షిణాఫ్రికాలో భారతీయ సమస్య పరిష్కార మవుతుందని గోఖ్లే మమ్ములను ప్రోత్సహించ సాగాడు. "వచ్చే సంవత్సరం "బ్లాక్ ఆక్ట్" పోతుంది. మూడుపౌనుల పన్ను పద్ధతి రద్దవుతుంది" అని మాకు ధైర్యం చెప్పాడు.

మరుసటి సంవత్సరం జరిగిన శాసన నిర్మాణంలో మాకు ఏ విధమైన ఉపకారమూ చేకూరలేదు. 1913 వచ్చేసరికి టాల్‌స్టాయి కేంద్రంలోని వారందరూ సత్యాగ్రహ పునర్విజృంభణకు సంసిద్ధమైనారు. మూడు పౌనుల పన్నును రద్దు చేయించాలన్నది ఈ ఉద్యమానికి ప్రధానలక్ష్యం.

తమ భర్తలతోపాటు జైళ్ళకు వెళ్ళడానికి స్త్రీలు కూడా ఉత్సహించారు గాని, ఇప్పటివరకు మేమే వారిని వద్దని చెబుతూ వచ్చాము. మా ఉద్యమాన్ని బలపరచడానికే నేమో అన్నట్లుగా, దక్షిణాఫ్రికా ప్రభుత్వం పెళ్ళిళ్ల రిజిస్టర్ చేయని వివాహాలనూ, క్రిస్టియన్ మతాచారం ప్రకారం జరగని వివాహాలనూ అన్నిటినీ రద్దు చేసే ఒక ఉత్తర్వును సరిగా ఇదే సమయంలో అమలు పరిచింది. హిందూ, మహమ్మదీయ, జొరాస్ట్రియన్ మతాచారల ప్రకారం జరిగిన వివాహాలన్నీ ఒక్క కలం పోటుతో అక్రమ వివాహాలై పోయిన పన్నమాట! దక్షిణాఫ్రికాలోని భారతీయ స్త్రీలందరూ తమ తమ భర్తలకు చట్ట సమ్మతమైన భార్యలు కారని ప్రభుత్వం తేల్చివేసింది. ఇంత ప్రధాన సమస్య ఏర్పడినప్పుడు, స్త్రీలను కూడా ఉద్యమంలో చేరనివ్వడం ధర్మమేనని నిర్ణయించుకున్నాము.

మొత్తంమీద విషమ సమస్యే వచ్చిపడింది. ఇక జాప్యంచేయడా నికి ఏ మాత్రం వీల్లేదు. మన స్త్రీజాతికి ఇంతటి అవమానం జరుగు తూంటే చూసి సహించి ఊరుకోవడం అసంభవం. ఎంతమంది యోధులు ఉద్యమంలో చేరుతారనే విషయాన్ని పాటించకుండా, తీవ్రధో రణిలో సత్యాగ్రహం సాగించాలని తీర్మానించుకున్నాము. సత్యాగ్ర హంలో చేరవద్దని స్త్రీలకు ఈ సారి అడ్డు పడడానికి వీల్లేక పోగా, పై పెచ్చు, పురుషులతో పాటు ముందంజ వేయవలసిందని స్త్రీలనూ ఆహ్వా నించడానికి సైతం మేము నిర్ణయించాము. టాల్‌స్టాయ్ కేంద్రంలో నివసిస్తున్న సోదరీమణులనే ముందు ఆహ్వానించాము. సత్యాగ్రహంలో చేరడానికి వారు అమిత సంబర పడుతున్నట్లు కనిపించారు. ఉద్యమంలో పాల్గొన్నందు వల్ల ఎదుర్కొనవలసి వచ్చే ప్రమాదాలను వారికి వివరించి చెప్పాము. ఆహారం, దుస్తులు, మొదలైన విషయాలలో నిర్బం ధాలను భరించవలసి వస్తుంది సుమా! అని ముందుగానే హెచ్చరిక జేశాము. జైలులో వారిచేత కష్టమైన పనిచేయించ వచ్చుననీ, గుడ్డలు ఉతకవలసిందని నిర్బంధించ వచ్చుననీ. జైలువార్డర్లు అవమాన పరచ వచ్చుననీ కూడా తెలియజేశాము. ఇన్ని హెచ్చరికలు చేసినప్పటికీ ఈ సోదరీ మణులందరూ ధైర్యాన్నే కనబరిచారు. వీటిలో దేనికీవారు భయప డలేదు. వీరిలో ఆరుగురు చంటిపిల్లల తల్లులు; మరొకామెకూ ఒక పసి పాపవున్నది. ఐనప్పటికీ, వీరిలో ప్రతిఒక్కరూ ఉద్యమంలో దూకడానికే సంసిద్ధులైనారు. ట్రాన్స్‌వాల్‌నుంచి నెటాల్‌కు పోవడము, నెటాల్ నుంచి ట్రాన్స్‌వాల్‌కు రావడమూ అధికార్లు నేరంగా పరిగణించడం మొదలుపెట్టారు. నెటాల్‌నుంచి ట్రాన్స్‌వాల్‌కు ఒక వాలంటీర్ బృందాన్ని పంపడానికి ప్లానువేశాము. సర్టిఫికెట్లు లేని కారణంచేత ట్రాన్స్‌వాల్ చేరగానే వారిని బహుశా అరెస్టు చేయడం జరుగుతుంది. ఈ లోపుగా ట్రాన్స్‌వాల్‌లో అరెస్టు కావడానికి ప్రయత్నించి విఫలులయే సోదరీ

మణులు నెటాల్‌లో పునఃప్రవేశం జరుపుతారు. వారిని అంతసైనా అరెస్టు చేస్తే మంచిదే. లేనిపక్షంలో, వారు బొగ్గు గనులకు ప్రసిద్ధిచెందిన న్యూకాజిల్ పట్టణానికి వెళ్ళి, అక్కడ గనుల కార్మికులు సమ్మె చేసేటట్లు ప్రోత్సహించాలి. ఈ కార్మికులలో తమిళ, తెలుగుభాషలు మాట్లాడే వారే చాలామంది వున్నారు.

ఫినిక్స్ ఆశ్రమానికి వెళ్లి అక్కడ వున్నవారితో నా ప్లానులను గురించి ముచ్చటించి చూశాను. అక్కడ నివసిస్తున్న సోదరీమణులతో ముందుగా సంప్రతించాను. ఈ స్త్రీలనందరినీ కారాగారానికి పంపించ డంలో పెద్ద ప్రమాదం వున్నదనే విషయం నాకుతెలుసు. పైగా, వీరిలో ఎంతోమంది నాకు బంధువులు. బంధుత్వం కారణంగా నా మాట తోసివే యలేక జైలుకు రావడానికి ఎక్కడ ఒప్పుకుంటారో నని నా భయం. మాట తీసివేయలేక మొదట సరేనని, తర్వాత పరీక్ష సమయం వచ్చిన ప్పుడు వెనుకంజవేసినా, కారాగార వాసానికి తట్టుకోలేక పోయినా, అధికార్లకు క్షమాపణ చెప్పుకోదలచినా వారు నన్ను కలవర పరిచిన వారే గాక ఉద్యమానికి సైతం తీవ్ర అపచారం చేసినవాళ్ళవుతారు. ఈ సత్యా గ్రహ ఉద్యమం విషయమై నా భార్యతో ప్రస్తావించ కూడదనే నిర్ణయించు కున్నాను. ఎందువల్లనంటే నే నేమి చెప్పినప్పటికీ, ఆమె కాదనలేదు. ముందుగా సరే నన్నప్పటికీ, ఆమె మాటకు ఏపాటివిలువ ఇవ్వాలో నాకు తెలియదు. ఇంత ప్రధానమైన విషయంలో భర్త భార్యను యదేచ్ఛగా నిర్ణయించుకో నివ్వడమే ఉత్తమం.

మిగతా సోదరీమణులతో ప్రస్తావించి చూశాను. వారందరూ వెంటనే నా ప్రతిపాదనకు సమ్మతించారు. జైలుకు వెళ్ళడానికి తమ సంసిద్ధతను తెలియచేశారు. ఏమి సంభవించినప్పటికీ, తమ శిక్షాకాలాన్ని పూర్తిగా జైలులోనే గడుపుదుమని హామీ ఇచ్చారు. వీరితో నా సంభాష ణను నా భార్య చాటుగావుండి విన్నది. "ఈ విషయ మేమాత్రం మీరు

నాతో చెప్పక పోతున్నందుకు విచార పడుతున్నాను. ఈ సేవ చేయడానికి నన్ను అయోగ్యురాలుగా ఎందుకు ఎంచాలి? మిగతా వారినందరినీ ఏదారిన వడవమంటున్నారో, నేనూ అదేదారిన వడవా లనుకుంటున్నాను" అన్నది నా భార్య.

"నీకు బాధ కలిగించాలనే ఉద్దేశం నా కెన్నడూలేదు. నీ వంటే నాకు ఏ మాత్రం అపనమ్మకం వున్నదనుకోవద్దు. నీవు జైలుకు వస్తా వంటే నాకు అంతకంటే కావలసిందేమిటి? నా కోరికమీద నీవు జైలుకు వెళ్ళినట్లు ఇతరులకు కనబడకూడదు. ఇలాంటి విషయాలలో ప్రతివ్యక్తీ స్వీయ బలంమీదా, ధైర్యంమీదా ఆధారపడి వుండడం మంచిది. ఇందులో నిన్ను నేను ప్రోద్బలం చేయడం తప్పు. నా ప్రోద్బలంమీద నీవు అరెస్టయి, కోర్టులో గజగజ వణకడం ప్రారంభించినా, జైలులో కష్టాలు పడలేక హడలిపోయినా అది నీకూ, నాకూ కూడా దారుణమైన విషయంగా పరిణమిస్తుంది. పైగా, నేను తలపెట్టిన ఉద్యమానికే చెరుపు" అన్నాను.

"కారాగార శిక్షకు తట్టుకోలేక క్షమాపణ ఇచ్చి నేను విడుదల పొందినట్లయితే అప్పుడు నా దుర్గతికి నన్నువదలి వేయండి'' అని ఆమె బదులుచెప్పింది. "కష్టాలన్నీ మీరేగాక నా పిల్లలుకూడా భరిస్తున్నప్పుడు నేను మాత్రం ఏందుకు భరించలేను? నేనూ ఉద్యమంలో చేరి తీరవలసిందే," అని కూడా అన్నది.

"అలాగైతే, నిన్ను చేర్చుకోవడం నా విధ్యుక్తం. ఏ షరతుల మీద నిన్ను ఉద్యమంలో చేర్చుకుంటున్నానో నీకు తెలిసిందే నా స్వభావము కూడా నీకు తెలిసిందే. ఇప్పటికైనా మించిపోయిం దేమీలేదు. తిరిగి ఆలోచించుకో. జాగ్రత్తగా ఆలోచించిన తర్వాత, ఉద్యమంలో చేరకూడదని తీర్మానించు కున్నట్లయితే, స్వేచ్ఛగా తప్పుకోవచ్చు. ఇప్పుడైనా సరే నీ నిర్ణయాన్ని మార్చుకో దలచినట్లయితే అందులో నామర్దా ఏమీలేదు"

అని సలహా ఇచ్చాను. "ఇక నేను ఆలోచించ వలసిందేమీ లేదు. మన స్ఫూర్తిగా నిర్ణయించుకున్నాను" అన్నది.

ఇది ఎవరంతట వాళ్ళు మిగతవారితో ఎట్టి ప్రమేయము లేకుండా స్వతంత్రించి నిర్ణయం చేసుకోవలసిన విషయమని మిగతా సోదరీమణు లందరికీ కూడా స్పష్టపరచాను. ఉద్యమం బహుకాలం నడిచినా—కొద్దిలో ముగిసినా, ఫినిక్స్ కేంద్రం బాగుపడినా—నాశనమైనా, జైలులో ఆరోగ్యం బాగా వున్నా—చెడిపోయినా, ఏ ఒక్కరూ కూడా ఉద్యమంనుంచి విడిపో వడానికి ఏ మాత్రం వీల్లేదనే షరతును వాళ్ళందరికీ రకరకాలుగా పదేపదే గట్టిగా చెప్పివేశాను. అందరూ ఒప్పుకున్నారు. ఫినిక్స్ ఆశ్రమానికి చెందని వ్యక్తి ఈ బృందంలో చేరింది ఒక్క పార్సీ రుస్తోంజీ మాత్రమే. అతడికి ఈ సంభాషణ లన్నిటినీ చెప్పకుండా వుండడానికి వీల్లేదు. పార్సీ రుస్తోంజీని అందరూ బహు ఆప్యాయంగా "కాకాజీ" అని పిలుస్తుండే వాళ్ళు. ఇట్టి సందర్భాలలో ఆయన వెనుకంజ వేసే రకంకాదు. "కాకాజీ" ఇంతకు పూర్వం ఉద్యమంలో జైలుకు వెళ్ళిన వాడే. మరొకసారి వెళ్ళ వలసిందేనని పట్టు బట్టాడు.

అనుకున్న పనులన్నీ అనుకున్నట్లే జరిగినవి. ట్రాన్స్‌వాల్‌లో అరెస్టుగాక ఆశాభంగం చెందిన సోదరీమణులు నెటాల్‌లో ప్రవేశించారు. సరిహద్దు దాటుతున్నప్పుడు వీరి కెవరూ అడ్డుపడలేదు. అందువల్ల వారం దరూ న్యూకాజిల్‌కు బయలుదేరారు. వారి ప్రచార ప్రభావం దవానలం వలె వ్యాపించింది. ప్రభుత్వం మూడుపౌనుల పన్ను విధించి అన్యా యాలు జరుపుతున్నదనే హృదయ విదారక వర్తమానాన్ని విన్న కార్మికు లకు మనస్సు విరిగిపోయింది. వెంటనే సమ్మె ప్రారంభించారు.

సాహసోపేతులైన ట్రాన్స్‌వాల్ సోదరీమణుల కార్యకలాపాలను ప్రభుత్వం ఇక యథేచ్ఛగా సాగనివ్వలేక పోయింది. వారందరికీ తలా ఒక మూడునెలల శిక్ష విధించింది.

# 35. స్త్రీల పాత్ర (ii)

ఆ స్త్రీల ధైర్య సాహసాలు వాస్తవంగా వర్ణణాతీతమైనవి. వారం దరినీ మారిట్జ్‌బర్గ్ జైలులో పెట్టారు. అధికార్లు వారికి అనేక చిక్కులు కలిగించారు. అతి అసహ్యమైన ఆహారం పెట్టేవాళ్ళు. మోపెడు గుడ్డలు పడవేసి ఉతకమనే వాళ్ళు. జైలుకు వెలుపలినుంచి ఏ విధమైన ఆహారాన్నీ తెప్పించుకోడానికి అనుమతిని నిరాకరించారు. శిక్షాకాలం పూర్తికావస్తున్న రోజులలో కాబోలు వెలుపలినుంచి ఆహారం తెప్పించుకోడానికి అధికార్లు సమ్మతించారు.

ఎప్పుడూ ఏదో ఒకేరకమైన ఆహారం భుజించాలన్నది నా భార్యకు నియమం. ఎంతో అవస్థపడ్డ తర్వాతగాని, జైలు అధికార్లు ఆమెకు ఆ ఆహారం యివ్వలేదు. ఏది ఎల్లాగైనప్పటికీ, జైలు అధికార్లు ఇచ్చే ఆహార పదార్థాలు మానవ మాత్రులు తినదగినవిగా వుండేవికావు. నా భార్య ఆలివ్ నూనె కావాలనేది. అధికార్లు మొదట ఇవ్వలేదు. తర్వాత ఇచ్చారుగాని, అది ముక్కిపోయిన పాతనూనె. సొంత ఖర్చుమీద ఆ నూనె తెప్పించుకుంటా నన్నది. అందుకు అధికార్లు సమ్మతించలేదు. జైలు, హోటలు కాదని సమాధానం చెప్పారు. ఏ ఆహారం ఇస్తే, దాన్నే పుచ్చుకోవాలని కూడా అన్నారు. జైలునుంచి విడుదల చేసేసరికి, ఆమె చిక్కి శల్యమై పోయింది. తిరిగి ఆమె ఆరోగ్యం కుదట పడడానికి విశ్వ ప్రయత్నం చేయవలసి వచ్చింది.

మరొక సోదరి తీవ్ర జ్వరపీడితురాలై, జైలునుంచి బయట పడింది. విడుదలైన కొన్నిరోజులకే (1914, ఫిబ్రవరి 22వ తేదీన) ఆమె ఆ జ్వరంతోనే మరణించింది. నేను ఆమెను ఏ విధంగా మరచిపోగ

లను ? ఆమె పేరు వల్లియమ్మ ఆర్. మునిస్వామి మొదలియార్. జోహా నెస్ బర్గ్‌లో ఆమె నివాసం. ఆ బాలిక వయస్సు పదహారు సంవత్సరాలు. నేను చూడడానికి వెళ్లినప్పుడు ఆమె వ్యాధి గ్రస్తురాలై, మంచంపట్టి వున్నది. వల్లియమ్మ పొడుగరి కాబట్టి, కృశించిన దేహంతోవున్న ఆమెను చూస్తే భయంకరమైతోచింది. "వల్లియమ్మా ! జైలుకు వెళ్ళినం దుకు నీవు విచారపడడం లేదా ?" అన్నాను.

"విచారమా ? ఎందుకు ? అరెస్టు చేసేట్లయితే, జైలుకు వెళ్ళడా నికి ఇప్పటికీ తయారుగానే వున్నాను." అని బదులు చెప్పింది.

"మరణం సంభవిస్తేనో ?" అన్నాను.

"లెక్కజేయను. మాతృదేశం కోసం ప్రాణాలైనా అర్పించడానికి సైతం ఎవరు ఇష్టపడరు ?" అని సమాధానం ఇచ్చింది.

ఈ సంభాషణ జరిగిన కొన్నిరోజులకే వల్లియమ్మ మమ్ములను వదలిపెట్టి వెళ్లిపోయింది. భౌతికంగా మమ్ములను విడిచిపెట్టి నప్పటికీ, ఆమె మాకు అమరకీర్తిని ఆర్జించి పెట్టింది.

ఈ సోదరీమణులు చేసింది అతి స్వచ్ఛమైన, నిర్మలమైన త్యాగం. త్యాగ నైర్మల్యాన్ని బట్టే దాని ఫలితం వుంటుంది. మానవుడు తనపై సర్వదా భక్తి చూపాలనే భగవంతుడు పరితపిస్తాడు. స్వార్థ కాంక్షలేని ఒక నితంతువు భక్తితో, శక్తికొద్దీ ఏమి ఇచ్చినప్పటికీ భగవంతుడు సంతోషంగా స్వీకరిస్తాడు. అందుకు ఆమెకు వందరెట్లు ప్రతిఫలం చూపి స్తాడు. కుత్సితమూ, కుతంత్రమూ ఎరుగని భక్త సుధాముడు ఇవ్వగలి గినదల్లా పిడికెడు అటుకులుమాత్రమే కదా! ఐతే, ఆ పిడికెడు అటుకులూ త్రికరణశుద్ధిగా పెట్టిన కారణంచేత, ఎన్నో సంవత్సరాల నుంచీ వున్న దారిద్ర్య, క్షుద్బాధలు అతడికి తొలగిపోయినవి. అదే విధంగా అనేక మంది కారాగారానికి వెళ్ళినందువల్ల ఫలితం శూన్యమే కావచ్చు. కాని ఒక నిర్మలాత్మ త్రికరణశుద్ధిగా, భక్తి ప్రపూరితంగా చేసే త్యాగం ఎన్న

టికీ వృధా కాజాలదు. దక్షిణాఫ్రికాలో మిగతా వారందరూ చేసిన త్యాగం భగవంతుడికి సమంజసమై, సంతృప్తి కరమై తోచిందో లేదో ఎవరూ చెప్పలేరు. వల్లియమ్మ చేసిన త్యాగం మాత్రం భగవంతుడి మన్ననకు పాత్రమై వుంటుందనే నా పరమ విశ్వాసం.

దేశ సేవకోసం, మానవ సేవకోసం ఇదివరలో అనేకమంది తమ ప్రాణాలు అర్పించారు. ఇప్పుడూ అర్పిస్తున్నారు ; ఇకముందూ అర్పిస్తారు. అది సహజ సిద్ధమైన విషయమే. ఐతే, వీరిలో ఎవరు నిర్మలాంతఃకరణతో త్యాగం చేశారో చెప్పడానికి సాధ్యపడదు. స్ఫటిక సమానమైన నైర్మల్యంతో పనిచేసే వ్యక్తి ఏ ఒక్కడున్నప్పటికీ, కార్య సాఫల్యతకు అట్టి వ్యక్తి చేసే త్యాగం చాలునని సత్యాగ్రహులైనవారు ఖండితంగా విశ్వశించవచ్చు. ప్రపంచానికి మూలాధారం సత్యం. సత్యంకానిదే అసత్యం. ఏది స్థిరమో అదే సత్యం. సత్యం నాశరహితమైనది. సర్వ కాల సర్వావస్థలలోనూ విజయం దానిదే. ఇదే సత్యాగ్రహ సిద్ధాంత సూక్ష్మ స్వరూపం.



# 36. కార్మికుల చేరిక

అధికార్లు స్త్రీలను ఖైదు చేయడం న్యూకాజిల్ సమీపంలోని గనుల కార్మికులలో మహామంత్రం వలె పనిచేసింది. వారందరూ తమ పరికరాలను విసర్జించి సమ్మె ప్రారంభించారు. దళం తర్వాత దళంగా, నగరంలోకి ప్రవేశించ సాగారు. ఆ వార్త వినగానే ఫినిక్స్ నుంచి న్యూకాజిల్‌కు బయలుదేరాను.

ఈ కార్మికులకు సొంత ఇళ్లేవీ లేవు. గనుల యజమానులే వాళ్ళకు గుడిసెలు కట్టించి ఇచ్చారు. వీధులలో దీపాలు పెట్టించడానికీ, మంచినీళ్ళ

సప్లయి చేయించడానికి కూడా బాధ్యులు గనుల యజమానులే. మొత్తం మీద కార్మికులది పూర్తిగా అస్వతంత్రపు బతుకై పోయిందన్నమాట.

సమ్మెదార్లు తమకు జరుగుతున్న అనేక అన్యాయాలను గురించి నాతో ఫిర్యాదు చేశారు. వీధులలో దీపాలు ఆర్పించారనీ, నీళ్ళసప్లయి మాపివేశారనీ కొంతమంది కార్మికులు చెప్పారు ఇళ్ళలోవున్న సామాన్లను వీధులలో పడవేశారని మరి కొంతమంది చెప్పుకున్నారు. సయ్యద్ ఇబ్రహిం అనే ఒక పఠాన్ వెనుకకు తిరిగి వీపుచూపిస్తూ ఇలా అన్నాడు—"ఇదుగో చూడు! నన్ను ఎలా చావగొట్టారో! విన్నుచూపి. నీ ఉత్తర్వులను చూసి ఆ దుర్మార్గులను వదలివేశాను. నేను పఠాన్‌ను. పఠానులు దెబ్బ కొడతారు గాని, ఎన్నడూ దెబ్బతినరు."

"భేషైన పని చేశావు. ఇట్టి సహనభావమే వాస్తవమైన సాహసం. నీలాంటి వాళ్ళద్వారానే మనం ఉద్యమంలో విజయం సాధించగలుగుదుము." అన్నాను.

సమ్మె సాగిస్తున్న కార్మికుల సంఖ్య పదులుకాదు, వందలుగాదు, దాదాపు ఐదువేల వరకూ పెరిగే అవకాశంవున్నది. నిజంగా అలాగే పెరిగింది. రోజురోజుకూ పెరిగిపోతున్న ఈ పెద్ద మూకకు ఆశ్రయం ఏర్పాటుచేయడం ఎలా? ఆహారం ఎక్కడనుంచి తేవడం?

ఈ సమస్యకు నా కొక పరిష్కారం దొరికింది. ఇంతమంది కార్మికులనూ ట్రాన్స్‌వాల్‌కు చేర్చి ఫినిక్స్ సత్యాగ్రహ బృందాన్ని చేర్చినట్లే సురక్షితంగా జైలుకు చేర్చడమే పద్ధతి. ఈ విధంగావచ్చి చేరిన కార్మికుల సంఖ్య దాదాపు ఐదువేలుంటుంది. ఈ మహాజనాన్ని రైలులో తీసుకుపోవడానికి నా వద్ద చాలినంత డబ్బులేదు. అందువల్ల అందరినీ రైలులో తీసుకుపోవడం అసంభవమైంది. ఒకవేళ రైలులో తీసుకు వెళ్లినట్లయితే వారి మనోనిబ్బరాన్ని పరీక్షించే అవకాశం నాకు దొరకదు. న్యూకాజిల్ నగరానికీ ట్రాన్స్‌వాల్ పరిహద్దుకూ 36 మైళ్ళదూరం. ఛార్లెస్ టౌన్

అన్నది నెటాల్ రాష్ట్రి సరిహద్దు పట్టణం. వోక్స్‌రస్ట్ అనేది ట్రాన్స్‌వాల్ సరిహద్దులోనిది. అందరమూ కాలినడకనే ప్రయాణం చేయాలని చివరకు నిర్ణయించాను. భార్యా బిడ్డలతోవున్న కొంతమంది కార్మికులతో నా నిర్ణయాన్ని గురించి ప్రస్తావించి చూశాను. నా సూచనతో ఏకీభవించ డానికి కొందరు సంకోచించారు. ఐనప్పటికీ, నా మనస్సు దిట్టపరుచుకొనక గత్యంతరం లేకపోయింది. నా సూచన ఇష్టంలేని వారందరూ తిరిగి తమతమ గనులలో పనికి వెళ్ళవచ్చునని స్పష్టంగా తెలియజేశాను. వాళ్ళలో ఒక్కరుకూడా తిరిగి వెళ్ళడానికి సమ్మతించలేదు. నడువలేని వాళ్ళందరినీ రైలులో పంపడానికి నిర్ణయించుకున్నాము. ఛార్లెస్ టౌన్ పట్టణం వరకూ నడవడానికి ధృఢకాయులు సంసిద్ధులైనారు. రెండురోజులలో ఈ యాత్ర పూర్తికావాలి. ప్రయాణం ప్రారంభించినందుకు అందరూ సంతోషించారు. న్యూకాజిల్ పట్టణంలో ప్లేగు రావచ్చునని యూరపియను లందరూ భయపడ సాగారు. దాన్ని నివారించడానికి సకల ప్రయత్నాలూ చేయాలని వారు తాపత్రయపడడం మొదలుపెట్టారు. ఆ పట్టణంనుంచి తరలి వెళ్ళాము కాబట్టి బతికిపోయాము. యూరపియనులకూ మనశ్శాంతి ఏర్పడింది. లేకపోయి నట్లయితే, ఆ యూరపియనులు జరపదలచిన చర్యలు మాకు బహు సంకటంగా పరిణమించి వుండేవి.

మా ప్రయాణ సన్నాహాలు జరుగుతూండగా, బొగ్గుగనుల యజమానుల వద్దనుంచి నాకు ఒక పిలుపువచ్చింది. డర్బాన్‌కు వెళ్ళాను. ప్రభుత్వం విధించిన మూడు పౌనుల పన్నుతో తమ గనులకు ఎట్టి సంబంధమూ లేదని ఆ యజమానులు వాదించసాగారు. ఆ పన్ను తీసివేయవలసిందని ప్రభుత్వానికి వారిచేత అర్జీ పెట్టించలేక పోయాను.

అందువల్ల వెంటనే న్యూ కాజిల్‌కు తిరిగివచ్చాను. వివిధ ప్రాంతాలనుంచీ కార్మికులు తండోప తండాలుగా వచ్చి చేరుతున్నారు. పరిస్థితిని పూర్తిగా వారందరికీ ఎరుకపరిచాను. తమకు ఏమాత్రం ఉద్దేశంవున్నా,

తమతమ పనులకు నిరాక్షేపణగా తిరిగి వెళ్ళవచ్చునని మరొకసారి స్పష్ట పరిచాను. బొగ్గు గనుల యజమానులు ప్రకటిస్తున్న బెదరింపులను అంద రికీ తెలియజేశాను. ముందు ముందు రానున్న ప్రమాదాలను వర్ణించి చెప్పాను. పోరాటం ఎప్పుడు అంతమయేదీ ఎవరూ చెప్పలేరనికూడా సూచించాను. జైలులో ఎన్నికష్టాలు భరించవలసి వచ్చేదీ మళ్ళీ వివరిం చాను. ఇన్ని చెప్పినప్పటికీ, కార్మికులు వెనుకాడలేదు. నేను తమసరసన వుండి పోరాడుతున్నంతవరకూ, తమలో ఎన్నటికీ అధైర్యమనేది వుండ దని వాళ్ళందరూ నిర్భయంగా సమాధానం చెప్పారు. జీవితంలో అనేక కష్టాలకు అలవాటు పడివున్నామనీ, అందువల్ల నేను తమవిషయమై ఏ మాత్రం ఆదుర్దా పడనవసరం లేదనీ కూడా వారు తెలియజేశారు.

ఇక తరలి వెళ్ళడమే తరువాయి. ఆ మరుసటి ఉదయం (1913, అక్టోబరు 28) యాత్ర ప్రారంభిస్తున్నామని క్రితం రోజు సాయంత్రం కార్మికులందరికీ తెలియజేశాను. యాత్ర సందర్భంలో ఏయే నియమాలను పాటించ వలసిందీ విశదీకరించాను. ఐదారువేలమంది ప్రజలను అదుపులో వుంచడమంటే సులభ సాధ్యమైన విషయంకాదు. ప్రయాణం చేస్తున్న ప్పుడు దారిలో రోజుకు మనిషి ఒకటికి పౌనున్నర రొట్టె, ఒక ఔన్సు చక్కెరకంటె ఎక్కువ ఇవ్వలేనని ముందుగానే చెప్పాను. దారిలో భార తీయ వ్యాపారస్థు లెవరైనా కనబడినట్లయితే, సాధ్యపడే పక్షంలో వారి వద్ద మరికొంత ఆహారసామగ్రి సేకరించడానికి ప్రయత్నిస్తా నన్నాను. ఈ విధంగా సేకరించడానికి సాధ్యపడనట్లయితే, నేను ఇచ్చేరొట్టె, చక్కె రతో తృప్తిపడ వలసిందేనని కూడా తెలియజేశాను. బోయెర్ యుద్ధం లోనూ, జులూ "తిరుగుబాటు"లోనూ నేను గడించిన అనుభవం ఈ సంద ర్భంలో నాకు బాగా సహాయపడింది. యాత్రికులు సరిగా ఎన్నిదుస్తులు అవసరమో అన్నే వుంచుకోవాలని చెప్పాను. దారిలో ఎవరూయితరుల వస్తువులను తాకకూడదు. అధికారిగాని, అనధికార యూరపియన్ గాని

దారిలో తమ కెదురుపడి తిట్టినా, కొట్టినా సహనంతో వూరుకో వలసిందే నని కూడా స్పష్ట పరిచాను. అధికారులు ఒకవేళ నన్ను అరెస్టు చేసినప్పటికీ, యాత్రసాగి తీరవలసిందే నని ఖండితంగా చెప్పివేశాను. నా అనంతరం ఎవరెవరు నాయకత్వం వహించేదీ పేర్లను కూడా ప్రకటించాను.

నా ఉత్తర్వులను అందరూ అర్థం చేసుకున్నారు. మా దళం సురక్షితంగా ఛార్లెస్ టౌన్ చేరింది. అక్కడ వ్యాపారస్థులు మాకు ఎంతో సహాయ పడ్డారు. మమ్ములను తమఇళ్ళలో వుండనిచ్చారు. మసీదు ఆవరణంలో వంట ఏర్పాట్లు చేసుకోడానికి అంగీకరించారు. మావద్ద వున్న ఆహార సామగ్రి సరిగా లెక్కప్రకారం యాత్ర చేసే రోజులకు మాత్రమే సరిపోతుంది. ఛార్లెస్ టౌన్‌లో కొన్ని రోజులపాటు వుండిపోవలసి వచ్చింది. వంటుకోడానికి కొన్నిపాత్రలు కావలసివచ్చినవి. ఆ పట్టణంలోని భారతీయ వ్యాపారస్థుల సంతోష పూర్వకంగా వాటిని సప్లయి చేశారు. మా వద్ద బియ్యం పుష్కలంగానే వున్నవి. మిగతా సామగ్రి వున్నది. వీటికితోడు వ్యాపారస్థులు ఇవ్వగలిగిన సామగ్రి కూడా ఇచ్చి సహాయపడ్డారు.

ఛార్లెస్ టౌను చిన్నగ్రామం. వెయ్యిమంది జనాభా కూడా వుంటుందో వుండదో. కొన్ని వేలమంది పరాయి ప్రజలు వచ్చిపడితే, ఈ గ్రామంలో వసతిదొరకదు. స్త్రీలకు, బాలబాలికలకు మాత్రమే ఇళ్ళలో వసతి ఏర్పాటుచేశాము. మిగతా వాళ్ళందరూ ఆరుబైటే మకాంవేశారు.

మా జనాభా చేత పారిశుధ్య నియమాలను పాటించేటట్లు చేయడం చాలాకష్ట సాధ్యంగా పరిణమించింది. ఐతే, నా సహచరులు నా కార్యభారాన్ని కొంతవరకు తేలిక చేసి పెట్టారు. నాయకుడే ముఖ్యసేవకుడై, అనుచరులకు ఉత్తర్వులు పురమాయించడానికి బదులు వాస్తవంగా సేవ చేయడానికే పూనుకున్నట్లయితే, ఎంతపని అయినా సాధించవచ్చునని నిరంతరానుభవం వల్ల తెలుసుకున్నాను. నాయకుడు వళ్ళు వంచి పనిచేయడా

నికి పూనుకున్నట్లయితే, మిగతా వారందరూ అతడిని అనుసరిస్తారు. ఛార్లెస్ టౌన్ పట్టణంలో నా ప్రత్యక్షానుభవం ఇదే. చీపురు చేతబట్టి ఊడ్వ డానికి గాని, చెత్త, చెదారం తుడిచివేసి శుభ్రం చేయడానికి గాని నేను, నా సహచరులు ఎప్పుడూ వెనుకాడలేదు. మిగతావారు కూడా ఉత్సాహ భరితులై మాతోపాటు పనిచేసేవాళ్ళు. నడుం వంచి పనిచేయలేని వారు ఉత్తర్వులు పుర్మాయించినప్పటికీ ప్రయోజనంలేదు. అందరూ నాయకులై ఎవరికివారే మిగతావారిని పుర్మాయించడం ప్రారంభిస్తారు. దీని పర్యవ సానం ఏ పనీ గాకపోవడమే. నాయకుడే సేవకుడైనట్లయితే, నాయకత్వాన్ని కాంక్షించడంలో పోటీదార్లెవరూవుండరు.

పప్పు, బియ్యం ఇవే మా ఆహారసామగ్రి. విస్తారంగా కూరగాయలు కూడావున్నవి. ఐతే, వాటిని విడిగా వండడానికి తగినంత వ్యవధి గాని, పాత్రలుగాని లేనికారణంచేత, ఆ కూరగాయలు కూడా పప్పులోనే వేసి వండేవాళ్ళము. ఏ రోజు కా రోజు ఇరవైనాల్గు గంటలూ వంటసాల అతి హడావిడిగా వుండేది. ఆకలితో స్త్రీలు, పురుషులు రాత్రింబగళ్ళు తమ ఇష్టం వచ్చినప్పుడు భోజనానికి వచ్చేవాళ్లు. కార్మికులెవరూ న్యూకాజిల్ పట్టణంలో వుండకూడదనే నియమం పెట్టుకున్నారు. ఛార్లెస్ టౌన్ గ్రామానికి అందరికీ దారితెలుసు. గనులలో పనిచేసి ఎకాఎకిన ఛార్లెస్ టౌనుకు వచ్చి మమ్ములను కలుసుకోవడం ప్రారంభించారు.

ఈ స్త్రీ, పురుషుల ఓర్పును, సహనాన్నీ తలుచుకుంటే, భగవంతుడి దయామయత్వం నన్ను పులకాంకితుడిని చేస్తుంది. వంటవాళ్ళలో నేను ముఖ్యుడిని. ఒక్కొక్కప్పుడు పప్పులో నీళ్ళు యెక్కువ యేని. మరొకప్పుడు పప్పు బాగా వుడికేదికాదు. అన్నం నానుబాయి అయ్యేది. కూరలు ఎచ్చిపచ్చిగా వుడికేవి. ఇలాంటి ఆహారం పెడితే మారు మాటాడకుండా తిన్నవాళ్ళను నేను ప్రపంచంలో ఎక్కడా చూడలేదు. దక్షిణాఫ్రికా జైళ్లలో అధికార్లు రేషనుప్రకారం ఆహారం ఇవ్వకపోయినా,

అది బాగా వుడకక పోయినా, ఆహారం కొంచం ఆలస్యంగా వచ్చినా విద్యావంతుల మనుకునే వార్లే ఆగ్రహ పడేవాళ్లు.

వంట చేయడంకంటే కూడా, వంటచేసిన ఆహార పదార్థాలను అందరికీ సరిగా వడ్డించడం మరీ కష్టమేమో। వడ్డన అజ్మాయిషీ అంతా నాది. వంట సరిగా లేకపోతేకూడా బాధ్యత అంతా నాపైనే వేసుకునే వాడివి.

అనుకున్న దానికంటే ఎక్కువమంది భోజనానికి వచ్చినప్పుడు, చేసినవంట సరిపోదని తోచినప్పుడు, ప్రతి ఒక్కరికీ రేషనుప్రకారం పెట్ట వలసిన ఆహారాన్ని తగ్గించి, అందరినీ సంతృప్తి పరచవలసిన బాధ్యత కూడా నాదే. ఈ విధంగా ఆహారం తగ్గించినప్పుడు, సోదరీమణులు నాపై ప్రసరించిన కోపదృష్టిని నే నెన్నటికీ మరువలేను. నాకై నేను ఇంత పనీ నెత్తిన వేసుకొని చేస్తున్నందుకు ప్రతిఫలంగా నా అవస్థను వాళ్ళు అర్థంచేసుకున్న తర్వాత వారి కోపమంతా మందహాసంగా మారిపోయేది. "నేను విస్సహాయ స్థితిలో వడిపోయినాను. వండిన వంట తక్కువ; భోజనానికి వస్తున్న వాళ్ళసంఖ్యకు అంతుపంతూ లేదయ్యే. చేసినవంటనే అందరికీ సమానంగా పెట్టక తప్పదు కదా?" అని ఆ సోదరీమణులకు తెలియ చెప్పేవాడివి. అంతట పరిస్థితిని అర్థం చేసుకొని, పెట్టినదానితో తృప్తిపడ్డామని చెప్పి, చిరునవ్వు నవ్వుతూ వెళ్లిపోయే వాళ్ళు.

---

## 37. మహా యాత్ర (i)

ఛార్లెస్ టౌన్ నుంచి బయలుదేర వలసిన సమయం వచ్చింది. వివాహాలు ఏర్పాటు చేసుకోవాలనే ఉద్దేశంతో మేము ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశించడం. లేదని, దక్షిణాఫ్రికా మంత్రి తన వాగ్దానానికి భిన్నంగా

ప్రవర్తించి నందువల్ల శక్తికొద్దీ ఆక్షేపణను తెలియజేయడమే మా ఉద్దేశ మనీ, ఆత్మ గౌరవాన్ని కోల్పోయిన మేము కేవలం మా విచారాన్ని ప్రదర్శించడమే ఇందుకు కారణమనీ ప్రభుత్వానికి ఒక లేఖవ్రాశాను. ఛార్లెస్ టౌనులో వుండగానే మమ్ములను దయచేసి అరెస్టు చేసినట్లయితే ప్రభుత్వం మా ఆదుర్దాను తొలగించిన దవుతుందని కూడా తెలియజేశాను. ఆ విధంగా అరెస్టు చేయనిపక్షంలో, మాలో ఎవరైనా రహస్యంగా ట్రాన్స్వాల్‌లో ప్రవేశించినట్లయితే అందుకు బాధ్యులం మేము కాజాల మని కూడా విశదీకరించాను. మా ఉద్యమంలో రహస్యమనేది లేదు. మాలో ఎవరికీ స్వార్థ కాంక్షలేదు. ట్రాన్స్వాల్‌లో రహస్యంగా ప్రవేశిం చడమన్నది, మాలో ఎవరికీ సమ్మతమైన విషయంకాదు. ఐతే, ఇదివేల కొద్దీవున్న అపరిచిత జనంతో కూడుకున్న విషయంకాబట్టి, ఒకవేళ ఎవ రైనా రహస్యంగా ట్రాన్స్వాల్‌లో ప్రవేశించినప్పటికీ, అందుకు బాధ్యులం మేముకామని తెలియజేశాను. మాలో ఒకరిమీద ఒకరికి ప్రేమతప్ప ఏ ఇతర అధికారమూలేదని కూడా వ్యక్తపరిచాను. మూడుపౌనుల పన్ను పద్ధతిని రద్దుచేసే పక్షంలో సమ్మె విరమించడ మవుతుందనీ, కార్మికులం దరూ తమ తమ పనులకు తిరిగి వెళ్ళుతారనీ, మా మిగతా కష్టనిష్ఠురాలు నివారించుకోడానికి సాగిస్తున్న ప్రధానోద్యమంలో చేరవలసిందని ఆ కార్మి కులను మేము కోరబోవడం లేదనీ కూడా ప్రభుత్వానికి హామీ ఇచ్చాను.

మొత్తంమీద పరిస్థితి సందిగ్ధంగా పరిణమించింది. ప్రభుత్వం మమ్ములను ఎప్పుడు అరెస్టు చేస్తుందో తెలియదు. ఇలాంటి విష మావ స్థలో ప్రభుత్వ సమాధానం కోసం అంతులేకుండా నిరీక్షించడానికి వీల్లేదు. ఛార్లెస్ టౌన్ నుంచి ప్రయాణం కావలసిందేననీ, ప్రభుత్వం అరెస్టు చేయక పోయినట్లయితే, నిర్ణీతమైన తేదీనాటికి ట్రాన్స్వాల్‌లో ప్రవేశించ వలసిందేననీ నిర్ణయించు కున్నాము. మార్గమధ్యంలో అరెస్టుగాక పోయిన ట్లయితే, ఈ "శాంతిసేన" రోజు ఒకటికి ఇరవై లేక ఇరవైనాల్గు మైళ్ళ

వంతున ఎనిమిదిరోజుల పాటు ప్రయాణంచేసి, టాల్‌స్టాయి కేంద్రాన్ని చేరాలనీ, ఉద్యమం సమాప్త మయేవరకూ అక్కడే వుండాలనీ, ఆ కేంద్రంలోనే పనిచేసి దాన్ని నడపాలనీ కూడా ఆలోచించుకున్నాము. కాలెంబాచ్ అవసరమైన ఏర్పాట్లన్నీ చేశాడు. యాత్రికుల సహాయంతో కేంద్రంలోనే మట్టి గుడిసెలు కట్టించాలని ఉద్దేశించాము. గుడిసెలు నిర్మిస్తున్న సమయంలో వృద్ధులనూ, దుర్బలులనూ చిన్నచిన్న గుడారాలువేసి వాటిలో వుంచుదా మనుకున్నాము. శరీర దార్ఢ్యత గలవారందరూ ఆరుబైటే నివసించాలి. ఐతే, ఇందులో ఒక చిక్కుకూడా లేకపోలేదు. తొలకరి ప్రారంభం కాబోతున్నది. వాన కురుస్తున్నప్పుడు తల దాచుకోడానికి ప్రతివారికీ ఆశ్రయం అవసరం. ఏదోవిధంగా ఈ సమస్యను పరిష్కరించవచ్చుననే ధైర్యం కాలెంబాచ్‌కు బాగావున్నది.

యాత్ర సాగించడానికి సన్నాహాలన్నీ జరిపాము. ఛార్లెస్‌టౌన్ హెల్త్ ఆఫీసరు డాక్టర్ బ్రిస్కో సదయ హృదయుడు. మొదటినుంచీ మా ఎడల ఎంతో సానుభూతి చూపినవాడు. చిన్న ఔషధాల పెట్టె ఒకటి తయారుచేసి మాకు ఇచ్చాడు. వైద్య—శాస్త్ర జ్ఞానంలేని నాబోటివాళ్ళు కూడా ఉపయోగించడానికి వీలైన కొన్నివైద్య పరికరాలను సైతం బహూకరించాడు. మా యాత్రికులకు వాహన సౌకర్యమేదీ లేదుకాబట్టి, ఈ మందుల పెట్టెను మా వెంట మోసుకువెళ్ళాము. ఇందులోవున్న మందులు ఒకేసారి వాడితే, ఒక వందమందికి కూడా సరిపోవు. ఏరోజుకారోజు ఏదో ఒక గ్రామానికి సమీపంలోనే మకాం వేస్తుంటాము కాబట్టి మందులున్నా లేకపోయినా ఫరవాలేదనిపించింది. ఈ పెట్టెలోవున్న మందులలో ఏవైనా అయిపోతే, గ్రామంలోకి వెళ్ళి తెచ్చుకోవచ్చు ననుకున్నాము. అస్వస్థులైన వారినీ, అశక్తులైనవారినీ మార్గమధ్యంలోని గ్రామాలలోనే వదలివేసి వెళ్ళడానికి కూడా ఏర్పాట్లు చేశాము

రొట్టె, చక్కెర—ఇవే మా ఆహారంలో ముఖ్యమైనవి. ఎనిమిది

రోజుల ప్రయాణంలో మాకు రొట్టె ఎప్పటి కప్పుడు సక్రమంగా అందే ట్లు చేసుకోవడం ఎలా? ప్రతిరోజూ రొట్టె యాత్రికులకు ఇవ్వకతప్పదు. దాన్ని నిల్వచేసి వుంచడానికి వీల్లేదయ్యె. ఈ సమస్యను పరిష్కరించడానికి మార్గం ఒకటే. మేము ఏ మజిలీలో వుంటే, ఆ మజిలీకి ఎవరిచేత నైనా రొట్టె సప్లయి చేయించుకోవడమే మార్గాంతరం. కాని మాకు ఎవరు సప్లయి చేస్తారు? రొట్టె తయారుచేసే భారతీయు లెవరూలేరు. పైగా ప్రతిగ్రామంలోనూ రొట్టె తయారు చేసేవాడు వుండడు. రొట్టె సప్లయి విషయంలో గ్రామాలు నగరాలపై ఆధారపడి వుంటవి. అందు వల్ల సమీపంలోని రైల్వేస్టేషనుకు రైలుద్వారా సప్లయి చేయించుకో వాలి. వోక్రస్ట్ పట్టణం ఛార్లెస్ టౌనుకు దాదాపు రెట్టింపు వుంటుంది అక్కడ ఒక పెద్ద యూరపియన్ రొట్టెల దుకాణంవున్నది. మేము ఎక్కడ మజిలీచేస్తే, అక్కడికి రొట్టె సప్లయి చేయడానికి ఈ దుకాణ దారు సమ్మతించాడు. మా అవస్థనూ, అవసరాన్నీ అవకాశంగా తీసుకొని మార్కెటు ధరకంటె ఎక్కువ ధర ఇవ్వవలసిందని ఈ దుకాణదారు మమ్ములను కోరలేదు. భేషైన పిండితో తయారుచేసిన రొట్టెలనే మాకు సప్లయి చేసేవాడు. అనుకున్నవేళకు సరిగా రైలులో రొట్టె మాకు పంపేవాడు. రైల్వే అధికారులు (యూరపియనులు సైతం) దాన్ని సవ్యంగా మాకు అందజేయడమేగాక, రైలులో వుండగాకూడా దాన్నిగురించి బహు శ్రద్ధతీసుకునేవాళ్ళు. ఈ విషయంలో మాకు వాళ్ళు కొన్ని ప్రత్యేక సౌకర్యాలనుకూడా కలుగజేశారు. ఎవరిమీదా మాకు ఏకోశానా శతృత్వం లేదనీ, ఏ ప్రాణికీ అపాయం కలిగించాలని తలపెట్టలేదనీ, ఆత్మాహుతిద్వారా మా కష్టాలను మేము నివారించుకో డానికి కృషిచేస్తున్నామనీ ఆ ఉద్యోగులకు తెలుసు. మా చుట్టూవున్న వాతావరణం ఈవిధంగా పవిత్రమైందన్నమాట. రోజులు గడిచినప్పటికీ, ఈ పవిత్రతలో మార్పేమీ రాలేదు. సర్వ మానవకోటిలోనూ నిగూఢమై

వుండే సహజ ప్రేమభావం ప్రజ్వలితమైందన్నమాట. క్రిస్టియనులు, యూదులు, హిందువులు, ముసల్మానులు, అన్యమతస్థులు అందరూ సోదరులేనని ప్రతివ్యక్తి అవగాహన చేసుకున్నాడు.

యాత్రకు సన్నాహాలన్నీ పూర్తి అయిన తర్వాత, పరిష్కార సాధనకు మరొక ప్రయత్నం చేసిచూశాను. అప్పటికే అనేక లేఖలు, తంతివార్తలు పంపించివున్నాము. ఈసారి జనరల్ స్మట్స్‌కు టెలిఫోను చేశాను. అరనిమిషంసేపులో నాకు ఈ క్రింది సమాధానం వచ్చింది— "జనరల్ స్మట్స్ నీతో ఏవిధమైన ప్రమేయాన్నీ పెట్టుకోడు. ఇక నీ ఇష్టం వచ్చినట్లు చేయవచ్చు." ఈ మాటలు చెప్పి టెలిఫోన్ మూసివేశారు. పర్యవసానం ఈ విధంగా వుండబోతుందని ముందుగా ఊహించే వున్నాను. సమాధానం ఇంత కట్టె విరిచినట్లుగా వుంటుందనిమాత్రం అనుకోలేదు. మరుసటిరోజు (1913, నవంబరు 6-వ తేదీ) అనుకున్న వేళకు (ఉదయం 6-30 గంటలకు) ప్రార్థన ముగించుకొని, భగవంతుడిపై భారంవేసి, యాత్ర ప్రారంభించాము. యాత్రికులలో 2,037 మంది పురుషులు, 127 మంది స్త్రీలు, 57 మంది బాల బాలికలు వున్నారు.

---

# 38. మహాయాత్ర (ii)

ఛార్లెస్ టౌన్‌కు మైలుదూరంలోనే ఒక చిన్న నీటిబుగ్గ వున్నది. ఆ నీటిబుగ్గ దాటగానే వోక్‌స్రస్ట్ పట్టణంలో ప్రవేశిస్తాము. దాన్ని చేరితే ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశించినట్లే. అశ్వారూఢులైన కొద్దిమంది పోలీసు భటులు సరిహద్దులో పహరావున్నారు. సైగ చేయగానే సరిహద్దుదాటి రావలసిందని నా సహచరులకు ఆజ్ఞాపించి, నేను ఆ పోలీసు భటులవద్దకు వెళ్ళాను. నేను పోలీసులతో మాట్లాడుతూనే వున్నాను. అంతలో నా సహచరులు ఒక్క ఉరిగిని ముందుకు తోసుకువచ్చి, సరిహద్దు దాటారు.

పోలీసులు వారిని అరికట్టడానికి ప్రయత్నించారు. ముందుకు తోసుకు వస్తున్న మూకను ఆపడం వారికి సులభమైన పనిగా కనబడలేదు. మమ్ము లను అరెస్టుచేసే ఉద్దేశం పోలీసులకు లేదు. నా అనుచరులకు నచ్చచెప్పి, వారందరినీ బారులుతీర్చి నిలబెట్టాను. కొన్ని నిమిషాల వ్యవధిలోనే నా అనుచరులలో ఒక విధమైన కట్టుబాటు ఏర్పడింది. ట్రాన్స్‌వాల్‌లో ప్రవే శించడం ప్రారంభించాము.

మేము ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశించడానికి రెండురోజులక్రితం, వోక్‌స్రస్ట్‌లోని యూరపియనులందరూ సమావేశమై మమ్ములను అనేక విధాల బెదిరించారు. ట్రాన్స్‌వాల్‌లో మేము ప్రవేశిస్తే, తుపాకులతో కాల్చివేస్తామని కొందరన్నారు. భారతీయుల సమస్యను యూరపియనులకు విశదీకరించాలనే ఉద్దేశంతో కాలెంబాచ్‌కూడా ఆ సమావేశానికి హాజరై నాడు. ఐతే, ఆ యూరపియనులు అతడి ఉపన్యాసం వినడానికే ఇష్ట పడలేదు.

ఈ సమావేశాన్ని గురించి మేము ముందుగానే విన్నాము. వోక్ స్రస్ట్‌లో యూరపియనులు ఏవిధమైన అల్లరిచేసినప్పటికీ, భరించడానికి సిద్ధ పడే వెళ్ళాము. ఈ యూరపియనులను అరికట్టడానికే ఇంతమంది పోలీ సులను సరిహద్దులో అధికార్లు సమాయత్తపరిచి వుండవచ్చు. పోలీసులు అక్కడ ఎందుకోసం వున్నప్పటికీ, మా జనం ఆ ప్రదేశాన్ని ప్రశాంతంగా దాటగలిగింది. ఒక్క యూరపియనుకూడా మమ్ములను పరిహసించినట్లు జ్ఞాపకంలేదు. ఈ వింతదృశ్యాన్ని చూడడానికి అందరూ వెలుపలికి వచ్చారు. కొందరి కళ్ళలో స్నేహభావంపైతం ద్యోతకమైంది.

మొదటిరోజు రాత్రి వోక్‌స్రస్ట్‌కు ఎనిమిదిమైళ్ళ దూరంలోవున్న పామ్‌ఫోర్డ్‌లో వుండిపోవలసి వచ్చింది. ఆ సాయంత్రం దాదాపు ఐదు గంటలకు పామ్‌ఫోర్డ్ చేరాము. మా అనుచరులందరూ రొట్టె, చక్కెర తిని ఆరుబైట విశ్రమించారు. కొంతమంది లోకాభిరామాయణం మాట్లాడు

కుంటున్నారు; మరికొంతమంది భజనకీర్తనలు పాడుకుంటున్నారు. స్త్రీలలో కొందరు నడకవల్ల పూర్తిగా డస్సిపోయినారు. చంటిపిల్లలను ఎత్తుకున్న స్త్రీలు అంతదూరమూ నడిచారు; ఇక నడవలేకున్నారు. లోగడ చేసిన సూచన ప్రకారం ఆ ఆడవాళ్ళను నమ్మకస్థుడైన ఒక భారతీయ వ్యాపారస్థుడికి అప్పగించాను. టాల్‌స్టాయ్ కేంద్రం వరకూ మమ్ములను అధికార్లు పోనిచ్చే పక్షంలో వాళ్ళనూ అక్కడికి చేరుస్తానని ఆ వ్యాపారస్థుడు మాట ఇచ్చాడు. లేక, మమ్ములను మధ్యలో అరెస్టుచేసేట్లయితే. వారందరినీ ఎవరి ఇళ్ళకు వాళ్ళను పంపిస్తానని కూడా చెప్పాడు.

రాత్రి పొద్దు పోయింది. అందరూ సద్దుమణిగారు. నేనూ విశ్రమించడానికి తయారవుతున్నాను. ఇంతలో ఎవరో వస్తున్నట్లు కాలి చప్పుడు వినవచ్చింది. లాంతరు చేతపుచ్చుకొని ఒక యూరపియన్ ఆఫీసరు వచ్చాడు. అతడి రాకకు ఉద్దేశమేమిటో నాకు బోధపడింది. ఏది ఎలాగైనప్పటికీ నేను ముందుగా చేసుకోవలసిన ప్రయత్నాలేవీ లేవు. ఆ పోలీసు ఆఫీసరు ఇలా అన్నాడు—

"మిమ్ములను అరెస్టు చేయడానికి వారంటు తెచ్చాను."

"అరెస్టుచేయడం ఎప్పుడు?" అని ప్రశ్నించాను.

"ఇప్పుడే" నన్నాడు.

"అరెస్టుచేసి నన్నెక్కడికి తీసుకు వెళ్ళుతారు?" అని అడిగాను.

"పక్కనేవున్న రైల్వేస్టేషనుకు. రైలు దొరకగానే అక్కడినుంచి వోక్‌స్రస్ట్‌కు" అని అన్నాడు.

"ఎవరికీ చెప్పకుండానే మీవెంట వచ్చేస్తాను. నా సహచరులలో ఒకరికిమాత్రం రెండు మాటలు చెబుతాను" అని అనుమతి కోరాను.

"సరే, కానివ్వండి" అని అన్నాడు.

నా దగ్గరగా నిద్రపోతున్న పి. కే. నాయుడిని లేపాను. నా అరెస్టు వర్తమానం అతడికిచెప్పి, ఉదయంవరకూ మిగతావారి నెవరినీ నిద్రలేప

వద్దని కోరాను తెల్లవారగానే యథాప్రకారం యాత్ర సాగించవలసిందని కూడా చెప్పాను. సూర్యోదయం గాకపూర్వమే ప్రయాణంప్రారంభించ వలసిందనీ, ఆ ఉదయానికి ప్రయాణం ఆపి ఎవరిరేషను వారికి ఇచ్చే సమయంలో నా అరెస్టు విషయం వాళ్ళకు చెప్పవలసిందనీ కూడా నాయుడిని కోరాను. ఈలోపుగానే ఎవరైనా నన్నుగురించి విచారించిన ట్లయితే, అరెస్టు వర్తమానం చెప్పివేయవచ్చునవికూడా తెలియజేశాను. మిగతావారిలో ఎవరినైనా అరెస్టుచేస్తే ఎవరూ ప్రతిఘటించకూడదని హెచ్చరిక చేశాను. అరెస్టు కానిపక్షంలో, అనుకున్నప్రకారం యాత్ర సాగవలసిందే నన్నాను. నాయుడికి ఏవిధమైన భయాలూలేవు. అధికార్లు తననుకూడా అరెస్టుచేస్తే, ఏమి చేయవలసిందీ అతడికి చెప్పాను. అప్పుడు కాలెంబాచ్ వోక్‌స్రస్ట్‌లో వున్నాడు.

పోలీసు ఆఫీసరువెంట నేను వెళ్ళిపోయినాను. మరునటి ఉదయం ఇద్దరమూ రైలుఎక్కి వోక్ స్రస్ట్‌కు వెళ్ళాము. ఆ వూరికోర్టులో నన్ను హాజరు పెట్టారు. సాక్ష్యం తయారుగాలేదు. కాబట్టి, 14 వతేదీ వరకూ నన్ను "రిమాండు"లో వుంచవలసిందని పబ్లిక్ ప్రాసిక్యూటర్ కోరాడు రెండువేలమంది పురుషులు, 122 మంది స్త్రీలు, 50 మంది బాలబాలికలు నా అదుపులో వున్నారనీ, వారందరినీ గడువులోపుగా గమ్యస్థానాన్ని చేర్చవలసి వున్నదనీ చెప్పి, జామీనుమీద విడుదల చేయవలసిందని దర ఖాస్తు పెట్టాను. పబ్లిక్ ప్రాసిక్యూటర్ నా దరఖాస్తుకు ప్రతికూలంగా వాదించాడు. మరణశిక్ష విధించని ప్రతిఖైదీకి తిరిగి కోర్టుకు హాజరయే షరతుపైన జామీను ఇవ్వడానికి న్యాయశాస్త్రం అంగీకరిస్తుంది. మేజి స్ట్రేటు ఈ విషయంలో నిస్సహాయుడైనాడు. నన్ను జామీనుపై విడుదల చేయక తప్పలేదు. కాలెంబాచ్ నా కోసం కారుసిద్ధంగా వుంచాడు. విడు దలైన తక్షణమే నన్ను కారులో యాత్రికులవద్దకు తీసుకుపోయినాడు.

యాత్ర ప్రారంభించాము. కాని, నన్ను యథేచ్ఛగా వదలివేయడం

ప్రభుత్వానికి సరిపడలేదు. స్టాండర్టన్ పట్టణంలో 8 వ తేదీన తిరిగి నన్ను అరెస్టుచేశారు. స్టాండర్టన్ మిగతా వాటికంటే కొంచం పెద్దపట్టణమే. ఈ సారి నన్ను అరెస్టుచేసిన పద్ధతి మొత్తంమీద కొంతవరకు వింతగానే వున్నది. యాత్రికులందరికీ రొట్టె పంచి పెడుతున్నాను. స్టాండర్టన్ లోని భారతీయ వ్యాపారస్థులు మాకు కొన్ని మిఠాయి డబ్బాలను బహుమతిగా ఇచ్చారు. ఆ కారణంచేత రొట్టె, మిఠాయి అందరికి పంచిపెట్టడానికి మామూలుకంటే ఎక్కువసేపు పట్టింది. ఈ లోపుగా మెజస్ట్రీటు వచ్చి నా పక్కనే నిలుచున్నాడు. రొట్టె, మిఠాయి అందరికీ పంచిపెట్టడం పూర్తి అయేవరకూచూస్తూ వూరుకున్నాడు. అప్పుడు నన్ను పక్కకు పిలిచాడు. అతడు నాకు తెలిసిన పెద్దమనిషే. నాతో ఏదైనా మాట్లాడడానికి వచ్చాడేమో కదా అనుకున్నాను. చివరకు నవ్వి ఇలా అన్నాడు—

"మీరు నా ఖైదీ."

"నన్ను అరెస్టు చేయవలసిందని ఇప్పుడు ఉత్తర్వులు పోలీసు అధికార్లకు గాక, మెజస్ట్రీట్లకే వస్తున్న వన్నమాట. అధికార్లు నా హోదాను పెంచుతున్నట్లు కనిపిస్తున్నదే! ఇప్పుడే విచారణకూడా జరిపి వేస్తారా?" అన్నాను.

"నాతోరండి. కోర్టుఇంకా జరుగుతునే వున్నది" అన్నాడు. యాత్ర యధాప్రకారం సాగించవలసిందని జనానికి చెప్పి, మెజస్ట్రీటుతో బయలుదేరాను. కోర్టుకు చేరాను. నా సహచరులు కూడా కొంతమంది అరెస్టయి కోర్టుకు వచ్చారు.

నన్ను వెంటనే కోర్టువారి ఎదుట హాజరుపరిచారు. వోక్రస్ట్‌లో వలెనే జామీనుమీద విడుదల చేయవలసిందని దరఖాస్తు పెట్టాను. ఇక్కడకూడా నా జామీను దరఖాస్తుకు పబ్లిక్ ప్రాసిక్యూటర్ తీవ్ర ప్రతికూలవాదన సాగించాడు. 50 పౌనులకు బాండు వ్రాసిఇచ్చినమీదట, ఈ కోర్టులో కూడా నన్ను విడుదలచేశారు. కేసు 21 వ తేదీకి వాయిదాపడ్డది.

భారతీయ వ్యాపారస్థులు నా కోసం వాహనం ఒకటి తయారుగావుంచారు. నా అనుచరులు మూడుమైళ్ళు ముందుకు వెళ్ళారో లేదో. నేనూ వెళ్ళి వారిని కలుసుకున్నాను. ఇక మేము టాల్‌స్టాయి కేంద్రం చేరవచ్చునని నేనూ అనుకున్నాను; నా సహచరులూ అనుకున్నారు. కాని, అలాజరుగ లేదు. నా అరెస్టులకు నా అనుచరులు అలవాటు పడ్డారంటే అది చిన్నవి షయంకాదు. సహచరులలో ఐదుగురు మాత్రం జైలులోనే వుండిపోయి నారు.

జోహెనెస్‌బర్గ్ దరిదాపులకు చేరుతున్నాము. మా యాత్రను మొత్తం ఎనిమిది మజిలీలలోకి విభజించిన విషయం పాఠకులకు జ్ఞాపకం వుండే వుంటుంది. ఇప్పటివరకూ యాత్రను తు. చ తప్పకుండా అను కున్న కార్యక్రమం ప్రకారం సాగించగలిగాము. ఇక నాల్గురోజుల ప్రయాణం మాత్రమే మిగిలివున్నది. ఆ రోజు కా రోజు మా ఉత్సాహం అతిశయిస్తున్నది. మా ఉత్సాహాతి శయంతోపాటు, భారతీయులు తమపై ప్రారంభించిన దండయాత్రను ఏ విధంగా ఎదుర్కొనడమనే ఆందోళన ప్రభుత్వానికి కూడా ఎక్కువ కాసాగింది. గమ్యస్థానం చేరినతర్వాత మమ్ములను అరెస్టు చేసేపక్షంలో, ప్రభుత్వం దౌర్బల్యాన్ని కనబరిచిం దనీ, చాకచక్యం చూపలేక పోయిందనీ అందరూ ఆరోపిస్తారు. అరెస్టు చేయదలిస్తే, మేము అనుకున్నచోటు చేరక పూర్వమే చేయాలి.

సరిగా ఇదేసమయంలో గోపాలకృష్ణ గోఖ్లే, హెన్రీ పోలక్‌ను భారతదేశానికి పంపవలసిందని కోరుతూ కేబుల్ వార్త పంపాడు. హెన్రీ పోలక్ ఫినిక్స్ ఆశ్రమంలో మాతోపాటు కష్టసుఖాలు అనుభవించినవాడు. దక్షిణాఫ్రికాలో భారతీయుల పరిస్థితిని గురించి ఇండియా ప్రభుత్వానికీ, సామ్రాజ్యప్రభుత్వానికీ వివరాలను తెలియజేయ బోతున్నాడనీ, ఈ విష యంలో పోలక్ సహాయం తనకుకావాలనీ గోఖ్లే కేబుల్ వార్తలో తెలియ జేశాడు. పోలక్‌ను భారతదేశం పంపడానికి మేము సమ్మతించాము. వెళ్ళి

తీరవలసిందేనవి అతడికి నే నొక ఉత్తరం వ్రాశాను. నన్ను స్వయంగా కలుసుకోకుండా, నా ఉత్తర్వులు పొందకుండా భారత దేశం వెళ్ళడానికి పోలక్ ఒప్పకొనలేదు. మా యాత్ర జరుగుతూండగానే వచ్చి నన్ను కలుసు కుంటానని జవాబు వ్రాశాడు. ఆ ఉద్దేశం వున్నట్లయితే, వచ్చి కలుసుకో వచ్చునవి తంతివార్త పంపాను. ఐతే, నా వద్దకు వస్తే, అరెస్టయే ప్రమాదం వున్నదనికూడా ఆ తంతివార్తలోనే అతడికి తెలియజేశాను.

అరెస్టు కాగల ప్రమాదం వున్నప్పటికీ, నా సలహాపొంద వలెననే ఉద్దేశంతో హెన్రీ పోలక్ 9వ తేదీన టీక్‌వర్త్ అనేగ్రామంవద్దకు వచ్చి మమ్ములను కలుసుకున్నాడు. టీక్‌వర్త్ గ్రామం స్టాండర్టన్, గ్రేలింగ్ స్టాడ్ అనే రెండు పట్టణాలమధ్య వున్నది. మేము సమాలోచనలు జరు పుకుంటున్నాము. సాయంత్రం దాదాపు మూడుగంటలై వుంటుంది. యా త్రికులందరూ వెనుక, పోలక్, నేనూ ముందూ నడుస్తున్నాము. నా సహ చరులలో కొంతమంది మా సంభాషణ వింటూనే వున్నారు. ఆ సాయం త్రం రైలులో పోలక్ డర్బాన్‌కు బయలుదేరాలని నిర్ణయించాము. కాని ఏమిలాభం ? మానవుడి ఆలోచనలను భగవంతుడు ఎన్నడూ సరిగా సాగ నివ్వడు. మేము ఉభయులం మాట్లాడుతూ వుండగానే, ఒక బండివచ్చి మా ముందు ఆగింది. ట్రాన్స్‌వాల్ ప్రభుత్వానికి చెందిన ప్రధాన వలస శాఖోద్యోగి చామ్నీ, మరొక పోలీసు ఆఫీసరు ఆ బండిలోనుంచి దిగారు. నన్ను పక్కకుపిలిచి వారిద్దరిలో ఒకరు, "నిన్ను అరెస్టు చేస్తున్నాను" అన్నాడు.

నాల్గురోజుల వ్యవధిలో నన్ను అరెస్టుచేయడం ఇది మూడవసారి.

"ఐతే, మిగత యాత్రికుల మాటేమిటి ? " అన్నాను.

"వాళ్ళసంగతి చూస్తాం." అని బదులు చెప్పాడు.

ఇక వారితో నేనేమి మాట్లాడలేదు. నాయకత్వం వహించి యాత్రి కులతోపాటు ముందుకు వెళ్ళవలసిందని పోలక్‌కు చెప్పాను. అనుచరులకు

నా అరెస్టు వర్తమానం చెప్పడానికి మాత్రమే పోలీస్ ఆఫీసరు నాకు అను మతిఇచ్చారు. శాంతిని కాపాడవలసిందని కోరి యాత్రికులకు ఇంకా ఏవేవో చెప్పబోతుండగా, ఆఫీసరు, "నీవు ఖైదీవి. ఏ విధమైన ఉపన్యాసాలూ ఇవ్వడానికి వీల్లేదు." అని అడ్డుపడ్డాడు.

నా పరిస్థితి నాకు అర్థమైంది. ఆ ఆఫీసరు నన్ను మాట్లాడ వద్దంటూనే. వేగంగా తోలవలసిందని బండివాడిని ఆజ్ఞాపించాడు. ఒకక్షణంలో నా అనుచరులు కనుచూపు దూరాన్ని దాటిపోయినారు.

నన్ను గ్రేలింగ్ స్టాడ్‌కు తీసుకువెళ్ళి, అక్కడినుంచి బాల్ఫోర్ మీదుగా హీడెల్ బర్గ్ చేర్చారు. ఆ రాత్రి అక్కడ గడిపాను.

పోలక్ నాయకత్వం కింద మా దండు ముందుకుసాగి, ఆ రాత్రికి గ్రేలింగ్ స్టాడ్‌లో నిలిచిపోయింది. 10వ తేదీ ఉదయం 9 గంటలకు వారందరూ బాల్ఫోర్ చేరారు. వాళ్ళను అరెస్టుచేసి, నెటాల్‌కు పంపించాలనే ఉద్దేశంతో ఆ వూరి రైల్వేస్టేషనులో మూడు ప్రత్యేక రైలుబళ్లను అధికార్లు సిద్ధంచేశారు. నా అనుచరులు అందుకు అంగీకరించలేదు. రైళ్ళు ఎక్కడాని: నిరాకరించారు. నన్ను పిలవనంప వలసిందనీ, నేను సలహా ఇచ్చేపక్షంలో అరెస్టయి, రైళ్ళెక్కడానికి ఒప్పుకుంటామనీ తెలియజేశారు. పోలక్, కచేలియా సేఠ్ ఇద్దరూ మొదటినుంచీ తమ గమ్యస్థానం కారాగారమేనని హితబోధచేసి వారికి నచ్చచెప్పారు. చివరకు యాత్రికులు ఆ వాదనను అంగీకరించి, శాంతియుతంగా రైలు ఎక్కారు.

---

# 39. సత్యాగ్రహ విజయం

నన్ను మళ్ళీ మెజిస్ట్రేటు ఎదుట హాజరుపెట్టారు. ఈ సారి నన్ను డండీనుంచి జారీఅయిన వారంటు ఉత్తర్వుతో అరెస్టుచేశారు. అరెస్టుచేసిన రోజునే డండీకి రైలులో తీసుకు వెళ్ళారు.

బాల్ఫోర్‌లో పోలక్‌ను అరెస్టుచేయక పోవడమే గాక, ఆయన చేసిన సహాయానికి అధికార్లు అభివందనాలు సైతం తెలిపారు. ఐతే, పోలక్‌ను చివరకు ఛార్లెస్ టౌను స్టేషనులో, రైలుకోసం ఎదురుచూస్తుండగా అరెస్టుచేశారు. కాలెంబాచ్‌ని కూడా అరెస్టుచేసి, వీ రిద్దరినీ వోక్‌్రస్ట్ జైలులో పెట్టారు.

నన్ను డండీలో 11 వ తేదీన విచారించి, తొమ్మిదినెలలు విడి ఖైదూ, కఠిన కార్మికశిక్ష విధించారు. నిషిద్ధ వ్యక్తులను ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశించడానికి ప్రోత్సహించి, సహాయ పడ్డాననే నేరంపై వోక్‌్రస్ట్ కోర్టులో నా మీద రెండవ విచారణ ఇంకా జరగవలసివున్నది. డండీ నుంచి 13 వ తేదీన నన్ను వోక్ ్రస్ట్‌కు తీసుకువెళ్ళారు. అక్కడ జైలులో కాలెంబాచ్‌నీ, పోలక్‌నూ కలుసుకున్నందుకు సంతోషించాను.

పోలక్, కాలెంబాచెలతోపాటు 14 వ తేదీన వోక్ ్రస్ట్ కోర్టుకు హాజరైనాను. మా ముగ్గురికీ తలా ఒక మూడునెలల కారాగార శిక్ష విధించారు. వోక్ ్రస్ట్ జైలులో కొన్నిరోజులపాటు మేము హాయిగా గడిపాము. ఏ రోజు కా రోజు ఆ జైలుకు కొత్తఖైదీలు వచ్చి చేరేవాళ్ళు. వెలుపల ఏమిజరుగుతున్నదీ వార్తలు చెబుతుండేవాళ్లు. ఈ సత్యాగ్రహ ఖైదీలలో హర్బత్‌సింగ్ అనే 75 ఏళ్ళ వృద్ధుకూడా ఒకడు వుండేవాడు. ఇతడు గనులలో పని చేసేవాడు కాదు. నిర్బంధ కార్మిక కాలాన్ని సంవత్సరాల క్రితమే పూర్తిచేశాడు. ఈ కారణాలవల్ల ఇతడు సమ్మెదార్లలో ఒకడు కాదన్నమాట. ప్రభుత్వం నన్ను అరెస్టు చేయగానే, భారతీయుల ఉత్సాహం అతిశయించింది. నెటాల్ సరిహద్దు దాటి ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశించి, చాలామంది అరెస్టయినారు ఇట్టి ఉత్సాహవంతులలో హర్బత్ సింగ్ ఒకడు.

"మీ రెందుకు జైలులో వున్నారు ? మీలాంటి వృద్ధులను జైలుకు రావలసిందని నేను పిలవలేదే," అన్నాను. హర్బత్ సింగ్‌తో.

"మీరూ, మీభార్య, చివరకు మీకుర్రవాళ్ళుకూడా మాకోసం జైలుకు వచ్చారుకదా! ఐనప్పుడు, నేనుమాత్రం రాకుండా ఎల్లావుండగలను ?" అన్నాడాయన.

"జైలు జీవితంలో వున్న కష్టాలకు తట్టుకునే దార్ఢ్యత మీకు లేదే మరి? విడుదల చేయించుకొని వెళ్లిపో వలసిందని నా సలహా. మీ విడుదలకు ఏర్పాటు చేసిపెట్టనా ?" అని అడిగాను.

"దయచేసి వూరుకోండి. ఏమైనా సరే జైలునుంచి వెళ్ళిపోను. చావు ఎల్లాగూ దగ్గిర పడ్డదికదా! జైలులోనే చచ్చిపోతే, ఎంతో సంతోషిస్తాను!" అన్నాడు హర్‌బత్ సింగ్.

ఇంత అచంచల దీక్షాబలంతో వున్న వ్యక్తి మనస్సును మార్చ వలసిన అగత్యం నా కేమీ కనబడలేదు. అక్షరజ్ఞానం లేకపోయినప్పటికీ, ఋషి సమానుడైన ఈ మహనీయునికి నా నమోవాక్కులు సమర్పించాను. ఇతని మనోభీష్టం నెరవేరింది. హర్బత్‌సింగ్ 1914, జనవరి 5 తేదీన జైలులోనే మరణించాడు. వందలాది భారతీయుల సమక్షంలో హిందూమతాచారరీత్యా, ఇతడి భౌతిక శరీరానికి అఖండ గౌరవంతో అంత్యక్రియలు జరిగినవి. మేము ప్రారంభించిన సత్యాగ్రహ సమరంలో హర్బత్ సింగ్‌ను పోలినవాళ్ళు ఒకరు, ఇద్దరు కాదు అనేకమంది వున్నారు. కాని, జైలులో ప్రాణా లర్పించడమనే మహాదృష్టం ఒక్క హర్బత్‌సింగ్‌కు మాత్రమే పట్టింది. కాబట్టి, దక్షిణాఫ్రికా సత్యాగ్రహ చరిత్రలో ఇతడి గాథ గౌరవ పురస్కారంగా లిఖింప దగినది.

ఇక యాత్రసాగిస్తున్న అనుచరుల సంగతికి వద్దాము. ప్రత్యేక రైలుబళ్ళలో వారందరినీ ఎక్కించుకొని నెటాల్‌కు చేర్చారు. వెంటనే అందరినీ కారాగారంలో బంధించారు. ప్రభుత్వం గనుల చుట్టూ తీగె కరలు వేయించింది. డండీ, న్యూకాజిల్ కారాగారాలకు ఆ గనులను బాహ్య కేంద్రాలుగా ప్రభుత్వం ప్రకటించింది. కార్మికులను గనులవద్దనే

వుంచి వాళ్ళచేత తిరిగి పనిచేయించడం ప్రారంభించారు. దక్షిణాఫ్రికాలో భారతీయులు పడుతున్న దాస్యబాధలవల్ల. భారత దేశంలో తీవ్ర ఆగ్రహం చెలరేగింది. గోపాలకృష్ణ గోఖ్లే ఎంతో అస్వస్థతలో వుండికూడా చేసిన కృషే ఈ ఆగ్రహానికి కారణం. ఇండియా వైస్రాయి లార్డ్ హార్డింజి తన ప్రఖ్యాతో పన్యాసాన్ని ఇచ్చింది ఆ సమయంలోనే (1913, డిసెంబరు.) బ్రిటిష్ సామ్రాజ్యంలోని ఇతర ప్రాంతాల దుష్ట పరిపాలనా విధానాన్ని ఇండియన్ వైస్రాయి బాహాటంగా విమర్శించడం సాధారణంగా జరిగే విషయంకాదు. లార్డ్ హార్డింజి ఆ సమయంలో దక్షిణాఫ్రికా యూనియన్ ప్రభుత్వాన్ని తీవ్రంగా అభిశంసించడమే గాక. సత్యాగ్రహుల చర్యను హృదయ పూర్వకంగా సమర్థించాడు కూడా. ఆయన కనబరచిన స్థిరవైఖరి సర్వత్రా అమోఘమైన సదభిప్రాయాన్ని కలిగించింది. దక్షిణాఫ్రికాలో అంతట ఒక విచారణ సంఘాన్ని నియమించారు. దానిలో భారతీయు లెవరూ లేకపోయినప్పటికీ, జనరల్ స్మట్స్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపినమీదట నాకు ఒకనమ్మకం, సంతృప్తి ఏర్పడినవి. సత్యాగ్రహోద్యమం సాగించకుండానే, మా లక్ష్యం సిద్ధిస్తుందన్నదే ఈ నమ్మకం; విచారణ సంఘ నివేదిక వెలువడిన కొన్నిరోజులకే ప్రభుత్వం దక్షిణాఫ్రికా అధికార గెజెట్టులో భారతీయుల "రిలీఫ్ బిల్లు"ను ప్రకటించింది. ఏ నాడో చేకూరవలసిన పరిష్కారాన్ని ఆచరణలో పెట్టడానికే ఈ బిల్లును తయారుచేశారు. దక్షిణాఫ్రికా ప్రభుత్వం ఈ బిల్లుద్వారానే మూడుపౌనుల పన్నును రద్దు చేసింది; భారతదేశంలో ఏ వివాహాలను న్యాయశాస్త్ర సమ్మతమైనవిగా పరిగణిస్తారో ఆ వివాహాలను దక్షిణాఫ్రికాలోనూ న్యాయ సమ్మతమైనవేనని నిర్ణయించింది; ఒక్కటొటనవ్రేలు ముద్ర మాత్రం వున్న "డోమిసైల్ సర్టిఫికెటు"తో దక్షిణాఫ్రికా యూనియన్‌లో ప్రవేశించడానికి హక్కు ఇచ్చింది.

ఈ విధంగా సత్యాగ్రహ సమరం ఎనిమిది సంవత్సరాల అనం-

తరం సమాప్తమైంది. దక్షిణాఫ్రికాలో భారతీయులు ప్రస్తుతం ప్రశాంతం గానే వున్నారని తోస్తుంది.

దక్షిణాఫ్రికానుంచి భారతదేశానికి తిరిగి వచ్చేముందు 1914, జూలై 18 వ తేదీన గోపాలకృష్ణ గోఖ్లేను చూడడానికి ఓడలో ఇంగ్లం డుకు ప్రయాణమైనాను. ఆ సమయంలో నాలో ఒక విధంగా సంతోషం మరొక విధంగా విచారం రెండూ పెనవేసుకున్నవి. అనేక సంవత్సరాల తర్వాత స్వదేశానికి తిరిగి వెళ్ళుతున్నందువల్లా, గోపాలకృష్ణ గోఖ్లే నాయ కత్వం కింద మాతృదేశానికి సేవచేసే అవకాశం కోసం ఆదుర్దాతో ఎదురు చూస్తున్నందు వల్లా, సంతోషం కలిగింది; మానవ అనుభవంలోని కష్ట సుఖాలలో పూర్తిగా పాల్గొంటూ నా జీవితంలో ఇరవై ఒక్క సంవత్స రాలపాటు ఎక్కడ గడిపానో, నా జీవిత వ్యాసంగాన్ని ప్రప్రథమంగా ఎక్కడ అవగాహన చేసుకున్నానో, అట్టి ప్రాంతాన్ని (దక్షిణాఫ్రికాను) వదలివేయడం బాధకరమై తోచినందువల్ల విచారం వేసింది.

---



1883 రాజకోట హైస్కూలులో

